## సచిత్ర విచిత్రం

# సొగసైన బంగారు చేప!



ఎక్వేరియంలలో ముచ్చటగా సంచరిస్తూ, నీటిలో విన్యాసాలు చేసే గోల్డ్‌ఫిష్‌లు అందరికీ నయనానందకరంగా ఉంటాయి. వీటిల్లో అతి పెద్ద గోల్డ్‌ఫిష్‌ను పెంచి, గిన్నిస్‌బుక్‌లోకి ప్రవేశపెట్టడానికి హాంకాంగ్‌లోని ఇద్దరు మత్స్య ప్రేమికులు ప్రయత్నిస్తున్నారు. ఆ అందాల చేప మన ఇళ్లల్లో తిరిగే పిల్లి అంత పెద్దది. అంత పొడవుగా ఉంటుంది. అంత బలంగా కూడా ఉంటుంది. దాని పేరు 'బ్రూస్'. 37.2 సెం.మీ. భారీశరీరం.

లూయిస్, జాక్ సోదరులు ఎంతో శ్రద్ధతో మంచి ఆహారాన్ని ఇచ్చి దాన్ని పెంచారు. ఆ అందాల చేపతో రోజూ చక్కటి ఎక్సర్‌సైజ్‌లు చేయించడం వలన అది ఆ విధంగా పెరిగింది. చైనా ప్రభుత్వం చేత ఆ సోదరులిద్దరూ గోల్డ్‌ఫిష్‌ను ప్రశంసిస్తూ 'అది అతి పెద్దది' అనే సర్టిఫికెట్ పొందారు.

# అపురూప శిల్పాల నిలయం టుస్సాడ్ మ్యూజియం

లండన్ దర్శించడానికి వెళ్లినవారు అక్కడ చూడదగ్గ ముఖ్యమయిన విశేషాల్లో టుస్సాడ్ మ్యూజియం ఒకటి. లండన్‌లోని మార్‌లెబోన్ రోడ్‌లో వుంది ఆ అపురూపమైన మ్యూజియం. అక్కడ మీరు ప్రపంచ వ్యాప్తంగా పేరు పొందిన మహామహులను, ప్రముఖులను, కళాకారులను కలవవచ్చును. సర్గస్థులైన వారేకాక ప్రస్తుతం మన కళ్లముందు సంచరిస్తున్న ప్రముఖులు కూడా వున్నారు. కీర్తిశేషులను సహితం సజీవంగా చూస్తున్నామనే ఆనందాన్నిస్తుందా మ్యూజియం.

మేడమ్ టుస్సాడ్ ఆ మైనపు మ్యూజియం నెలకొల్పి చరిత్రలో తన పేరు సుస్థిరం చేసుకుంది. టికెట్ కౌంటర్లలో ప్రతిరోజూ పొడవైన క్యూలు వుంటూనే వుంటాయి. మ్యూజియంలోకి ప్రవేశించగానే అతిపెద్ద హాలు, మూలల్లో సజీవంగా అక్కడ నిలబడి వున్నారా అనిపించే మైనపు బొమ్మలు కనిపిస్తాయి. హాలు నుంచి వివిధ రకాల గ్యాలరీలకు వెళ్లే రూట్‌లున్నాయి.

మైనంతో రూపొందించబడిన అనేక కళాకృతులు విభిన్న భావాలను వ్యక్తపరుస్తూ ముచ్చటగొలుపుతాయి. కొన్ని గంభీరవదనంతో, మరికొన్ని మందస్మితంతో, మరికొన్ని దీర్ఘాలోచనలో మునిగినట్టు వుండి... చూపరులను మంత్రముగ్ధుల్ని చేస్తాయి. అక్కడ తిరుగాడే ప్రేక్షకులను, బొమ్మలను వేరువేరుగా చూడలేమనిపిస్తుంది. ఏవి మనుషులూ? ఏవి బొమ్మలూ అన్న ప్రశ్న ఉదయిస్తుంది.



అక్కడ 'గార్డెన్‌పార్టీ సెట్టింగ్' ఒకటి అద్భుతంగా రూపొందించబడింది. ఎందరెందరో ప్రముఖులు కాక్‌టైల్ పార్టీలో పాల్గొంటున్న భంగిమల్లో మనకు కనిపిస్తారు. ఓక్ వృక్షాలనీడలో గార్డెన్ టేబుల్ చుట్టూ శ్నాక్స్ తింటున్నట్టు కొందరు, కంచెకు సమీపంలో నిలబడి ప్రకృతి సౌందర్యాన్ని తిలకిస్తూ పానీయసేవనం చేస్తున్నట్టు మరికొందరు... సజీవ మూర్తులుగా భ్రమ కలిగిస్తారు.

హాలీవుడ్ నటులపట్ల మోజుగల ప్రేక్షకులు బ్రాడ్‌పిట్‌ను కలుసుకుని

కవర్ ఫొటోగ్రాఫర్: మధు ✲ మోడల్: రుచి

అతని భుజంపై చెయ్యి వేసి ఫొటో దిగచ్చు ఆ మైనపుబొమ్మతో. సూపర్ మోడల్ నవోమీ కాంప్‌బెల్ చిరునవ్వు లను అందుకుంటూ ఆమెతో ఫొటో దిగచ్చు. గార్డెన్ పార్టీ వున్న ప్రదేశంలో అమెరికాకు చెందిన అత్యధిక ధనాన్ని వసూలుచేసే టాక్‌షో స్టార్ ఓపెరా విన్‌ఫ్రే... చేతిలో మైక్ పట్టుకుని ప్రసంగి స్తున్నట్టు వుండి మనకు ఆనందం కలిగి స్తాడు. మెల్‌గిబ్సన్ అందమైన నవ్వును అందుకోవచ్చు. ఎలిజబెత్ టేలర్ ఎంతో సెక్సీగా మీవంక చూస్తూ ముగ్ధుల్ని చేస్తుంది. జేమ్స్‌బాండ్ వీరాభిమానులకు తొలిజేమ్స్‌బాండ్ సీన్ కానరీ ఎంతో ఛలా కీగా కనిపించి ఆశ్చర్యం కలిగిస్తాడు.



ఆ మైనపు బొమ్మల రూపకల్పన చేయడంలో ఎన్నో జాగ్రత్తలు తీసుకోబ డ్డాయి. ఆ ఆకృతులు ధరించిన దుస్తులలో చాలావాటిని వ్యక్తులే మ్యూజియంకు అంద చేశారు.

సుప్రసిద్ధ మోడల్ నవోమీ కాంప్‌బెల్ పొడవైన ఆకుపచ్చని ఈవినింగ్ డ్రెస్ ధరించి మనకు ఆనందం కలిగిస్తుంది.

ఆ దుస్తులను ప్రముఖ దుస్తుల నిపు నుడు తెర్‌శాన్ తయారుచేశాడు.

రిచర్డ్‌బర్టన్ తన ప్రేమకానుకగా విఖ్యాత నటీమణి ఎలిజబెత్‌టేలర్‌కిచ్చిన అతి ఖరీదైన పెద్ద వజ్రపుటుంగరం ఎలిజ బెత్ చేతివేలుకు మనం చూడవచ్చు. 'వైట్ డైమండ్స్' అనే పెర్‌ఫ్యూమ్ ప్రచారంకోసం ఎలిజబెత్ ఆ వుంగరం ధరించింది. సూప ర్‌స్టార్ సెక్షన్‌లో గల కళాకృతులని చూసి ముగ్ధులు కానివాళ్లుండరు. 'గోల్డెన్ ఐ' చిత్రంలో నటించిన పియర్స్ బ్రాస్నన్ అందమైన సూటూ బూటుతో అక్కడ కని పిస్తాడు. ఆ దుస్తులను చిత్ర నిర్మాతలు ఇచ్చారు.

మైనపు మ్యూజియం కొరకు సర్ ఆంథోనీ హాప్ కిన్ అనేకసార్లు శిల్పుల ముందు కూర్చోవలసి వచ్చింది. అతను ధరించిన ఈవెనింగ్ డ్రెస్ మ్యూజియంకు కానుకగా ఇచ్చాడు. ముఖాముఖీ తన డబుల్‌ని అక్కడ కలుసుకొన్నప్పుడు తనలో అవ్యక్తమైన భావాలు, ఆనందం కలిగాయని హాప్‌కిన్ అన్నాడు.

చిరకాలంకిందట మరణించినప్పటికీ నేటికీ ప్రేక్షకుల కలలరాణిగా మురిపిస్తున్న వెన్నెలబొమ్మ మారిలి న్‌మన్రో 'సెవెన్ ఇయర్స్ ఇచ్'లో తాను ధరించిన దుస్తులతో అక్కడ సాక్షాత్కరిస్తుంది. నవ్వుల రాజు ఛార్లీ చాప్లిన్ తన టోపీతో దర్శనమిచ్చి మనల్ని మనసారా నవ్వి స్తాడు. సస్పెన్స్ సిని మాల పితామహుడు ఆల్ఫ్రెడ్ హిచ్‌కాక్ అక్కడ మనకు స్థ బ్దుగా కనిపిస్తాడు. ఓరోజు ఆయన అభి మాని ఆయన్ని చూడాలనుందని ఫోన్ చేస్తే తనని తనివితీరా మైనపు మ్యూజి యంలో చూసుకోవచ్చని చెప్పాడు.

కండలవీరుడు సిల్వస్టర్‌స్టాలోన్, మైకేల్ జాక్సన్, షిల్లీ బాసీవంటి ఎందరో నటు లను, గాయకులను అక్కడ కలుసుకో వచ్చు. ఇంగ్లాండు ప్రస్తుత రాణి ఎలిజబెత్ అనేకసార్లు ఆ మ్యూజియంకు తన ఆకృ తిని కానుకగా ఇచ్చింది. మ్యూజియంపట్ల ఆమెకు అమిత ప్రేమ. తన నాలుగు

సంవత్సరాల వయసులో ఎలిజబెత్ ఒక చిన్న గుర్రంపై కూర్చుని వుండగా మ్యూజియంవారు ఆ కళాకృతిని రూపొందించారు. రెండవ ఆకృతి 1936లో ఆమె సోదరి మార్గరెట్‌తో వున్నప్పుడు, 1966లో మరొకటి రూపొందించారు. 1947లో వివాహ దుస్తుల్లో వున్నట్టు, 1953లో పట్టాభిషేక దుస్తుల్లో వున్నట్టు ఏర్పాటు చేశారు. ప్రస్తుతం అక్కడ వున్న రాణీగారి కళాకృతి 1992లో బకింగ్‌హామ్ ప్యాలెస్‌లో అందమైన దుస్తులలో వున్నట్లు రూపకల్పన చేశారు.

విషాదకర మరణానికి గురయిన సౌందర్యరాశి యువరాణి డయానాని ఒకసారి స్పెషల్ సెట్టింగ్‌లో రూపొందించారు. మరొకసారి ఆమె వివాహపు దుస్తుల్లో, ఆమె చివరి కళాకృతి కెన్సింగ్‌టన్ ప్యాలెస్‌లో రూపకల్పన చెయ్యబడింది. ఆ శిల్పం కొరకు ఆమె రెండు గంటలపాటు కళాకారులముందు ఓపిగ్గా కూర్చుంది. పిమ్మట ఆ మోడల్ తీర్చిదిద్దడానికి 6 నెలలు పట్టింది.

ప్రఖ్యాత గాయకులు బీటిల్స్‌గ్రూప్ శిల్పాలు సహితం 5 పర్యాయాలు అనేక మార్పులు చేర్పులతో అక్కడ ప్రవేశపెట్టబడ్డాయి. 1964లో వాటిని శాశ్వతంగా నెలకొల్పడం జరిగింది. మన దేశంలోని ప్రముఖులకు సహితం టుస్సాడ్ మ్యూజియంలో ప్రత్యేకస్థానం లభించి, మన భారతీయులందరికీ ప్రమోదం కలిగించింది. జాతిపిత మహాత్మాగాంధీ, ఇందిరాగాంధీ, పి.వి.నరసింహారావు, సూపర్‌స్టార్ అమితాబ్‌బచ్చన్... ఇలా కొంతమంది భారతీయ ప్రముఖుల మైనపు ఆకృతులు కూడా అక్కడ అలరిస్తాయి. అమితాబ్





కళాకృతి ఇటీవలనే ప్రవేశపెట్టబడింది. ఆ నటునికీ, మాధురీదీక్షిత్‌కీ జరిగిన పోటీలో ప్రేక్షకుల అత్యధిక ఓట్లు బచ్చన్‌కు పడ్డాయి.

మన జాతిపిత గాంధీజీ శిల్పాన్ని 1931, 1957 సంవత్సరాల్లో టుస్సాడ్ మునిమనమడు స్వయంగా రూపొందించాడు.

బాపూజీ కళ్లజోడు, పాదరక్షలు, దుస్తులు... ఆయన మనవడు దేవదాసు గాంధీ మ్యూజియంకు బహూకరించాడు.

ఈ మయసభవంటి మహాద్భుత మ్యూజియంను రూపొందించిన మేడమ్ టుస్సాడ్ బాల్యంలో ఎన్నెన్నో కష్టాలు అనుభవించింది. ఆమె అసలు పేరు మేరీ గ్రోస్ హోల్డ్. ఆమె తల్లి గర్భంలో వున్నప్పుడే తండ్రి మరణించాడు. కుటుంబపోషణ నిమిత్తం తల్లి ఫిలిప్పీ కర్టియస్ అనే డాక్టరు ఇంట హౌస్‌కీపర్‌గా చేరింది. ఆ డాక్టర్‌కు మైనంతో శిల్పాలు రూపొందించడం హాబీ. క్రమేపీ అతనికి తనదైన వైద్యవృత్తికన్న మైనపు బొమ్మల నిర్మాణంలోనే ఎక్కువ ధనం లభించసాగింది. కర్టియస్ తొలిసారిగా తాను రూపొందించిన మైనపు బొమ్మల ఎగ్జిబిషన్‌ను ప్యారిస్‌లో ప్రారంభించినప్పుడు మేరీ, ఆమె తల్లి ఆయనతో పాటు వెళ్లారు.

ఆ చిన్నతనంలోనే మేరీ మైనంతో బొమ్మలు తయారుచెయ్యడం, వాటిని సొగసుగా తీర్చిదిద్దడం తన యజమాని వద్ద నేర్చుకుంది. కొద్దికాలంలో ఆమె ఆ కళలో నిష్ణాతురాలైంది. అప్పటి ప్రముఖులైన వోల్టేర్, బెంజిమన్ ఫ్రాంక్లిన్ వంటివారి రూపాలు మైనంతో రూపొందించి అందరి మన్ననలు పొందింది. ఫొటోగ్రఫీ కనుగొనని ఆరోజుల్లో ప్రముఖ వ్యక్తుల రూపాలు ప్రజలు ఆ మైనపు కళాకృతుల్లోనే దర్శించగలిగారు.

మేరీ కీర్తి దశదిశలా పాకి, చివరికి వెర్సైల్లీస్ ప్యాలెస్‌లోని అంతఃపురానికి కూడా వెల్లడయింది. ఆమెకు ప్యాలెస్ నుంచి



ఆహ్వానం వచ్చింది. అక్కడ 16వ లూయీ సోదరి ఎలిజబెత్‌కు చిత్రలేఖాధ్యాపకురాలిగా నియమించబడింది. ఆ భవంతిలో ఆమె 9 సంవత్సరాలుంది. ఆ సమయంలో మేరీ రాజు యొక్క, ఆయన కుటుంబసభ్యుల రూపాలను మైనంలో రూపకల్పన చేసింది.

పిమ్మట డాక్టర్ కర్టియస్ ఆమెను ప్యారిస్ తిరిగి రమ్మని చెప్పాడు. ప్యారిస్

వెళ్లాక (1789-1799) కొందరు ప్రముఖుల రూపాలను కర్టియస్, మేరీ కలిపి రూపొందించారు. కొంతకాలం గడిచాక దురదృష్ట వశాత్తూ మేరీ చెయ్యని నేరానికి జైలుపాలయింది. ఉరిశిక్ష కూడా విధించబడింది. అదృష్టవశాత్తూ ఆఖరిక్షణంలో అది రద్దయింది. ఆమె విడుదలయింది.

తర్వాత మేరీ యుద్ధంలో మరణించిన సైనికుల ఆకృతులను మైనంతో రూపొందించింది. కొంతకాలానికి డాక్టర్ కర్టియస్ మరణించాడు. ఆయన ఎగ్జిబిషన్‌కి మేరీ వారసురాలైంది. ఆమె ఫ్రాంకోయిస్ టుస్సాడ్ అనే ఫ్రెంచి ఇంజనీర్‌ని వివాహం చేసుకొంది.

1802లో ఆమె తన ఎగ్జిబిషన్‌ను ఇంగ్లాండ్‌కు తీసుకువెళ్లింది. అటుపైన 33 సంవత్సరాలపాటు ఇంగ్లాండు నగరమంతటా, చుట్టుపక్కల ద్వీపాలలో, ఊళ్లలో తన ఎగ్జిబిషన్‌ను ప్రదర్శించి అందరి మన్ననలూ పొందింది మేరీ. తన 74వ సంవత్సరంలో మేరీ ఇంగ్లాండ్‌లోని బేకర్ స్ట్రీట్ మార్కెట్ వద్ద శాశ్వతంగా మ్యూజియం నెలకొల్పింది.

తన 89వ ఏట మరణించడానికి 8 సంవత్సరాలముందు తన ఆకృతిని తనే స్వయంగా రూపొందించుకుంది. ఆమె కుమారులు, మనవలు ఆ ఎగ్జిబిషన్ వ్యాపారాన్ని కొనసాగించారు. 1884లో టుస్సాడ్ మనవడు ఎగ్జిబిషన్‌ని ప్రస్తుతం వున్న ప్రదేశానికి మార్చాడు. 1925లో సంభవించిన అగ్నిప్రమాదంలో అనేక మైనపు కళాఖండాలు కరిగిపోయాయి. వాటినన్నిటిని యధాతథంగా తిరిగి రూపొందించగలిగారు నిర్వాహకులు. 2వ ప్రపంచ యుద్ధకాలంలో బాంబులవలన 35 శిల్పాలు దెబ్బతిన్నాయి. వాటిని పునర్నిర్మించారు.

టుస్సాడ్ మరణించి బహుకాలం గడిచినప్పటికీ ఆమె నిర్మించిన మ్యూజియం నేటికీ వేలాదిమంది కళాభిమానులు తిలకిస్తూనే వున్నారు.

సిబ్బంది దాన్ని ఎంతో శ్రద్ధతో కాపాడుతున్నారు. ప్రతిరోజూ ఉదయం 7.30 గంటలకు సిబ్బంది అంతా ఆ కళాకృతులను నిశితంగా పరీక్షిస్తారు. వాటిలో ఏవైనా లోటుపాట్లు కనిపిస్తే, వెంటనే వాటిని సరిచేస్తారు. సాధారణంగా శిల్పాల జుట్టు విషయంలో, కాలి, చేతి వేళ్ల విషయంలో ఆ బాగుచేత అవసరమవుతూ వుంటుంది.

వెనకటిరోజుల్లో ఉడెన్‌ఫ్రేమ్ చుట్టూ చర్మం గానీ, కాన్వాస్‌గానీ చుట్టి రంపపు పొట్టుతో నింపబడి ఆ కళాఖండాలు తయారయ్యేవి. ప్రస్తుతం వాటిని ఫైబర్ గ్లాసుతో నిర్మిస్తూ కొన్ని భాగాలు మైనంతో తయారుచేస్తున్నారు. ప్రతీ సంవత్సరం ఆ మ్యూజియంలో 12 నుంచి 20 వరకు కొత్త కళాఖండాలు నిర్మించబడతాయి. పాప్‌సింగర్ జెన్నిఫర్ లోపెజ్, బ్రిట్నీస్పియర్స్‌ల కళాకృతులు కూడా ఇటీవలి కాలంలో ఆ మ్యూజియంలో చోటుచేసుకున్నాయి.

లండన్ వెళ్లినవారు టుస్సాడ్ మ్యూజియంను తిలకించడం ఓ అద్భుత అనుభూతి.

– కొడిమెల శ్రీరామమూర్తి







# ఏరిన ముత్యాలు

* రత్నమును రాపిడి లేకుండా మెరుగు దిద్దలేం. ఏ మనుష్యుడూ కష్టాలు పడకుండా ఉత్తముడు కాలేడు.

– చైనా సామెత

* కష్టాలు ఒంటరిగా రావు, అవి అవకాశాలను వెంట తీసుకొని వస్తాయి.

– దాదారావ్ పరమార్కే

* శరీరంలో తల పై భాగంలో వున్నది కాబట్టి ఎక్కువా కాదు, పాదాలు నేలను తాకుతూ వుండడంవల్ల తక్కువాకాదు.

– మహాత్మాగాంధీ

* మాట్లాట నేరిస్తే పోట్లాట ఉండదు.

– సామెత

* కష్టాలు బలహీనుల్ని పడగొడతాయి, బలవంతుడ్ని అభివృద్ధి పరుస్తాయి.

– బి.సి. ఫోర్బ్స్

* అభ్యాసమువంటి విద్యయు, అనుభవము వంటి గురువును లేరు.

– ఒక సామెత

* నీకు కావల్సింది ప్రయత్నించి సాధించు. లేకపోతే నీకున్న దానితోటే తప్పనిసరిగా సర్దుకోవాల్సిన పరిస్థితి వస్తుంది.

– జార్జి బెర్నార్డ్‌షా

* వైఫల్యం ఒకటి చెబుతుంది విజయంపట్ల నీకు నిజమైన కోరిక లేదని.

– బోవీ

* ఈ ప్రపంచంలో వచ్చిన చిక్కేంటంటే మూర్ఖులు ఆలోచించకుండా పనులు చేస్తారు. తెలివైనవారు ఆలోచనతోనే గడుపుతారు.

– బెర్ట్రండ్ రస్సెల్

* పేరు ప్రతిష్ఠలు వీరోచిత కార్యాల పాలిటి అత్తరు అవుతుంది.

– సోక్రటీసు

* దుఃఖంలో ఉన్నప్పుడు మనం ఆనందంగా ఉన్న క్షణాలను గుర్తుకు చేసుకోవడానికి మించిన దుఃఖం వేరొకటిలేదు.

– డాంటే

* కొంతమంది గొప్పవారుగా పుడతారు. కొంతమంది గొప్పతనాన్ని సాధిస్తారు. మరికొంతమంది పైన గొప్పతనం రుద్దబడుతుంది.

– షేక్స్పియర్

* మాటలతో కూడిన హృదయంలేని ప్రార్ధనకంటే మాటలు లేకుండా హృదయంతో చేసే ప్రార్ధనే గొప్పది.

– గాంధీజీ

సేకరణ: **దాసరి వెంకట రమణారావు**

చతుర

సంపుటి: 26 సంచిక: 8 సెప్టెంబర్: 2003
308వ సంచిక

"కిరణ్! మంచో చెడో నేను మీ స్థానంలోకి వచ్చాను. అరుంధతితో నా వివాహం ఎలాంటి పరిస్థితుల్లో అయిందో చెప్పడానికి వచ్చాను. వివాహమయినా మామధ్య ఎలాంటి సంబంధం లేకపోవడం... అటుపైన జరిగిన కథంతా మీకు చెప్పుకుందామని వచ్చాను. ఇక పైన నిర్ణయం మీదే..." అంటూ మాటలు రాకపోయినా మనసే మాటై, అక్షరమై నడవగా ఉత్తరాన్ని కిరణ్ చేతిలో పెట్టాడతను. చదివిన అతడు నిశ్చేష్టుడయ్యాడు. తాను చేసిన పనికి సిగ్గుపడ్డాడు. ఎందుకు? అటుపైన అతడు ఎలాంటి నిర్ణయం తీసుకున్నాడు? అతడు చేసిన పని ఎలాంటిది?

ప్రేమ పేరుతో స్త్రీని మోసం చేసే కొంత మంది పురుషులు అప్పుడూ, ఇప్పుడూ, ఎప్పుడూ వుంటారన్న విషయాన్ని కథానేపథ్యంలో అక్షరబద్ధం చేసిన

ఆదెళ్ళ శివకుమార్ రచన

# పిచ్చోడు

ఈనెల చతుర సమగ్ర నవల

“ఎవరు నీవు?

‘నీ అంతట నీవుగా నా ఉనికి మూలానికి నడిచివచ్చి నా జీవిత కేంద్రానికి దారిని కనుగొన్నావు.

ఎవరు నీవు?

సునిశితంగా నన్ను స్పృశించి, లాలించి, నన్ను నీ ఒడిలో చిన్ని పాపడ్ని చేసి ఆడిస్తావు.

అంతలోనే భయంకర విస్ఫోటనాన్ని సృష్టించి మదిని అల్లకల్లోల పరుస్తావు.

నీవెవరని నే చెప్పగలను?

నీవు నా తోడుంటే అనంత సాగరాల ఆవలి తీరాలు సైతం వెతుక్కుంటూ అడుగులు వేస్తాను.

నీవు తోడుంటే జీవితపు చిక్కుముడులన్నీ విప్పేందుకు ప్రయత్నిస్తాను. అదే నీవు నాకు దూరమైతే శూన్యంలో పడి కొట్టుకుపోతాను అజ్ఞానిగాను, అర్ధజ్ఞానిగాను మిగిలిపోతాను.

నీవంటే నాకెంతో ఇష్టం.

ఎంత ఇష్టమంటే ఎప్పుడూ నీ గురించే ఆలోచిస్తూ ఉండిపోవాలనిపించేంత ఇష్టం.

ఎప్పుడూ నీ దగ్గరే ఉండిపోవాలనిపించేంత ఇష్టం.

ఇంతకీ ఇప్పుడు చెప్పనీ నీవెవరివో...

నేను భద్రంగా దాచుకున్న నా వ్యక్తిత్వపు ఛాయలను బహిర్గతం చేసి, నాకంటూ ఓ రూపాన్ని అస్థిత్వాన్ని ఇచ్చి...

నా అర్ధాంగిగా నా జీవితాన్ని సంపూర్ణాన్ని చేసిన అనురాగ దేవతవు నీవు...”

భార్య గొప్పతనాన్ని ప్రతిబింబించే విధంగా చిత్రించిన ఓ పెయింటింగ్ మీద ఎందుకో ఓ నాలుగు పంక్తులు రాయాలనిపించింది. అంతే మనసులో భావం పరవళ్లు తొక్కింది.

ఓ పురుషుడి జీవితాన్ని పునీతం చేయడానికి వచ్చిన స్త్రీని అక్షరాలలో నిర్వచించడం సాధ్యంకాదేమో? అందునా నాలాంటి ఓ పిచ్చోడ్ని కట్టుకుని రాతిని శిల్పంగా మలిచేందుకు ఎంతో శ్రమించిన నా భార్య అరుంధతి గురించి ఎంత చెప్పినా తక్కువే అవుతుంది. ఈ పోరాటంలో ఆమె ఎన్ని దెబ్బలు తిందో, ఎన్ని అవమానాలు దిగమింగిందో ఏ రచయిత రాయగలడు?

తలుపు చప్పుడవడంతో చేతిలో ఉన్న పెయింట్‌బ్రష్ పక్కనపెట్టి లేచాను. ఈ సమయంలో ఎవరొచ్చి ఉంటారు? అని అనుకుంటూనే తలుపు తీశాను. తలుపు తీయగానే నా ఎదురుగా కన్పించాడు అతను.

అతన్ని చూడగానే నేను నిశ్చేష్టుడ్ని అయ్యాను. నా పక్కలో బాంబులు పేలినంతగా వణికిపోయాను.

అంతేకాదు అంతవరకు నా మనసు ఎంతో ఉత్సాహంగా ఉంది. నాలో భావుకత పురి విప్పుకుంది. కాన్వాస్‌మీద నా కుంచె నాట్యమాడింది.

కానీ అతన్ని చూడగానే...

ఒక్కసారిగా నా సర్వశక్తులూ కోల్పోయినట్టుగా నిర్వీర్యుడ్ని అయిపోయాను.

‘వేసెయ్... తలుపు వేసెయ్... అతన్ని లోపలకు రానీయకు. సజావుగా సాగుతున్న నీ సంసారంలో నీ అంతట నీవే నిప్పులు పోసుకోకు’ అంది నా మనసు.

కానీ చెప్పానుగా నేను డీప్‌షాక్‌లో ఉన్నానని. అందుకే నాకు ఏవిధంగా రియాక్ట్ కావాలో అర్థం కాలేదు.

ఎవరో ఛెళ్లుమని నా చెంపమీద కొట్టినట్టు అన్పించింది. నా మనసు... మంచిగా చెప్పినా వినకపోయేసరికి ‘తలుపు వెయ్యరా పిచ్చివెధవా’ అని నా మనసు కేకలేసింది. అదే నాకు చెంప ఛెళ్లుమన్పించినట్టుగా అన్పించింది. నేను ఆ పని చేయలేదు.

ముఖాన నవ్వు పులుముకుని పక్కకు తొలిగి అతను లోపలికి రావడానికి దారిచ్చాను. అదే నేను చేసిన తప్పవుతుందని అందుకుగాను భవిష్యత్తులో ఎన్నో సమ





స్యలు ఎదుర్కోవాల్సి వస్తుందని ఆ క్షణాన నేను అనుకోలేదు. అతను ఒకసారి నా ముఖంలోకి సీరియస్‌గా చూసి తల తిప్పు కున్నాడు. మళ్లీ అంతలోనే ఏమనుకున్నాడో ఏమో నా వైపు చూసి ఓ చిరునవ్వు నవ్వాడు. నేను మాత్రం, కాదు... కాదు నాలో మాత్రం ఎలాంటి రియాక్షనూలేదు.

"కూర్చోండి" అన్నట్టు సోఫా చూపించాను.

సోఫాలో వెనక్కివాలి రిలాక్సింగ్‌గా కూర్చుని ఇల్లంతా పరిశీలనగా చూస్తూ చూపులు నా వైపు తిప్పాడు. 'పిచ్చాడికి ఇంత వైభోగమా' అన్నట్టుంది. అంతలో అతని చూపులు హఠాత్తుగా ఓ ఫొటో మీద పడ్డాయి. అటువైపుగా నేను చూపులు సారించాను. నేను, అరుంధతి, మా అబ్బాయి కలిసి దిగిన ఫొటో అది.

చాలా సేపు ఫొటోని, నన్ను మార్చిమార్చి చూశాడు. 'ఇదంతా నేను పెట్టిన భిక్షకదరా' అన్నట్టుగా చూశాడు.

అతని చూపులకు క్షణకాలంపాటు నేను భయపడిన మాట నిజం. కానీ అంతలోనే సర్దుకున్నాను.

అతని మాటలలో, అదే చూపులలో... వాస్తవం ఉంది.

నేను ఈరోజు జీవిస్తున్న జీవితం అతను పెట్టిన భిక్షే. అతను అహంకారంతో కాలద న్నుకున్న దాన్ని నేను వినమ్రంగా స్వీకరించాను. ఎంతో ఆనందంగా ఉన్నాను.

లోపలకు వెళ్లి మంచినీళ్లు తీసుకువచ్చి అతని ముందుంచాను. ఈ మర్యాదలన్నీ చూసి నా మనసు నన్ను ఈసడించింది. అది చెప్పినట్టు వినకుండా అతన్ని లోపలికి రానిచ్చి ఈ అతిథి మర్యాదలన్నీ జరపడం దానికి సుతరామూ నచ్చలేదు. నిజానికి నా మనసు చెప్పినట్టుగా అతన్ని లోపలికి రానీయకుండా ముఖంమీద తలుపు వేసేయచ్చు. ఇలా అని తెలిస్తే అరుంధతి కూడా నన్ను ఏమీ అనదు. పైపెచ్చు మెచ్చుకుంటుంది కూడా. నేనలా చేయడంవలన సమస్య తీరిపోదు. గోటితో పోయేది గొడ్డలిదాకా తెచ్చుకున్నట్టు అవుతుంది. అదీగాక ఏదైనా సమస్య ఎదురైతే నిలబడి దానిని ఎదిరించాలి. దాంతో పోరాడాలి. అలాకాకుండా సమస్యనుంచి పారిపోతే అది మనల్ని వెంటాడుతూనే ఉంటుంది. ఎప్పుడైతే ధైర్యంగా దానికి ఎదురు నిలుస్తామో ఎలాంటి చిక్కుముడి అయినా క్షణాల్లో విడిపోతుంది. అందుకే ధైర్యవంతులు సమస్యలతో పోరాడతారే తప్ప వాటినుంచి దూరంగా పారిపోరు. ఇది నా జీవితం నాకు నేర్పిన పాఠాలలో ఒకటి.

ఎన్నో రోజుల తర్వాత అతను ఇప్పుడు వచ్చింది మా జీవితాలలో సమస్యలు సృష్టించేందుకే అయితే వాటిని ఎదుర్కోవడంలో తప్పేముంది?

సుమారు అయిదేళ్లక్రితం ఇతని కారణంగానే నా జీవితం అనుకోని మలుపు తిరిగింది.

అరుంధతి నా భార్య అయ్యింది.

నా జీవితంలో ఈ మలుపుని నేను కలలో కూడా వూహించలేదు. ఈ రోజు నేను ప్రశాంతంగా జీవిస్తున్నాను. సంఘంలో పేరు ప్రఖ్యాతులు సాధించాను. దీనంతటికి కారణం అతనే. ఆవిధంగా చూస్తే నా జీవితాంతం నేనతనికి కృతజ్ఞతలు తెల్పుకోవాల్సిందే.

ఇద్దరం ఒకరినొకరు చూసుకుంటూ మౌనంగా కూర్చున్నాం. ఎంతసేపని అలా ఒకరినొకరు చూసుకుంటాం? మధ్యమధ్య హాలులోని గోడలు, కుర్చీలు, గోడకున్న పెయింటింగ్స్ మీదకు చూపులు తిప్పుతున్నాం. మామధ్య మౌనం రాజ్యమేలుతున్న ఆ చూపుల భాషను అర్థం చేసుకోగల శక్తి మా ఇద్దరికీ ఉంది.

"ఇన్నేళ్ల తర్వాత ఇప్పుడెందుకొచ్చావ్? " అని నా ప్రశ్న.

"నీతో నాకు పనిలేదు. నీకు జవాబు



చెప్పాల్సిన అవసరమూ నాకులేదు" అని అతని సమాధానం.

"నేను ఈ ఇంటి యజమానిని... అరుంధతి భర్తను" అన్నట్టు ఉరిమి చూశాను. ఆ చూపుకి అతను బెదిరిపోలేదు సరికదా. "ఇదంతా నా భిక్షేకదా!" అన్నట్టు నిర్లక్ష్యంగా తల ఎగరేశాడు.

చివరకు నోరుతెరిచి "నేను ఒకసారి అరుంధతిని చూడాలి. ఆమెతో మాట్లాడాలి" అన్నాడతను.

అలాగేనన్నట్టుగా తల ఆడించాను.

అయిదు నిమిషాలపాటు ముళ్లమీద కూర్చున్నట్టుగా సోఫాలో అసహనంగా అటూ ఇటూ కదిలాడు.

నేను అరుంధతిని పిలుస్తానేమోనని ఎదురు చూశాడు. నేను ఆ పని చేయకపోయేసరికి "ఆమెని పిలవండి" అన్నాడు.

"ఇంట్లోలేదు" అని సైగచేశాను.

"ఓహో! బ్యాంక్ కి వెళ్లుంటుంది" అని తన లోతాను అనుకోబోయి పైకే అనేశాడు.

అవునన్నట్టుగా తలాడించాను.

"ఎన్నింటికి వస్తుంది? "

"ఆరు గంటలకు" అన్నట్టుగా సైగ చేశాను.

అప్పుడే అయిదు కావస్తోంది.

మా అబ్బాయి పక్కింటి పిల్లలతో ఆడుకోవడానికి వెళ్లాడు. నా భార్య అరుంధతి బ్యాంక్ మేనేజరు. తను ఇంటికి వచ్చేసరికి ఆరు, ఆరున్నర అవుతుంది. బ్యాంక్ నుంచి రాగానే స్నానం చేసి వేడివేడిగా కాఫీ తాగుతుంది. కాసేపు మావాడితో ఆడుకుంటుంది. ఆ తర్వాత మా వాడి చేత హోంవర్క్ చేయిస్తుంది. అప్పుడు వంట పని మొదలుపెడుతుంది. ఈ అయిదేళ్లల్లో ఇది నేను చేసిన అలవాటే.

అందుకే ఆమె వచ్చేలోపున గీజర్ ఆన్ చేసి కాఫీ డికాషన్ వేసి ఉంచుతాను. ఆమె స్నానం చేసి వచ్చేలోపు కాఫీ కలిపి ఇస్తాను. "ఎందుకండీ మీకీశ్రమ? " అంటుంది అరుంధతి.

నేను చిన్నగా నవ్వి వూరుకుంటాను. కానీ ఓ కప్పు కాఫీతో అందునా భర్త కలిపి ఇచ్చిన కాఫీతో తను ఎంతో రిలాక్స్ అవుతుంది.

ఇది మా ఇంట్లో రోజూ జరిగే తతంగమే.

స్టవ్ మీద నీళ్లు పెట్టాను.

ఫిల్టర్ లో కాఫీపొడి వేశాను. స్టవ్ మీద ఉన్న నీళ్లలానే నా ఆలోచనలూ తెర్లుతున్నాయి.

'అతనెందుకొచ్చాడు? ' ఆ ప్రశ్న దగ్గర మొదలైన ఆలోచనలు అక్కడే ఆగిపోతున్నాయి.

నాకు దేవుడు ఇచ్చినవేవీ నేను కోరుకోలేదు. అందరి చేత పిచ్చోడుగా ముద్రవేయించుకున్న నేను ఇలాంటి జీవితాన్ని కలలోనైనా ఊహించలేదు. నాకంటూ ఓ ఇల్లు, భార్య, పిల్లలు ఇదంతా ఆ భగవంతుడు అనుగ్రహించిన అదృష్టం. మరి ఆ వరాన్ని ఇచ్చినట్టే ఇచ్చి లాగేసుకునేందుకే దేవుడు అతన్ని పంపాడా?

'ఇలా నీలో నువ్వు కుళ్లుకోకపోతే హాల్లోకి వెళ్లి అతన్ని పొమ్మనకూడదూ. అసలు అతన్ని రానివ్వడమే తప్పు. పోనీ రానిచ్చావు నీ భార్యతో మాట్లాడాలని వాడంటే ఎందుకు ఒప్పుకున్నావు? ఇప్పటికైనా మించిపోయిందేమీ లేదు. వెళ్లి నీ భార్య రాకముందే అతడ్ని బయటకు గెంటేసి తలుపు వేసెయ్' నా మనసు నానా విధాలుగా పోరుపెడుతోంది.

కానీ నేనా పని చేయలేదు.

అతనితో మాట్లాడాలో లేదో తేల్చుకోవాల్సింది అరుంధతి. ఆమె సమాధానమేమిటో అతను వినాలి. లేదంటే అతను మళ్లీమళ్లీ వస్తూనే ఉంటాడు. అతనలా మా ఇంటి చుట్టూ తిరగడం నాకు ఇష్టంలేదు.

నీళ్లు పొర్లి స్టవ్ మీద పడడంతో ఆలోచనల్లోంచి తెప్పరిల్లాను. స్టవ్ ఆఫ్ చేసి కాగిన

నీళ్లు ఫిల్టర్‌లో పోసి హాల్లోకి వచ్చాను.

"ఎందుకొచ్చావ్? " అరుంధతి స్వరం కఠినంగా వినిపించింది. అతను అదేమీ పట్టించుకున్నట్టుగా లేదు "బావున్నావా! అరుంధతీ" అని అడిగాడు.

ఎక్కడో నూతిలోంచి వస్తున్నట్టుగా ఉంది అతని స్వరం.

"నా బాగోగుల సంగతి నీకెందుకు? అసలు నిన్నెవరు లోపలికి రానిచ్చారు? " అని నా వైపు తిరిగి అంది "వాడికి బుద్ధిలేకపోతే ఆ కుక్కను ఇంట్లోకి రానీయకూడదని మీకు ఆలోచనలేదా? " అరిచింది అరుంధతి. నేను జవాబు చెప్పలేదు. కాదు కాదు చెప్పలేను.

ఆమె కళ్లల్లో ఆగ్రహం బుసలుకొడుతోంది.

రెండు అడుగులు ముందుకేసి అరుంధతిని దగ్గరకు తీసుకున్నాను. నెమ్మదిగా సోఫాలో కూర్చోబెట్టాను.

నా చర్యకు అతని ముఖం చిన్నబోయింది.

తన వస్తువును నేనేదో బలవంతంగా లాక్కున్నట్టుగా ఫీలయ్యాడు.

"అరుంధతీ" నెమ్మదిగా పిలిచాడు.

అరుంధతి అతనివంక కన్నెత్తి కూడా చూడలేదు. ఎటో నిర్లక్ష్యంగా చూస్తూ కూర్చుంది.

"నువ్వు నన్నేమైనా అను. నన్ను కొట్టు, తిట్టు. కానీ నన్నో శత్రువుగా చూడకు. దయచేసి ఒక్కసారి ఒకే ఒక్కసారి నేను చెప్పేది విను" చేతులు జోడించి అర్థింపుగా అన్నాడతను.

సర్రున ఏదో అనబోయింది. నా వారింపు చూసి ఆగింది.

మనకేమీ కాని వ్యక్తుల మీద కోపగించుకోవడం, వారిని మార్చాలనుకోవడం వృధా ప్రయాసేనన్నది నా అభిప్రాయం.

"అరుంధతీ! నేను నీకు చేసిన అన్యాయానికి ఆ భగవంతుడు నాకు చాలా పెద్ద శిక్ష విధించాడు" దోసిట్లో ముఖం దాచుకుని భోరుమన్నాడు.

అరుంధతిలో ఎలాంటి స్పందన లేదు.

నాకు మాత్రం అయ్యో! ఏమైందో అనిపించింది.

"ముందా ఏడుపాపు" చిరాగ్గా అంది అరుంధతి.

'వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమానిచ' అంటారు స్త్రీలని. పూలవలె లలితంగా, కోమలంగా ఉండే వారి మనసులు అవసరమైతే వజ్రమంత కఠినంగా మారతాయట. అరుంధతిని చూస్తే ఆ మాటలో ఎంత మాత్రం అసత్యం లేదనిపించింది.

"చూడు కిరణ్"

అతను ఆశగా తలెత్తాడు.

"ముందా వెధవ ఏడుపు ఆపి నువ్వేం చెప్పదల్చుకున్నావో సూటిగా చెప్పి వెళ్లు. అసలు నిన్నెప్పుడో బయటకు గెంటేదాన్ని. కాని నా భర్త మాట మన్నించి ఆయనకు విలువనిచ్చి నిన్ను ఇంతసేపు ఇక్కడ ఉండనిచ్చాను. లేదంటే నీలాంటి పిచ్చి కుక్కల్ని ఇంట్లోకి రానిచ్చేంత సహృదయత నాకు లేదు" అతనివంక ఏహ్యాభావంతో చూస్తూ తల తిప్పుకుంది అరుంధతి.

నిమిషాలు భారంగా కదులుతున్నాయి.

ఎలా మొదలుపెట్టాలో అన్న సందిగ్ధంలో అతను అటు ఇటు దిక్కులు చూడసాగాడు.

అక్కడ కిరణ్ ఉన్నాడన్న సంగతి మర్చిపోయి సోఫాలో వెనక్కి వాలి కళ్లు మూసుకుంది ఆమె. మనిషి చాలా అలసటగా కన్పిస్తోంది. అవును మరి తనతో పాటు మరో జీవిని మోస్తోందికదా!

"అరుంధతీ" నెమ్మదిగా అన్నాడు కిరణ్.

అప్పటికి కూడా అరుంధతి కళ్లు తెరవలేదు. మరోసారి "అరుంధతీ" అన్నాడు.

నెమ్మదిగా కళ్లు తెరిచి చూసిందామె.

ఒకసారి ఆమె వంక చూసి నెమ్మదిగా ధైర్యం తెచ్చుకున్నాడు కిరణ్.

"అరుంధతీ! నేను నీకు చేసిన అన్యాయా



నికి నా ఇంట పసిపాప నవ్వులు, కేరింతలు లేకుండా చేశాడా దేవుడు" మరోసారి భోరుమన్నాడు కిరణ్. అర్థం కానట్టుగా చూసిందామె.

తర్వాతి మాటలో అతను నా ఇంటికి ఎందుకు వచ్చాడో నాకు అర్థమైంది.

"ఈమధ్య నాకు యాక్సిడెంటయ్యింది"

"అయితే" నిర్లక్ష్యంగా తల ఎగరేసింది అరుంధతి.

"ఆ యాక్సిడెంట్ నా జీవితాన్ని మార్చేసింది. నాకిక జీవితంలో పిల్లలు పుట్టే అవకాశం లేదని డాక్టర్ చెప్పాడు. ఏ మగవాడూ తట్టుకోలేని బాధాకరమైన వార్త"

అరుంధతి ఏమైనా కామెంట్ చేస్తుందేమోనని చూశాడు కిరణ్.

ఆమె నుంచి ఏవిధమైన రియాక్షనూ లేదు. కిరణ్ చెప్పింది విన్నాక నాకు మాత్రం అయ్యో! పాపం అన్పించింది.

ఒకప్పుడు ప్రాణాధికంగా ప్రేమించిన వ్యక్తిని నేడు కనీసం సాటి మనిషిగా కూడా చూడటం లేదంటే అతని కష్టానికి సానుభూతి చూపటం లేదంటే అతను ఆమెను ఎంతగా బాధించి ఉంటాడోకదా!

అవతలి వ్యక్తి మనకేమీ కాడని అనుకుంటే తప్ప కనీసం శత్రువుతో కూడా మనం అలా ప్రవర్తించలేము.

"అరుంధతీ! మాకు పిల్లలు పుట్టే అవకాశం లేదు కాబట్టి..." నీళ్లు నమిలాడు కిరణ్. తర్వాతి వాక్యం పూర్తి చేయడానికి అతనికి ధైర్యం సరిపోలేదనుకుంటాను.

"కాబట్టి..." అసహనంగా అంది ఆమె.

"నా బిడ్డను నాకు ఇ..."

కిరణ్ మాట పూర్తికాకముందే అతని చెంప ఛెళ్లుమంది. కిరణ్ షర్ట్ పట్టుకుని సోఫాలోంచి లేపి రెండు చెంపలు వాయించింది. ఆయాసం వచ్చేదాకా అతన్ని కొడుతూనే ఉంది ఆమె.

"ఏమన్నావ్? నీ బిడ్డను నీకు ఇవ్వాలా? ఎక్కడున్నాడ్రా నీ బిడ్డ?" కిరణ్ షర్ట్ పట్టుకుని ఆవేశంతో అటు ఇటూ గుంజేస్తోంది.

అరుంధతికి ఒక్కసారిగా అంత బలం ఎక్కడినుంచి వచ్చిందో నాకు అర్థం కాలేదు.

కిరణ్‌మాత్రం ఆమెనుంచి తననుతాను విడిపించుకోవడానికి ఏమాత్రం ప్రయత్నం చేయలేదు.

అతికష్టంమీద ఆమెను విడిపించి సోఫాలో కూర్చోబెట్టాను. అయిదు నిమిషాలు గడిచినా ఆమె ఆవేశం తగ్గలేదు. ఆవేశం, కోపం, దుఃఖం వీటివలన మనిషి కంపించిపోతోంది.

అరుంధతితో అన్ని దెబ్బలు తిని కూడా కిరణ్ అక్కడినుంచి కదలలేదు. అతను వెళ్లిపోతే బాగుండునన్పించింది. నిజానికి అతను తల్చుకుంటే అరుంధతి బలం ఏం సరిపోతుంది?

"అరుంధతీ! నేను చెప్పేది విను. నేనిలా అడగడం నీకు కోపం తెప్పిస్తుందని నాకు తెలుసు. కానీ ఏం చేయను? నాకు వేరే దారి లేక నిన్నిలా అర్థిస్తున్నాను. దయచేసి దయచేసి నా బిడ్డను నాకిచ్చేయ్" గభాల్న అరుంధతి చెయ్యి పట్టుకోబోయాడు కిరణ్.

ఆమె మాత్రం అతని ప్రయత్నం గమనించిన దానిలా గభాల్న చేతులు వెనక్కి తీసుకుంది.

అతన్ని చూస్తుంటే అవసరమైతే అరుంధతి కాళ్లు పట్టుకోవడానికి కూడా రెడీ అన్నట్టు ఉన్నాడు.

అరుంధతి ఏదో దీర్ఘాలోచనలో ఉన్నదానిలా కూర్చుండిపోయింది.

"మొదట ఏ అనాథ శరణాలయానికో వెళ్లి ఎవరినైనా దత్తత తీసుకుందామనుకున్నాం. వాళ్లు ఎంతైనా పరాయివాళ్లే అవుతారు కానీ రక్తం పంచుకుని పుట్టినవారు కాదుగా! అందుకే నిన్ను అభ్యర్థిస్తున్నాను. దయచేసి నా బిడ్డను నాకు ఇవ్వు" అతని కళ్లు చెమ్మగిల్లాయి.

అతనివైపు సూటిగా చూస్తూ అంది అరుంధతి. "ఈ సంగతి నీ భార్యకు




తెలుసా? "

కిరణ్ జవాబు చెప్పలేదు.

"చెప్పు! తెలుసా! లేదా? " రెట్టించింది.

ఈసారి కూడా కిరణ్ మౌనంగానే ఉండి పోయాడు.

"చెప్పు తెలుసా? లేదా? " గట్టిగా అరిచింది ఈసారి.

"తె...లీ...దు" అస్పష్టంగా గొణిగాడు కిరణ్.

"పోనీ నిజం చెప్తావా? "

"..."

"చెప్పు... నీ భార్యతో నిజం చెప్తావా? "

"..."

"చెప్పవుకదూ! నాకు తెలుసు. నీకా ధైర్యంలేదని. ఇంతసేపూ నా బిడ్డను నాకు ఇమ్మని అంటున్నావే. అసలు పుట్టింది ఆడపిల్లో, మగపిల్లాడో నీకు తెలుసా? " కిరణ్ సమాధానం చెప్పకుండా తల దించుకున్నాడు.

"తెలీదుకదూ! నీమీద జాలి తలచి నీ బిడ్డను నీకు ఇచ్చాననుకో. ఏం చేస్తావ్ నీ బిడ్డను. తీసుకువెళ్లి అనాథ ఆశ్రమంనుంచి తీసుకు వచ్చినట్టుగా నాటకం ఆడతావు. నా బిడ్డను అనాథను చేస్తావు. చూడు కిరణ్! నువ్వనుకుంటున్నట్టుగా నీ బిడ్డంటూ ఎవరూ లేరిక్కడ. నాకు ప్రస్తుతం ఒక్కడే బిడ్డ. ఆ బిడ్డకు తండ్రి ఎవరో తెలుసా" అని ఒక్క క్షణం ఆగి నావైపు చూపిస్తూ చెప్పింది.

"ఇతనే నా బిడ్డకు తండ్రి. ఆ బిడ్డకు తల్లిని నేను. తల్లీతండ్రి బతికి ఉండగా నా బిడ్డ అనాథ ఎలా అవుతాడు? "

అరుంధతి మాటలు నాకెంతో సంతోషాన్నిచ్చాయి. కానీ కిరణ్ మాత్రం ఆమె చెప్పింది నమ్మినట్టుగా లేదు.

"లేదు... నువ్వు అబద్ధం చెప్తున్నావు. ఆ విషయం నాకు బాగా తెలుసు. అరుంధతీ! నిన్ను అర్థిస్తున్నాను. కావాలంటే నీ కాళ్లు పట్టుకునయినా నిన్ను వేడుకుంటాను. దయచేసి నా బిడ్డను నాకివ్వు" కిరణ్ స్వరం రుద్ధమవడంతో ఆ పైన మాట్లాడలేకపోయాడు.

అంతలో చందన్ పరిగెత్తుకుంటూ వచ్చాడు.

తల్లి దగ్గరకు వెళ్లబోతున్న వాడ్ని కిరణ్ గభాల్న దగ్గరకు తీసుకున్నాడు. వాడ్ని బలంగా గుండెలకు హత్తుకున్నాడు. ముఖమంతా ముద్దులు పెట్టేయసాగాడు.

అంతే చందన్ ఒక్కసారిగా ఏడుపు లంకించుకున్నాడు. చందన్ కళ్లనీళ్లు పెట్టడం నేను చూడలేకపోయాను. అప్పటి దాకా మౌనంగా ఉన్న నేను కిరణ్ దగ్గరి నుంచి చందన్‌ను తీసుకుని గుండెలకదుముకున్నాను. వాడు నా మెడచుట్టూ చేతులు వేసి నా భుజం మీద తలవాల్చి ఏడుపు దిగమింగే ప్రయత్నం చేయసాగాడు.

"ఏమన్నావ్ కిరణ్. మన ప్రేమకు చిహ్నంగా వాడ్ని పెంచుకుంటావా? " అదేదో జోక్‌లాగ తల్చుకుని తల్చుకుని నవ్వ సాగింది.

అరుంధతి నవ్వు చూస్తుంటే నాకు భయంవేసింది. ఆమె అసలే వట్టి మనిషి కూడా కాదు. రేపోమాపో డెలివరీ కాబోతోంది. ఈ సమయంలో కిరణ్ వచ్చి తనను టెన్షన్ పెట్టడం నాకెందుకో నచ్చలేదు.

"ప్రేమ అనకు కిరణ్! కళ్లు మూసుకుపోయిన కామం అను బావుంటుంది. నీ శారీరక వాంఛలు తీర్చుకోవడానికి ఆడిన నాటకమను సబబుగా ఉంటుంది. ఆ రోజేమన్నావ్ పెళ్లికి ముందే అన్నీ ఇవ్వడానికి సిద్ధపడ్డ నీలో సంసారం చేసే కళ కన్పించడం లేదన్నావ్‌కదూ! నీ కడుపులో పెరుగుతున్న బిడ్డకు తండ్రిని నేనేనన్న నమ్మకమేమిటి? అని అడిగావ్. నాలో పెరుగుతున్న బిడ్డ ఈ పిచ్చోడు బిడ్డ కాదని రుజువేమిటని అడిగావు. బహుశా నువ్వు అన్నవన్నీ మర్చి

## సచిత్ర విచిత్రం

# తమాషా నృత్యాలు!



కౌలాలంపూర్‌లో ఈమధ్య అద్భుతమైన రీతిలో డ్రాగన్స్, లైన్స్ డ్యాన్స్ పోటీలు భారీ ఎత్తున జరిగాయి. ప్రపంచవ్యాప్తంగా 26 దేశాలనుంచి 31 టీములు ఆ పోటీలో పాల్గొన్నాయి. గెలుపొందిన టీమ్‌కు పేరుపొందిన 'టాంగ్‌రాంగ్' కప్ బహూకరించబడుతుంది. అసాంతం ఆసక్తికరంగా దిగ్గమ కలిగిస్తూ ఆ పోటీలు జరిగాయి. ఆ సింహాల నృత్యాలు, డ్రాగన్‌ల విన్యాసాలు చూసి పిల్లలు కేరింతలు కొట్టారు సంతోషంతో.

పోయి వుంటావు. కానీ నేను నేనెలా మర్చి పోగలను? ఆరోజు లేని నమ్మకం, రుజువులు ఈ రోజు ఎక్కడ్నించి వస్తాయి? "

ఒక్కక్షణం ఊపిరి పీల్చుకోవడానికి ఆగింది. అనంతరం కొనసాగించింది.

"నువ్వు ఓ అవకాశవాదివి కిరణ్. అవసరం, అవకాశం ఈ రెండే నీలాంటి వారి జీవితాన్ని నిర్దేశించే మార్గాలు. అవసరమైతే ఎదుటివారి పాదాలు కడిగి ఆ నీళ్లు తీర్థంగా పుచ్చుకుంటావు. లేదంటే వాళ్లు చచ్చిపోతున్నా పట్టించుకోవు కదూ!"

కిరణ్ మారుపలకకుండా తలవంచుకున్నాడు.

"ఆరోజు నా చావుకు నన్ను వదిలేసి ఇప్పుడొచ్చి నా బిడ్డను ఇమ్మని అడిగితే ఇచ్చేస్తాననుకున్నావా? ఆ రోజు నువ్వలా నన్ను వదిలేసి వెళ్లిపోయినా నిన్ను క్షమించగలిగానంటే దాని వెనుక ఒకప్పుడు నిన్ను ప్రేమించిన మనసుంది. కానీ ఈ రోజు నా బిడ్డ జోలికి వస్తే చూస్తూ ఊరుకోవడానికి ఈ అమ్మ మనసు ఊరుకోదని గుర్తుంచుకో. నీకు చివరిసారిగా చెప్తున్నాను. నా బిడ్డమీద కనీసం నీ నీడ పడినా నిన్ను బతకనివ్వను. వెళ్లు వెళ్లి దేవుడు నీకు విధించిన శిక్షను అనుభవిస్తూ, చేసిన తప్పుకు ప్రాయశ్చిత్తం చేసుకుంటూ, కుళ్లికుళ్లి చావు" కఠినంగా పలికింది అరుంధతి స్వరం.

"వెళ్లకపోతే" అదో రకమైన తెగింపుతో అన్నాడు కిరణ్.

"విషయమంతా నీ భార్యకు చెప్తాను" అని సోఫాలోంచి లేచి తన గదిలోకి వెళ్లబోతూ వెనక్కి తిరిగి అంది "నేను అవమానపడ్డా సరే"

అంతే షాక్ తగిలినట్టుగా దిగ్భ్రాంతిగా చూశాడు కిరణ్.

ఒక్క నిమిషం తర్వాత నిద్రలోంచి లేచి నడుస్తున్నవాడిలా వెళ్లిపోయాడు.

అతను వెళ్లిపోయాక తలుపు మూసేసి అరుంధతి గదిలోకి వెళ్లాను. అరుంధతి కళ్లల్లో నీళ్లు.

దుఃఖాన్ని బలవంతంగా ఆపుకునేందుకు ప్రయత్నిస్తోంది.

నన్ను చూడగానే ఒక్కసారి బరస్ట్ అయింది.

"మీకు నిజంగా నామీద నమ్మకం ఉంటే వాడిని ఇంట్లోకి రానిస్తారా? " అని అడిగింది.

ఒక్క ప్రశ్న. ఇన్నేళ్ళుగా ఆమె నామీద పెంచుకున్న నమ్మకాన్ని సవాలు చేసే ప్రశ్న.

ఆమె ఇంకా ఏదో అనబోతుంటే ఆగమని సైగచేసి ఓ కాగితం చేతిలో పెట్టాను. అది చదివి "మిమ్మల్ని పొరపాటుగా అర్థం చేసుకున్నాను. నన్ను క్షమించడండి" అంటూ నా గుండెల్లో ఒదిగిపోయింది.

అర్ధరాత్రివేళ నాకు మెలకువ వచ్చింది.

అరుంధతి, చందన్‌లు ప్రశాంతంగా నిద్రపోతున్నారు.

కిరణ్ వచ్చి వెళ్ళాక దెబ్బతిన్న ఆమె మనసును ఊరడించేందుకు నేను రాసిన వాక్యాలు గుర్తుకువచ్చాయి. నిజానికి ఆమెను ఊరడించాలని నేనిలా రాయలేదు. నా మనసులో సిన్సియర్‌గా ఫీలయినదేదో కాగితంమీద ఉంచాను. అందులో ఇలా వుంది.

"అరుంధతీ! కిరణ్ దృష్టిలో నేనో పిచ్చోడ్ని. అలాంటి నేను అతని రాకను ఆపలేను. ఈరోజు వెళ్ళిపోయినా మళ్ళీ మళ్ళీ నీ కోసం వస్తూనే వుంటాడు. అందుకే ఆ జవాబేదో నీతో చెప్పించాలనే లోపలికి రానిచ్చాను తప్ప నీమీద అపనమ్మకంతో కాదు. సమస్యను దాటేస్తూ పోయేకన్నా ఆగి, ఎదుర్కొని పరిష్కరించుకోవడం మంచిది. కిరణ్‌కు కావాల్సింది నీ జవాబు. అందుకే నేను ప్రేక్షకుడిని అయ్యాను తప్ప సమస్య

నాది కాదని కాదు"

★ ★ ★

మరుసటిరోజు అరుంధతిని ఆస్పత్రిలో చేర్చాల్సివచ్చింది. ఆస్పత్రిలో చేర్చినప్పుడు మామూలు నొప్పులేనని, నార్మల్ డెలివరీ అవుతుందని డాక్టరు చెప్పింది. నేనూ తేలికగా ఊపిరి పీల్చుకున్నాను. కానీ అంతకంతకు పరిస్థితి విషమించింది.

సాయంత్రం నాలుగు గంటలయ్యేసరికి పరిస్థితి మరింత విషమించింది. సిజేరియన్ చేయాల్సివస్తుందని డాక్టరు అంది.

నాకేం చేయాలో అర్థం కావడం లేదు. ఇలాంటప్పుడే మనిషి సాయం ముఖ్యంగా అయినవాళ్ళ అండ కావాల్సివస్తుంది. కానీ నా అన్నవాళ్ళు మాకు ఎవరున్నారని?

మాదేమీ ప్రేమ పెళ్ళికాదు.

పెద్దలంతా దగ్గరుండి చేసిన పెళ్ళే. కానీ ఇప్పుడు!?

ఇప్పుడు మాకు ఎవరున్నారని?

ఇప్పుడే కాదు. అరుంధతి సంగతి తెలియగానే ఆమెని వదిలేయమని అందరూ ఎంతగానో చెప్పారు. కానీ నేను వినలేదు. మాంగల్యబంధానికి విలువనిచ్చాను. అరుంధతిని విడిచిపెట్టేది లేదని చెప్పాను. అంతే. మా ఖర్మకు మమ్మల్ని వదిలేశారు. అందుకే అంతా ఉండి కూడా మేము అనాధల్లా బతుకుతున్నాం.

ఆస్పత్రినుంచి గబగబా బ్యాంక్‌కు వెళ్ళి డబ్బు డ్రా చేశాను. అరుంధతి స్నేహితురాలు వనజకు విషయమంతా చెప్పాను. మా పక్కింటి ఆవిడకు విషయం వివరించాను.

నిజానికి డాక్టర్లు, నర్సులు పేషెంట్లను కన్నబిడ్డల్లా చూసుకునే నర్సింగ్ హోంలోనే జాయిన్ చేశాను. కానీ ఈ సమయంలో ఓ ఆప్తవచనం, ఓ ఓదార్పు మాట చెప్పేందుకు మనకంటూ ఒకరుండాలికదా!

ఇన్ని సంవత్సరాలలో మాకేదైనా అవసరం వస్తే నేనున్నానంటూ ముందుకు వచ్చినవారు ఇద్దరే. ఒకరు అరుంధతి స్నేహితురాలు వనజ. మరొకరు మా పక్కింటావిడ జానకమ్మ.



విషయం వినగానే ఇద్దరూ ఆస్పత్రికి బయలుదేరారు. వాళ్ళను చూడగానే అరుంధతి ముఖంలో కొద్దిగా వెలుగు వచ్చింది.

జానకమ్మగారు అరుంధతిని ఎంతగానో ఊరడించారు. "చూడమ్మాయ్ నువ్వు మాకన్నా చదువుకున్న దానివి. లోకం పోకడ తెలిసినదానివి. అలాంటి నీకు నేను చెప్పేదేముంది? ఈ రోజుల్లో ఈ ఆపరేషన్లు వగైరా అంతా చాలా సాధారణం అయిపోయింది. ఒకప్పుడు ఆపరేషన్ చేసి బిడ్డను బయటకు తీశారంటే అంతా ఎంతో వింతగా చెప్పుకునేవారు. ఇప్పుడల్లా కాదు. ఇలా ఆస్పత్రికి వెడుతున్నారు. సిజేరియన్ చేయించుకుంటున్నారు. అలా బిడ్డల్తో తిరిగొస్తున్నారు. నువ్వు ధైర్యంగా ఉండు. నీకేం కాదు. వూరికే నువ్వు ఆందోళనపడి అబ్బాయిని ఖంగారుపెట్టకు" ఆవిడ మాటల్లో ధైర్యం, ఓదార్పు వాత్సల్యం అన్నీ ఉన్నాయి.

అరుంధతి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

నా హృదయం పిండినట్లయింది. నేను ఏదైనా భరించగలను కానీ నా భార్య కంటి నుండి ఒక్క కన్నీటిచుక్క రాలినా భరించ లేదు.

"ఏమండీ...!" పిల్చింది అరుంధతి.

'ఏమిట'న్నట్టు? దగ్గరకు వెళ్ళాను.

"నాకు... నాకు చందన్‌ను చూడాల నుంది" నా చెయ్యి పట్టుకుంది అరుంధతి.

"అలాగే" అన్నట్టు తలాడించాను.

ఆమె చెయ్యిమీద చెయ్యివేసి ఓదార్పుగా నిమిరాను.

"అమ్మా!" పిలిచింది అరుంధతి జానకమ్మ గారిని ఉద్దేశించి. ఆ పిలుపు ఆవిడ మాతృ హృదయాన్ని కదిలించినట్టుంది. ఆవిడ కనులు చెమ్మగిల్లాయి.

"అమ్మా! నాకేదైనా అయితే..." అని అంటుండగా అరుంధతి నోటిమీద చెయ్యి పెట్టి వారించారు జానకమ్మ.

"అమ్మా దయచేసి నన్ను మాట్లాడని వ్వండి. నాకేదైనా అయితే మీరు మా వారిని, బిడ్డలను జాగ్రత్తగా చూసుకుం టారా? "

"అరుంధతీ!"

అవునమ్మా మాకు ఎవ్వరూ లేరు. ఇక మీదట మీరు మాతోనే ఉండిపోండి. నా పిల్లలను సొంత బిడ్డల్లా చూసుకోండి"

జానకమ్మగారు కళ్ళొత్తుకుంటూ నిలబడి పోయారు.

ఆవిడ కూడా మాలాగే అందరూ ఉన్న అనాథ.

ఆవిడ పిల్లలంతా స్టేట్స్‌లో ఉన్నారు. జానకమ్మగారిని వాళ్ళు అక్కడికి తీసుకువె ళ్ళరు. వాళ్ళు ఇక్కడికి రారు. మేము వాళ్ళింట్లో అద్దెకు దిగినప్పటినుంచీ ఆవిడకు మేము మాకు ఆవిడ అన్నట్టుగా కలిసి పోయాం.

"ఏమండీ...!" పిల్చింది అరుంధతి.

దగ్గరకు వెళ్ళాను.

"చందన్‌ను చూడాలి" మళ్ళీ అంది అరుం ధతి.

ఎన్నో చెప్పాలని, నాకు ఎంతో ఓదార్చా లని ఉంది. కానీ పెదవి విప్పి మాట్లాడలేని నా అశక్తతకు నామీద నాకు కోపం వస్తోంది.

అరుంధతి జానకమ్మగారి వంక చూసింది.

ఆమె ఉద్దేశాన్ని అర్థం చేసుకున్నట్టుగా జానకమ్మగారు రూంలోంచి బయటకు వెళ్ళి పోయారు.

"ఏమండీ..."

అరుంధతి దగ్గరకు వెళ్ళాను.

గభాల్న నా చేతులు పట్టుకుంది ఆమె.

వాటిని కళ్ళకద్దుకుంది.

వెచ్చగా కన్నీటిబొట్లు నా చేతులమీద పడ్డాయి.

ఆమె చాలా ఎమోషనల్‌గా ఫీలవు తోంది.

నెమ్మదిగా ఆమె చేతులనుంచి నా చేతులు విడిపించుకున్నాను. ఆమె కన్నీళ్లు తుడిచి ఓదార్పుగా తల నిమిరాను.

"ఏమండీ! మీరు మీరు చాలా మంచి వారు. రోజులు గడిచేకొద్దీ మీరెంత మంచి వారో, మిమ్మల్ని భర్తగా పొందిన నేను ఎంత అదృష్టవంతురాలినయ్యానో నాకు తెలుస్తోంది. ఈ వరాన్ని నాకు అనుగ్రహిం చిన ఆ భగవంతుడికి నేనెప్పుడూ కృతజ్ఞురా లిగా ఉంటాను" ఆయాసంతో మనిషి రొప్పు తోంది.

మాట్లాడద్దన్నట్టుగా సైగ చేశాను.

"లేదండీ! నా మనసులో మాట చెప్పని వ్వండి" అంటూ ఆగి ఒక్కసారి బలంగా ఊపిరి తీసుకుంది.

అరుంధతికి బి.పి. చాలా ఎక్కువగా ఉంది. ఏమాత్రం టెన్షన్ పడటం మంచిది కాదని డాక్టరు చెప్పింది. కానీ అరుంధతిని ఏవిధంగా కంట్రోలు చేయాలో నాకర్థం కావడంలేదు.

"ఏమండీ! నేను మిమ్మల్ని మోసంచేసి పెళ్ళి చేసుకున్నాను. నేను చేసిన మోసం గురించి తెలిశాక కూడా నన్ను అర్థం చేసుకున్నారేగానీ ఇలా ఎందుకు చేశావంటూ ఒక్కమాట... ఒక్కమాట అనలేదు. ఏ భర్త ఏ భార్యను చూసుకోనంత అపురూపంగా చూసుకున్నారు. నాకు ఇంకొక్క ఉపకారం చేయండి" ప్రామిస్ కోసం చెయ్యి ముందుకు చాపింది. ఆమె చేతిలో చెయ్యి వేశాను.

"రేపు నాకేదైనా అయితే చందన్‌ని అనాథని చేయనని నాకు మాట ఇవ్వండి"

ఆ మాటకు నేనెంతగానో కదిలిపోయాను.

గభాల్న అరుంధతి చెయ్యి పట్టుకున్నాను. "దయచేసి అలా అనకు. నీవు ఏవిధంగా నన్ను పెళ్ళి చేసుకున్నా నా జీవితంలో వెలుగు నింపిన దేవతవు నువ్వు" అని చెబ్దామనుకున్నాను. కానీ మౌనంగా ఉండిపోయాను.

"ఏవండీ! ఒక్కసారి ఒక్కసారి బాబుని చూడాలని ఉందండీ" అంది అరుంధతి.

"తీసుకువస్తాను" అని చెప్పి బయటకు వచ్చాను.

జానకమ్మగారికి పరిస్థితి అంతా అర్థమైంది. "చూడు బాబూ! అరుంధతి మాటలు పట్టించుకోకు. ఈ టైమ్‌లోనే నువ్వు ధైర్యం తెచ్చుకోవాలి. నువ్వు ఇలా విచారంగా ఉంటే అమ్మాయి మరీ డీలా పడిపోతుంది. వెళ్ళు, వెళ్ళి చందన్‌ని తీసుకురా! అంతా సవ్యంగానే జరుగుతుంది. అమ్మాయి పండంటి బిడ్డను ప్రసవిస్తుంది. మీరంతా ఎంతో ఆనందంగా ఉంటారు. వెళ్ళు.. వెళ్ళి చందన్‌ని తీసుకురా! అంతా సవ్యంగానే జరుగుతుంది"

జానకమ్మగారిని ఆస్పత్రిలో ఉంచి నేను స్కూలుకి బయలుదేరాను.

స్కూలుకు వెళ్ళేసరికి సాయంత్రం నాలుగు కావస్తోంది.

అప్పటికి పిల్లలంతా వెళ్ళిపోయినట్టున్నారు. చందన్ గురించి నేను అడిగేలోపున వాచ్‌మెన్ నన్ను గుర్తుపట్టాడు. చందన్ ఇంటికి వెళ్ళిపోయాడని చెప్పాడు.

నేను అనుకున్నట్టుగానే అయ్యింది. టైం అయిపోయింది. చందన్ ఇంటికి వెళ్ళిపోయుంటాడని అనుకుంటూనే ఉన్నాను. అయితే ఒక్కోసారి ఎప్పుడైనా ఆటో అతను ఆలస్యంగా వస్తుంటాడు. ఒకవేళ ఈరోజు కూడా అలాగే అయితే చందన్‌ను స్కూలు నుంచే ఆస్పత్రికి తీసుకువెళ్ళచ్చని స్కూలుకి వచ్చాను. వెంటనే ఇంటికి బయలుదేరి వెళ్ళాను.

మేము ఆస్పత్రికి బయలుదేరేముందే పక్కింటివాళ్ళకి చెప్పాను. చందన్ స్కూలు నుంచి వస్తే వాళ్ళింట్లోనే ఉంచమని చెప్పాను.

ఇంటికి వెళ్ళగానే పక్కింటివాళ్ళ దగ్గరకు పరిగెత్తాను. వాళ్ళు లోపలెక్కడో ఉన్నట్టున్నారు. తలుపు వేసి ఉంది. నేనెంత నెమ్మదిగా తలుపు కొట్టినా నా ఆదుర్దా నేను తలుపు కొట్టడంలోనే వ్యక్తం అయినట్టుంది. వెంటనే తలుపు తీశారు. చందన్ గురించి సైగ చేశాను.

వాళ్ళు చెప్పిన సమాధానం విని నేను షాకయ్యాను. ఒక్కక్షణం పాటు నాకు కాళ్ళు, చేతులు ఆడలేదు.

చందన్ స్కూల్లోనూ లేడు.

ఇంటికీ రాలేదు.

ఒకవేళ పక్కింటి పిల్లలందరితో కలిసి ఆడుకుంటున్నాడేమో? ఆ ఆలోచన రావడంతోనే పిల్లలందరూ కలిసి ఆడుకునేచోటుకి వెళ్ళాను. అక్కడ పిల్లలందరూ ఉన్నారుకానీ చందన్ లేడు.

క్షణక్షణానికి నాలో టెన్షన్ పెరిగిపోసాగింది.

చందన్ బహుశా స్కూల్లోనే ఉన్నాడేమో? వాచ్‌మెన్ పొరపాటు పడి ఉంటాడు. అంతే కోల్పోయిన ధైర్యం తిరిగి

వచ్చింది. బయటకు వచ్చి అటుగా వెడ్తున్న ఆటోని పిలిచి ఎక్కి కూర్చున్నాను.

"ఎక్కడికి సార్" అన్నాడతను.

గబగబా జేబులో ఉన్న పాకెట్ బుక్, పెన్నుతీసి ఎక్కడికి వెళ్ళాలో రాసి చూపించాను. చందన్‌కి ఏమీ కాకూడదని, స్కూల్లోనే ఉండాలని ఎంతగానో దేవుణ్ణి ప్రార్థించాను. ఆటో స్కూలు ముందు ఆగీ ఆగగానే ఒక్క ఉదుటున ఆటో దిగాను. వాచ్‌మెన్ నన్ను చూసి ముఖం చిట్లించాడు.

"సార్ వాళ్ళ బాబు ఇంకా ఇంటికి రాలేదట. బహుశా స్కూల్లోనే ఉన్నాడేమో. ఒకసారి కనుక్కుని చెప్పు" అన్నాడు ఆటో అతను.

వాచ్‌మెన్ మమ్మల్ని లోపలికి తీసుకువెళ్ళాడు. లోపల చందన్ వాళ్ళ క్లాసు టీచర్‌ను, ప్రిన్సిపల్‌ను కనుక్కున్నాం. వాళ్ళు కూడా చాలా ఆందోళనపడ్డారు. చందన్ ఫ్రెండ్స్ ఇళ్లకి వెళ్ళి కనుక్కోమని చెప్పారు.

పాపం ఆటో అతను నాతో కూడా తిరిగాడు.

అందరిదీ ఒకటే సమాధానం.

చందన్ మామూలుగానే స్కూలుకి వచ్చాడు. వాళ్లతోపాటే ఇంటి దగ్గర ఆటో దిగాడు. కానీ ఇంట్లో లేడు.

ఇంటి దగ్గర దిగిన చందన్‌ని ఎవరు తీసుకెళ్లి ఉంటారు?

ఒకవేళ ఆస్పత్రికి కానీ వెళ్లాడేమో...! అయినా వాడికి ఈ విషయం గురించి తెలీదే.

అవును... ఇలా జరిగివుంటుంది. చందన్ మామూలుగా ఇంటికి వచ్చేసి ఉంటాడు. పక్కింటివాళ్లు మీ అమ్మగారిని ఆస్పత్రిలో చేర్చారని చెప్పిఉంటారు. దాంతో ఆటో అతను తెలిసినవాడు కావడంతో అదే ఆటోలో ఆస్పత్రికి వెళ్లి ఉంటాడు.

అంతే... అదే జరిగి ఉంటుంది.

ఆవిధంగా అనుకున్నాక నా మనసు కుదుటపడింది. వెంటనే ఆస్పత్రికి బయలుదేరాను.

అయితే అక్కడికి వెళ్లాక నా ఊహ తప్పని తెలిసింది. అప్పుడే అరుంధతిని ఆపరేషన్ థియేటర్‌లోకి తీసుకువెళ్లారుట. అంతవరకూ చందన్‌ను చూడాలంటూ అరుంధతి ఎంతగానో గొడవ చేసిందట. నన్ను చూడగానే జానకమ్మగారు అదే చెప్పారు. నా ఆలస్యానికి కారణమేమిటో నాతో వచ్చిన ఆటో అతను వివరించాడు.

చందన్ స్కూల్లో లేడు...

ఇంటి దగ్గర లేడు...

ఆస్పత్రిలో లేడు...

మరి ఎక్కడున్నాడు? ఎక్కడికి వెళ్లి ఉంటాడు?

ఒక్కసారి భరించలేని నిస్సత్తువ నన్ను ఆవరించింది. ఇప్పుడేంచేయాలి? చందన్‌ని ఎక్కడని వెదకాలి?

ఒకవైపు అరుంధతి ఆపరేషన్ థియేటర్‌లో ఉంది. మరోవైపు చందన్ జాడ లేదు. సమస్యలన్నీ ఒకేసారి చుట్టుముట్టినట్టుగా ఉంది నా పరిస్థితి.

ఏంచెయ్యాలో తెలియక అక్కడున్న కుర్చీలో కూలబడిపోయాను. నా పరిస్థితిని ఆటో అతను అర్థం చేసుకున్నట్టున్నాడు. వెంటనే "సార్! ఆ ఆటో అతని పేరు చెప్పండి... ఎక్కడున్నా వెతికి పట్టుకుంటాను" అన్నాడు.

అప్పుడు స్ఫురించింది నాకు. అవును, ఆటో అతన్ని పట్టుకుంటే సమస్య సాల్వ్ అవుతుంది కదా!

జానకమ్మగారికి అరుంధతిని జాగ్రత్తగా చూసుకోమని చెప్పి నేను, ఆటో అతను బయటకి వచ్చాము.

చందన్‌ని రోజూ స్కూలుకి తీసుకువెళ్లే ఆటో అతని ఇంటికెళ్లాం. అదృష్టవశాత్తూ అతను అప్పుడే ఇంటికి వచ్చాడు. విషయం వినగానే చాలా ఖంగారుపడ్డాడు. "సార్! నా తప్పేంలేదు సర్! మామూలుగానే బాబుని



ఇంటి దగ్గర దింపాను సర్!" అంటూ కాళ్ళా వేళ్ళా పడ్డాడు. అతన్ని అనుమానించాల్సిన పనిలేదనిపించింది. దాదాపు రెండేళ్ళుగా చందన్ ఆ ఆటోలోనే స్కూలుకి వెళ్ళి వస్తున్నాడు. ఎన్నడూ లేనిది ఇవ్వాళే ఇలా జరిగింది.

ఇక ఆటో అతన్ని బెదిరించి ఎలాంటి లాభంలేదు.

"ఎందుకు సార్! ఇంతగా ఆలోచిస్తారు. వెళ్లి పోలీసు రిపోర్టు ఇద్దాం పదండి" అన్నాడు ఆటో అతను.

పోలీసు రిపోర్ట్ ఇద్దాం అనగానే నాకు కిరణ్ గుర్తుకువచ్చాడు. ఆరోజు వెడుతూ వెడుతూ 'నా బిడ్డను ఎలా నా దగ్గరకు రప్పించుకోవాలో నాకు తెలుసు' అని వెళ్ళాడు. ఒకవేళ కిరణ్‌గానీ...

ఇక ఆలస్యం చేసి లాభం లేదు అనుకుంటూ అదే ఆటోలో ఇంటికి వెళ్ళాను. చందన్ ఫొటో తీసుకుని పోలీస్‌స్టేషన్‌కు వెళ్ళాం. అక్కడ రిపోర్ట్ ఇచ్చి సరాసరి ఆస్పత్రికి వచ్చాను.

ఇక నేను చేయగలిగింది ఏమీలేదు. ఏమైనా చేస్తే ఆ భగవంతుడే చెయ్యాలి.

ఆటో అతనికి డబ్బులిచ్చి, మరోసారి కృతజ్ఞతలు తెలిపి పంపించేశాను. అరుంధతి ఇంకా ఆపరేషన్ థియేటర్లోనే ఉంది.

జానకమ్మగారు అటు అరుంధతిని ఇటు చందన్‌ని కాపాడమని దణ్ణాలు పెడుతున్నారనుకుంటాను. మనసులోనే ఆ దేవుడ్ని స్మరిస్తున్నట్టుగా కళ్ళు మూసుకుని కూర్చున్నారు.

నేను కూడా అక్కడున్న కుర్చీలో నిస్సత్తువగా కూలబడ్డాను. అరుంధతి స్నేహితురాలు వనజ కూడా బాగా టెన్షన్ పడుతోంది.

నా మనసు ఎందుకో గతపుటల్ని తిరిగేసేందుకు ఆయత్తమయ్యింది.

★ ★ ★

పిచ్చోళ్ళు రెండు రకాలు.

మెదడు సరిగా ఎదగకో లేక మైండ్‌కు దెబ్బతగలడం వల్లనో పిచ్చివాళ్ళుగా ముద్ర వేయించుకున్నవారు కొందరైతే.

మాట్లాడటం రాక, మాట్లాడలేక, తమ మనసులో భావాలు ఏదోవిధంగా వ్యక్తం చేయాలనే ప్రయత్నంలో పిచ్చివాళ్ళుగా ముద్ర వేయించుకున్నవారు కొందరు.

నేను రెండో కేటగిరికి చెందినవాడిని.

అంటే మీరు చెప్పినవన్నీ నాకు అర్థం అవుతాయి. కానీ తిరిగి సమాధానం చెప్పలేను. ఎందుకంటే నేను మూగవాడిని. అందరితో నాకు మాట్లాడాలని, నా మనసులో భావాలు పంచుకోవాలని ఉన్నా మాట్లాడలేను. అందుకే సైగలు చేస్తాను. ఒక్కోసారి నా అసహాయతకు ఏడుస్తాను. అరుస్తాను. జుట్టు పీక్కుంటాను. అందుకే నన్నందరూ పిచ్చోడని అంటారు.

నా పేరు సూర్య వెంకటరామకృష్ణ శేషసాయి.

చిన్నప్పుడు నన్ను అందరూ కృష్ణ అని పిలిచేవారు. ఆ తర్వాత తర్వాత నా అసలు పేరు అంతా మర్చిపోయారు. నాకు 'పిచ్చోడు' అన్న పేరు స్థిరపడిపోయింది.

★ ★ ★

బాల్యం ఓ అందమైన వరం అంటారు.

అది పూర్తిగా నిజం. నా బాల్యం గురించి తల్చుకుంటే అదంతా నాకు ఓ కలలా ఉంటుంది.

నా జీవితంలో నేను ఆనందంగా గడిపిన క్షణాలు ముఖ్యంగా నా పెళ్ళికిముందు ఏవైనా ఉన్నాయా అంటే అవి నా బాల్యం రోజులే. నాకు మూడేళ్ళు వయసు వచ్చేవరకు నా జీవితంలో ఆనందం, సంతోషం తప్ప బాధ, కన్నీళ్లు అన్న పదాలకు అర్థమే తెలీదు.

నేను ఆడింది ఆట! పాడింది పాటగా నా జీవితం గడిచింది. అమ్మమ్మ, తాతయ్య, నానమ్మ, తాతయ్య, బాబాయిలు, అత్తయ్యలు ఇలా అందరికీ నేనంటే ఇష్టమే.





నాకు మూడేళ్ళు వచ్చేవరకు కాళ్ళు కింద పెట్టకుండా పెరిగానంటే నేను ఎంత అపు రూపంగా పెరిగి ఉంటానో మీకీపాటికి అర్థ మయ్యే ఉంటుంది.

కానీ ఒకరోజు...

సాధారణంగా అమ్మావాళ్ళు పనంతా అయిపోగానే పక్కింటి వాళ్ళతోనో ఎదు రింటి వాళ్ళతోనో కబుర్లు చెప్పేందుకు అంతా ఒకచోట సమావేశం అవుతారు. ఆ కబుర్లలో అధికశాతం ఆత్మస్తుతి, పరనింద తప్పించి ఒక్కటి... ఒక్కటంటే ఒక్కటైనా పనికి వచ్చేది ఉండదు.

ఎవరినైనా విమర్శించడం అంటే అందరి కన్నా అమ్మే ముందు ఉండేది. కానీ ఆరోజు మాత్రం అటుతిరిగి ఇటుతిరిగి గాలి నావైపు తిరిగింది.

"ఏం వదినా! మీ కృష్ణకు మూడేళ్ళు నిండినట్టున్నాయే..." అంది పక్కింటావిడ.

"అవును వదినా!" అంది అమ్మ.

"మూడేళ్లు నిండుతున్నా ఇంకా మాటలు రాలేదా! అదే మావాడైతే ఏడో నెలలోనే అమ్మ, అత్త, తాత అనడం మొదలుపెట్టే శాడు. ఏడాది నిండేసరికి ఇక వాడి పొట్ట నిండా మాటలే. ఎవరో చెప్పి మాట్లాడించి నట్లే మాట్లాడేసేవాడు. ప్రతిదానికి సందే హమే. అన్నింటికీ అదేంటి? ఇదేంటి? అదెలా? ఇదెలా? అని ప్రశ్నలతో ప్రాణాలు తీసేసేవాడు. ఈ గొడవ పడలేక సరిగ్గా మూడోఏడు వచ్చిందో లేదో స్కూల్లో పడేశాను." నాన్‌స్టాప్‌గా ఆవిడ చెప్తూనే వుంది.

అమ్మ ముఖం సీరియస్‌గా అయిపో యింది.

"కొంతమంది పిల్లలకు మాటలు ఆల స్యంగా వస్తాయి వదినా! మన కృష్ణకు కూడా అంతేనేమో!" అంది మరొక ఆవిడ.

"ఏమైనా మరీ ఇంత ఆలస్యంగానా! పోనీ ఒకసారి డాక్టర్‌కి చూపించలేకపోయారా?" అంది మరో ఆవిడ.

మొత్తంమీద ఆ రోజంతా నాకు మాటలు రాకపోవడానికి గల కారణాలు అన్వేషిస్తూ ఉండిపోయారు.

ఇతరుల్ని విమర్శించేందుకైనా అందరి కన్నా ముందు ఉండే అమ్మ ఈసారి బాణా లన్నీ తనవైపుకు ఎక్కుపెట్టేసరికి మాట్లాడలే కపోయింది.

"లోపల పనుంది వదినా! వస్తాను" అంటూ హడావిడిగా లేచి లోపలకు వెళ్ళిపో యింది. అంతా ఉత్తిదే. అక్కడ ఉండబుద్ధి కాక అమ్మ పనివంకతో లోపలికి వచ్చే సింది.

అమ్మ అలా లేచి వెళ్ళగానే మిగతా అందరూ ఒకరినొకరు చూసుకున్నారు.

'ఈవిడకు, వీళ్ళ ఆయనకు ఇంతేసి నోరు ఇచ్చాడుగా! ఇంకా కొడుకుకు కూడా ఎందుకు లెమ్మనుకుంటాడు ఆ భగవం తుడు. అందుకే కొడుకుని మూగవాడ్ని చేశాడు?' అన్న మాటలు నా చెవినప డ్డాయి.

అటుతర్వాత నుంచీ నా జీవితంలో మార్పు ఆరంభమైంది. అంతకుముందు వరకు నాన్నా, బుజ్జీ, కృష్ణా, కృష్ణుడు అని ఎంతో ప్రేమగా పిలిచేవారంతా ఇప్పుడు మూగ మొద్దు, మూగ వెధవ అని పిల వడం మొదలుపెట్టారు.

నాకన్న సంవత్సరం చిన్నవాడైన తమ్ముడు గలగలా మాట్లాడేస్తుంటే నేను కనీసం అత్త, తాత కూడా అనకపోయేసరికి అమ్మ చిరాకుపడేది. నా ఈడు పిల్లలంతా ఎంతో సరదాగా, నవ్వుతూ, తుళ్ళుతూ ఆడు కుంటుంటే వారితో కలిసి ఆడుకోవాలని నాకెంతో ఉబలాటంగా ఉండేది. కాని నా మూగతనం నాకు ప్రతిబంధకమయ్యేది.

ఓరోజు చుట్టుపక్కల పిల్లలతో కలిసి ఆడుకోవడానికి వెళ్ళాను. ఓ పదినిమిషాల పాటు అందరూ బానేవున్నారు. అంతలో ఏమైందో అంతా నా చుట్టూ చేరి మూగోడు! పిచ్చోడు! అని గేలిచేయడం

మొదలుపెట్టారు. చాలాసేపు ఓర్చుకున్నాను. కానీ నేను ఓపిక పట్టేకొద్దీ వాళ్ళ అల్లరి శృతిమించిపోసాగింది. ఇక లాభం లేక వాళ్ళల్లో ఒకడ్ని పట్టుకుని కొట్టాను. మరొకడిమీదకు రాయి విసిరేశాను.

అంతే పిల్లలంతా ఒక్కసారిగా ఏడుపు లంకించుకున్నారు. అరుపులు, కేకలతో వాతావరణమంతా మారిపోయింది.

ఇదంతా నేను కావాలని చేయలేదు. వాళ్ళ బారినుంచి నన్ను నేను రక్షించుకోవడం కోసం అలా చేశాను.

పిల్లలంతా వెళ్ళి వాళ్ళ తల్లులకు ఏంచెప్పారోకానీ వాళ్లంతా ఇంటిమీదకు దండెత్తి వచ్చారు.

ఆరోజు చాలా పెద్ద గొడవ జరిగింది.

"పిచ్చి వెధవని ఇంట్లో కట్టిపడెయ్యక ఇలా వీధిమీదకు వదిలేస్తారా? " అని ఒకావిడ అంటే,

"ఉట్టి పుణ్యానికి పిల్లలు ఆడుకుంటున్న చోటుకి వెళ్ళి వాళ్ళను గొడ్డును బాదినట్టు బాదాడు. సమయానికి మేం రాబట్టి సరిపోయింది. లేదంటే వాళ్ళ ప్రాణాలు తీసేసేవాడు. చూడమ్మా! నీ పిల్లాడు నీకు ముద్దు అయితే వాడు ఇంట్లోంచి బయటకు రాకుండా చూసుకోండి. లేదా ఏ పిచ్చాసుపత్రిలోనో పడెయ్యండి. అంతేకానీ మరోసారి ఇలా జరిగిందంటే మాత్రం పోలీసుల్ని పిలవాల్సివస్తుంది" అంది మరోకావిడ.

"అసలేం జరిగింది? " అని కానీ "ఎందుకు వాళ్ళని కొట్టావని" కానీ నన్నెవ్వరూ అడగలేదు.

ఒకవేళ అడిగినా నేను ఎలా బదులివ్వగలను?

నాకా మాటలు రావు.

నా సైగల భాష వారికి అర్థంకాదు.

పోనీ పేపర్‌మీద రాద్దామంటే అదీ కుదరదు. నాకు రాయడం రాదు కదా!

ఆ విధంగా నేను నా మనసులో మాటను చెప్పలేని అశక్తుడినయ్యాను. మాటకున్న విలువ ఏమిటో నాకు అప్పుడు అర్థమయ్యింది.

మామూలుగా అయితే అమ్మ నన్ను తిట్టేదేమో... కానీ ఈసారి మాత్రం అమ్మ నన్ను సపోర్ట్ చేస్తూ మాట్లాడింది.

"చూడండీ! మీ పిల్లలు చెప్పిన మాటలు నమ్మి మీరిలా నా మీదకు దండయాత్రకు వచ్చారుకానీ వాళ్ళేం చేయకుండానే మా అబ్బాయి వాళ్ళను కొట్టాడంటారా? వాడికి మాటలు రాకపోవచ్చు కానీ వాడూ మనిషేనండీ... వాడికీ మనసుంది. ఎవరైనా తనను ఏడ్పించినా, గేలి చేసినా ఆ మనసు బాధపడుతుంది. ఎదురుతిరుగుతుంది. మీకు ఇప్పుడే చెప్తున్నాను... మీరు మీ పిల్లల్ని అదుపులో పెట్టుకోండి. మా అబ్బాయి జోలికి రాకుండా చూసుకోండి. లేదంటే ఇలాగే జరుగుతుంది. వాడు అలాగే కొడతాడు" అని చెప్పింది.

అమ్మ అలా కఠినంగా మాట్లాడేసరికి అందరూ కామ్ అయిపోయారు. నిజానికి తప్పు వాళ్ళ పిల్లలదేనని వాళ్ళకి తెలుసు. అలా చేయడం తప్పని వాళ్ళు చెప్పి వుంటే పిల్లలు కూడా మరోసారి అలాంటి పని చేసేవారు కాదు. కానీ ప్రపంచంలో చాలా మంది పెద్దలు బహుశా అలాగే వుంటారేమో!

అంతే అందరూ కామ్‌గా వెళ్ళిపోయారు.

ఆరోజు తర్వాత చుట్టుపక్కలవాళ్ళు ఇదివరకులా అమ్మతో మాట్లాడడం మానేశారు.

ఒకటి రెండురోజులు అమ్మ కూడా బింకంగానే ఉంది.

కానీ మూడోరోజునుండి మొదలైంది...

ఇక్కడ మా కుటుంబం గురించి కొంచెం చెప్పుకోవాలి... నాన్నగారు పార్టీ అని, సంఘసేవ అని తిరుగుతుంటారు. ఆయనకు ఊళ్ళోవాళ్ళ విషయాలు పట్టినంతగా ఇంటి విషయాలు పట్టవు. ఎవరైనా వచ్చి ఇంద్రుడు, చంద్రుడు అని పొగిడితేచాలు వాళ్ళకోసం ఏదైనా చేసేస్తారు. ఇంట్లో ఈగలమోత, బయట పల్లకీల మోత అంటారు




చూడండి అచ్చంగా నాన్నగారి మనస్తత్వం అలాంటిదే. ఇంట్లోవాళ్ళ ఫీలింగ్స్‌తో ఆయనకు ఏ విధమైన సంబంధమూలేదు. ఆయన ఆలోచనంతా బయట తనగురించి ఏమనుకుంటున్నారనే...

ఆయన పేరు సోమయాజులు.

ఉదయం తొమ్మిది గంటలయ్యేసరికి ఇస్త్రీ బట్టలు ధరించి పార్టీ కార్యాలయానికి వెళ్ళి పోతారు. క్రియాశీల రాజకీయాలలో కీలక మైన పాత్ర పోషిస్తున్నా అదేమిటో ఇంతవ రకూ ఆయనను ఎలాంటి పదవీ వరించ లేదు.

"ఇదేంటి సోమయాజులుగారూ... మీ తర్వాత వచ్చినవారు కూడా ఎమ్.ఎల్.ఎ.లు, ఎం.పి.లు అయిపోతుంటే మీలాంటి సీనియర్ సభ్యుడిని ఇలాగే వుంచేయడం చాలా అన్యాయం సుమండీ" అని ఎవరైనా అన్నారనుకోండి... తనకు పదవిమీద వాంఛలేదని, నిస్వార్థంగా ప్రజలకు సేవ చేసేందుకే రాజకీయాలలోకి వచ్చానని మొదలుపెట్టి అవతలివ్యక్తి నోరెత్తకుండా సమాధానం చెప్పగల సమర్థులు. నిజంగానే ఆయనకు పదవీకాంక్ష లేదని మీరనుకుంటే మాత్రం పొరబడినట్టే.

'ఇన్నాళ్ళుగా పార్టీకి ఇంత సేవ చేశాను. అంత సేవ చేశాను. నన్నెవరూ గుర్తించడం లేదు. ఎవ్వరూ నాకు ఎమ్.ఎల్.ఎ. టికెట్టు ఇస్తాననడంలేదు' అని ఇంట్లో వాపోతుం టాడు.

ఒక్కమాటలో చెప్పాలంటే ఇంట్లోవాళ్ళు ఎంత ఇబ్బందైనా పడనీ బయట తన ఇమేజ్ చెక్కుచెదరకూడదు. ఎవ్వరూ తనను ఒక్కమాట కూడా అనకూడదు. అందరూ 'సోమయాజులుగారా! చాలా మంచి మనిషండీ! మహానుభావుడండీ' అని పొగడాలి. అదీ ఆయన కోరిక, లక్ష్యం, ఆశయం, ఏదైనా సరే...

అమ్మ పేరు రామసీత.

అమ్మకి తన పన్నెండో ఏట నాన్నగారితో పెళ్ళైంది.

ఏమీ తెలియని ఆ వయసులో కోడలిగా ఇంటికి వచ్చిన అమ్మకు నరకం ఎలా ఉంటుందో చూపించిందట నానమ్మ.

ఫలితంగా అమ్మ ఓ సినిక్‌లా తయా రైంది.

ఇతరులు బాధపడితే తను ఆనంది స్తుంది.

ఇతరులను విమర్శించడంలో అంతులేని సంతోషాన్ని పొందుతుంది. ఎవరైనా కష్టాలు పడుతుంటే తను నవ్వుకుంటుంది.

ఎంతసేపూ తన పుట్టింటివాళ్ళ గొప్పలు చెప్పుకుంటూ అత్తారింటి వాళ్ళను పూచిక పుల్లల్లా తీసిపారేస్తుంటుంది.

దానికితోడు నాన్నగారు కూడా అమ్మను ఎక్కడికైనా తీసుకువెళ్ళడం కానీ సరదాగా అమ్మతో కబుర్లు చెప్పడంకానీ ఎన్నడూ చేసేవారుకాదు. దాంతో అమ్మ మనస్తత్వం విపరీతంగా తయారైంది.

అమ్మ ఉత్తర ధృవం అయితే, నాన్న దక్షిణ ధృవం.

అమ్మ అవునంటే... నాన్న కాదంటాడు.

నాన్న ఇంట్లో వున్నంతసేపూ బయట తనను ఎంతగా గౌరవిస్తారో చెప్తూ అమ్మని విమర్శిస్తుంటారు.

అమ్మ నాన్న వెళ్ళగానే ఆయనకు అష్టోత్రం ప్రారంభించి సంతృప్తిపడుతుం టుంది.

వారిద్దరిలోనూ ఉన్న సారూప్యత ఏమి టంటే... ఇద్దరికీ ఇంటి విషయాలు పట్టవు. కానీ పక్కవాళ్ళ జీవితాలలోకి తొంగిచూ డడం అంటే వారికి చాలా ఇష్టం.

పక్కవాళ్ళ జీవితాలలోకి తొంగిచూసి వారి జీవితాలలో ఏదైనా అపశృతి ఉంటే దానిని సరిచేయడం నాన్న అలవాటు.

పక్కవాళ్ళ జీవితాలలోకి తొంగిచూసి వారి జీవితాలలో ఏదైనా అపశృతి ఉంటే దానిని బయటపెట్టడం, నలుగురిలోను చర్చించడం, వారిని విమర్శించడం, పరిహా




సించి నవ్వుకోవడం అమ్మకు అలవాటు.

కానీ ఎప్పుడైతే నా రూపంలో అమ్మని అందరూ పరిహసించడం మొదలుపెట్టారో మా ఇల్లు మరింత నరకమైపోయింది.

ఇంతకుముందు చెప్పినట్టు ఒకటి, రెండు రోజులంటే కోపంవలన ఇంట్లోనే ఉండిపోయింది కానీ ఆ తర్వాత మాత్రం ఆవిడకు టైం గడవడం చాలా కష్టమైపోయింది.

నాన్న బయటకు వెళ్ళిపోగానే గబగబా పనిచేసేసుకుని, నాలుగు మెతుకులు తిని ఎవరో ఒకరి ఇంట్లో చేరి ఎవరో ఒకరిని ఆడిపోసుకోవడం కొన్నాళ్ళుగా ఆవిడ దినచర్యలో ఒక భాగమైపోయింది.

తాగేవాడు మందు లేనిదే ఎలా అయితే వుండలేడో, సిగరెట్ పీల్చేవాడు సిగరెట్ లేకపోతే ఎలా అల్లాడిపోతాడో, మత్తు పదార్థాలకు అలవాటు పడినవాడు అవి లేకపోతే ఎలా తల్లడిల్లిపోతాడో... గాసిపింగ్ చేసే వాళ్ళు కూడా అంతే...

ఒక్కమాటలో చెప్పాలంటే పైన చెప్పిన వాటన్నింటికన్నా ఇది ఇంకా పెద్ద వ్యసనం.

ఎప్పుడైతే పక్కవాళ్ళు అమ్మతో మాట్లాడడం మానేశారో ఆ కోపం అంతా నావైపు తిరిగింది. "మాటలు రాని వెధవ్వి, ఓ మూల పడుండక ఆ పిల్లల్ని కొట్టడం ఎందుకు? నీ మూలంగా ఆప్యాయంగా పలకరించి, నా కష్టసుఖాలు పంచుకునే చుట్టుపక్కలవాళ్ళు ఇప్పుడు భీష్మించుకుని కూర్చున్నారు. మీ నాన్నవల్లే అనుకుంటే నీ వల్ల కూడా నాకు సుఖశాంతులు లేకుండా పోయాయి"

ఇలా సాగింది అమ్మ ధోరణి.

రెండురోజుల క్రితం అమ్మ ప్రవర్తనకు, నేటి అమ్మ ప్రవర్తనకు ఎంతో తేడా ఉంది. ఏది అసలు ప్రవర్తన అంటే 'రెండూ' అని చెప్పాలి. ఎందుకంటే అందరిలాగే అమ్మ కూడా అతి సాధారణ వ్యక్తి. అందుకే 'ఎప్పటికి ఆ మాటలాడి' అన్నట్టుగా అప్పుడు అలా మాట్లాడింది. ఇప్పుడు ఇలా మాట్లాడుతోంది.

మనుష్యులు ఇలా మాట్లాడుతున్నప్పుడు మాత్రం భగవంతుడు నన్ను మూగవాడ్ని చేసి చాలా మంచిపని చేశాడన్పించేది. మొత్తంమీద ఈ సంఘటన తర్వాత నేను మరింత అంతర్ముఖుడినైపోయాను.

మనుషుల్నీ, వారి స్వభావాలను, మనస్తత్వాలను పరిశీలించడం నాకు ఓ అలవాటుగా మారింది.

నాకు అయిదేళ్ళు వచ్చాయి.

ఇక నాకు మాటలు రావని నిర్ధారణ అయిపోయింది.

చుట్టుపక్కల పిల్లలు నన్ను పిచ్చాడని, మూగవాడని ఇంకా గేలి చేస్తూనే ఉన్నారు. అయినా వారిని నేనేమీ అనడంలేదు. వాళ్ళని నేనేదైనా అంటే వాళ్ళు వెళ్ళి వాళ్ళ తల్లులతో చెప్తారు. వాళ్ళు వచ్చి అమ్మతో పోట్లాడతారు. అమ్మతో మాట్లాడడం మానేస్తారు. వాళ్ళతో పోచుకోలు కబుర్లు చెప్పకపోతే అమ్మకు తోచదు. ఇదంతా చెయిన్ రియాక్షన్. అందుకే ఎవరు ఏమన్నా మౌనంగా భరించే ధోరణి నాకు అలవాటైపోయింది.

తమ్ముడు స్కూలుకి వెడుతున్నాడు. అసలే వాడు వాగుడుకాయ. దానికితోడు స్కూలుకి కూడా వెళుతుండడంతో వాడి మనసు రెక్కలు తొడుక్కున్న విహంగం అయ్యింది. ఎన్నెన్ని కబుర్లు చెప్పేవాడో...

వాడు చెప్పే మాటలు, వాడు పాడే పాటలతో మా ఇల్లు కోకిలల పాఠశాల అయిపోయింది.

తమ్ముడు ఎప్పుడు మాట్లాడినా ఆ మాటలు నా గొంతులోంచే వస్తున్న భావన నాలో కలిగేది.

శారదాంటీ మా ఇంటిపక్కకు అద్దెకు రాకపోతే నా జీవితం ఇలాగే ముగిసిపోయేదేమో!

కానీ విధి లిఖితం అలాలేదు.

మాట ఇవ్వకపోయినా నాకు మంచి జీవి

తాన్ని ఇవ్వాలనుకున్నట్టున్నాడా దేవుడు. అందుకే శారదాంటీని పంపించాడు.

ఆంటీ నా జీవితానికి వెలుగునిచ్చిన దేవత అని చెప్పచ్చు

ఆ రోజు...

మా పక్కింటికి ఓ కుటుంబం అద్దెకు వస్తున్నారని తెలిసి అందరిలా నేనూ ఉత్సాహంగా చూస్తున్నాను.

దాదాపు పదిగంటల సమయంలో అనుకుంటాను మా ఇంటిముందు ఓ ఆటో ఆగింది. ఆటోలోంచి ఓ స్త్రీ, ఓ పురుషుడు, ఓ చిన్నపాప దిగారు. ఆవిడ ఆటో దిగి ఒక్కసారి చుట్టూ పరికించి చూసింది. మా గుమ్మంలో నేను కన్పించానేమో... సరాసరి మా ఇంటివైపుకు నడిచింది. నా దగ్గరకు రాగానే నన్ను ఉద్దేశించి "బాబూ! నీ పేరేమిటి? " అని అడిగింది.

నేను ఆవిడవైపు అలాగే చూస్తూ నిలబడిపోయాను.

ఆవిడ ముఖం ఎంతో ప్రశాంతంగా ఉంది.

కళ్ళల్లో ఆప్యాయత చిందులేస్తోంది.

మాటలో చిన్న, పెద్ద ఎవరినైనా సమంగా గౌరవించగల సంస్కారం ఉట్టిపడుతోంది.

మనిషి నిలువెత్తు మంచితనానికి చిహ్నంగా ఉంది.

"బాబూ" అన్న ఆ ఒక్క పిలుపులో మూర్తీభవించిన మానవత్వం నా కళ్ళెదుట నిలిచినట్లుగా అన్పించింది.

"బాబూ! నీ పేరేమిటి? " మరోసారి అడిగిందావిడ.

ఈసారి కూడా మౌనమే నా సమాధానం అయ్యింది.

"అమ్మగారున్నారా బాబూ" అని అడిగిందీసారి.

ఉన్నారన్నట్టు తల ఊపి లోపలకు పరుగెత్తాను.

"ఏమిట్రా ఆ పరుగు? నెమ్మదిగా రాలేవా? " ఒక్క కసురు కసిరింది అమ్మ. అమ్మ అన్న మాటలు ఏవీ నా చెవిన పడలేదు. అమ్మ కొంగుపట్టుకుని బయటకు రమ్మని లాగాను.

"ఏంట్రా... మళ్ళీ ఎవరైనా అడుక్కునేవాళ్ళు వచ్చారా? అయినా నీ బాబు చేస్తున్న దానధర్మాలు సరిపోవడంలేదా? నువ్వూ మొదలుపెట్టావా? " చిరాకుపడింది అమ్మ.

నా మనసు చివుక్కుమంది.

ఎవరైనా అడుక్కునేవారు ఇంటిముందు కొస్తే చాలు డబ్బాలో బియ్యానికి, చిల్లర డబ్బులికి రెక్కలు వస్తాయి. అమ్మ చేతిలో తిట్లు పడతాయి. అయితే ఎన్నిసార్లు తిట్లు తిన్నా నా ధోరణి నాదే.

అంతలో ఆవిడే లోపలికి వచ్చింది.

ఈ టైంలో ఎవరైనా పలకరిస్తే అమ్మకి ఎంతో కోపం వస్తుంది.

"నమస్కారమండీ... నా పేరు శారద" అందావిడ.

'శారద' పేరు ఎంతో బావుంది అనుకున్నాను.

అమ్మ కనీసం ప్రతి నమస్కారం కూడా చేయకుండా విసురుగా సమాధానం చెప్పింది. "ఆయన ఇంట్లో లేరు. పార్టీ కార్యాలయానికి వెళ్ళి కలవండి" అంది.

అమ్మ చెప్పింది ఆవిడకు అర్థంకాలేదనుకుంటాను.

ఒక్కనిమిషం అలాగే నిలబడి తర్వాత అంది, "క్షమించాలి... ఉదయాన్నే వచ్చి మీ పనికి భంగం కలిగిస్తున్నట్టున్నాను. నేను వచ్చింది మీ వారికోసం కాదు... మీకోసం" అందావిడ.

అమ్మ గిరుక్కున వెనక్కి తిరిగింది.

శారదగారు నవ్వుతూ మరోసారి నమస్కారం చేశారు. "మేం మీ పక్క వాటాలోకి అద్దెకు దిగుతున్నాం. వర్జ్యం రాకుండా పాలు పొంగించాలని ముందు మేం వచ్చాం. ఇంకా సామాన్లవీ తెచ్చుకోలేదు.





మంచినీళ్ళు ఈరోజు రావట కదా. కొంచెం మంచినీళ్ళు ఇస్తారేమోనని వచ్చాను" నమ్రతగా పలికింది ఆవిడ స్వరం.

ఏమనుకుందో ఏమో అమ్మ మారు మాట్లాడకుండా బిందెతో నీళ్ళిచ్చింది.

"చాలా థాంక్సండీ. ఈ మహానగరంలో బిందెడు నీళ్ళు అప్పు ఇవ్వడం అంటే కోటి రూపాయలు అప్పిచ్చినంత పుణ్యం" అంటూ నావైపు తిరిగి "ఏమ్మా! నన్ను చూసి భయపడ్డావా? ఇప్పుడైనా నీ పేరు చెప్తావా? " అనడిగింది.

నేను బదులివ్వలేదు. అమ్మ ఆ సంగతే పట్టించుకోలేదు.

శారదగారు వెడుతూ "ఏం బాబూ! సాయంత్రం మా ఇంటికి వస్తావా? మా అమ్మాయితో ఆడుకుంటావా? " అన్నారు.

సరేనన్నట్లు తలూపాను. ఎందుకోగానీ నాకు ఆంటీ బాగా నచ్చింది.

మరో గంట తర్వాత ఆవిడ పాయసం తీసుకొచ్చి ఇచ్చారు. అమ్మ కూర్చోమని ఎంత బలవంతం చేసినా సామాన్లు సర్దుకోవాల్సింది ఉందండీ అని చెప్పి వెళ్ళిపోయారు.

ఆవిడ మరికాసేపు ఉంటే బాగుండునన్పించింది.

ఆ తర్వాత రెండుమూడు రోజులపాటు ఆవిడకు సామాన్లు సర్దుకోవడంతోనే సరిపోయింది.

ఓరోజు సాయంత్రం నేను వాకిట్లో నిలబడి ఉన్నాను.

శారదగారి అమ్మాయి ఒక్కత్తే బాల్ ఆడుకుంటోంది. తల్లిదండ్రులు ప్రేమగా చూస్తే పిల్లల్ని ప్రోత్సహిస్తే ఆ పిల్లల ముఖాల్లో ఓ వింత అందం కన్పిస్తుంది. వారిలో ఆత్మవిశ్వాసం తొణికిసలాడుతుంది. ఆ పిల్లలు ఉత్సాహానికి మారు రూపాలుగానూ, ఆత్మవిశ్వాసానికి ప్రతిరూపంగానూ ఉంటారనడానికి నిదర్శనం శారదగారి అమ్మాయి. చుట్టుపక్కల పిల్లలతో పెద్దగా కలవదు. ఎప్పుడూ ఒక్కత్తే ఆడుకుంటూ ఉంటుంది.

ఆ అమ్మాయి ఆడుకుంటున్న బాల్ వచ్చి నా దగ్గర పడింది. బాల్ తీసుకోవడానికి వచ్చిన ఆ పాప నన్ను ఎంతో ఆప్యాయంగా పలకరించింది. అంతలో వాళ్ళమ్మగారు కూడా వచ్చారు.

ఆరోజు నేను శారదగారింటికి వెళ్ళాను.

ఆవిడ ఇల్లు సర్దుకున్న తీరు చూస్తే ఎంతో ముచ్చటగా అన్పించింది. అమ్మ కూడా ఇల్లు సర్దుతుంది. కాకపోతే అమ్మ ఏ పని చేసినా ఏదో చేయాలి కాబట్టి చేస్తున్నట్టుగా ఉంటుందే తప్ప చేసే పనిపట్ల శ్రద్ధ చూపదు. కానీ ఆంటీ అలాకాదు. చేసే ప్రతి పనీ ఎంతో శ్రద్ధగానూ, ఇష్టంగానూ చేస్తుంది.

జీవితంలో ప్రతి క్షణాన్నీ ఆస్వాదిస్తూ బతికేవారికి ఏదో ఒకరకంగా రోజు గడిస్తే చాలనుకునేవారికి అదే తేడా. అదీగాక ఆంటీ తన సమయాన్నంతా తన ఇల్లు చక్కబెట్టుకోవడానికి వెచ్చిస్తే అమ్మ ఆ సంగతి వదిలేసి పక్కింటివాళ్ళ జీవితాలలోకి తొంగిచూసే ప్రయత్నం చేస్తుంది.

"ముందు నీ పేరేమిటో చెప్పు" అడిగారు శారదగారు.

నేను మౌనంగా ఉండిపోయాను.

"నా పేరు శారద. ఇది మాఅమ్మాయి, తన పేరు అరుంధతి. మా ఇద్దరికీ పేరు ఉన్నట్టే నీకూ ఓ పేరు ఉంటుంది కదా. చెప్పు... నీ పేరేమిటి? " అంది శారద.

ఎలా చెప్పాలో నాకు అర్థంకాలేదు.

"నిన్ను మేం ఏమని పిలవాలి? " అడిగింది అరుంధతి.

ఒకసారి హాలంతా పరీక్షగా చూశాను. టీపాయ్‌మీద కృష్ణుడి బొమ్మ కన్పించింది. అంతే ఆ బొమ్మదగ్గరకి పరుగెత్తుకువెళ్ళి నా పేరేమిటో సైగ చేసి చెప్పాను.

"కృష్ణ... అంటే నీపేరు కృష్ణా? " అంది శారదాంటీ.

అవునన్నట్లు గబగబా తలాడించాను.

హమ్మయ్య మొత్తానికి నా పేరు చెప్పగలిగాను అన్న సంతృప్తి నాలో కలిగింది.

"వెరీ గుడ్... నువ్వు చాలా తెలివి కలవాడివి" అన్నారావిడ.

ఆ మాటకు నాలో ఏదో తెలీని ఉత్సాహం ఉరకలు వేసింది. ఇంతవరకూ ఈ మాట నాతో ఎవరూ అనలేదు.

"ఆ మాట నోటితో కూడా చెప్పచ్చుకదా" అని తిరిగి ఆవిడే, "అవునూ... నువ్వెక్కువ మాట్లాడవా? లేక మాతో మాట్లాడడం నీకు ఇష్టంలేదా? " అని అడిగారు ఆంటీ.

నా కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి.

అంతలో మా పక్కింటి అబ్బాయి వెంకట్ వచ్చాడు. నన్ను అక్కడ చూసి, "ఏంటి ఈ మూగోడు ఇక్కడున్నాడేంటి? " అని, "ఆంటీ! అమ్మ ఈ గ్లాసుతో పంచదార ఇమ్మంది" అన్నాడు.

శారదగారు విస్తుపోయారు. వాడి భుజం పట్టుకుని "ఏంటి అన్నావు? " అన్నారు.

"మూగోడు అని అన్నానాంటీ. మాటలు రానివాడిని మూగోడనేగా అంటారు" అంటూ అక్కడున్న కుర్చీలో కూర్చున్నాడు.

ఆంటీ నావైపు చూశారు. ఆవిడ షాక్ అయినట్టుగా ఆవిడ ముఖమే చెప్తోంది.

నిజమేనన్నట్లుగా తలాడించాను.

ఈ నిజం జీర్ణించుకోవడానికి ఆవిడకు కొంచెం ఎక్కువ సమయమే పట్టినట్లుంది.

"ఆంటీ! పంచదార ఇస్తారా? " మరోసారి అడిగాడు వెంకట్.

ఆంటీ లోపలికి వెళ్ళి పంచదార తీసుకొచ్చి ఇచ్చింది.

వెంకట్ వెళ్ళాక ఆంటీ నన్ను దగ్గరకు తీసుకుంది. "సారీ అమ్మా! నాకు ఈ విషయం తెలీక ఎన్నోసార్లు నీ పేరేమిటి? అని అడిగి నిన్ను బాధపెట్టాను. ఐ యామ్ రియల్లీ సారీ" అన్నారు.

ఆంటీ అందరిలా నన్ను వేళాకోళంగా మాట్లాడలేదు. నన్ను చూసి నవ్వలేదు. నా లోపాన్ని పరిహసించలేదు. అది నాకెంతో నచ్చింది.

"నీ పేరేమిటి? " అని అడగడం చాలా సాధారణ సంగతి. అయినా కూడా తను ఎంతో పెద్ద పొరపాటు చేసినట్లుగా నన్ను క్షమాపణ అడుగుతుంటే ఆంటీ వ్యక్తిత్వం నన్నెంతో సేదతీర్చినట్లు అన్పించింది. తెలిసి కానీ, తెలియకుండా కానీ తన ప్రవర్తన, మాటలతో ఎవ్వరినీ బాధపెట్టకూడదనుకునే తత్వం ఆంటీది.

అలాంటివారు కోటిమందిలో ఒక్కరుంటారేమో.

ఆ మర్నాడు మధ్యాహ్నం శారదాంటీ మా ఇంటికి వచ్చింది.

అమ్మ కూడా పనంతా పూర్తయి తీరికగా ఉంది.

"రండి... రండి. ఇప్పటికి మామీద దయ కలిగిందన్నమాట" అంటూ ఆహ్వానించింది అమ్మ.

శారదాంటీ చిరునవ్వు నవ్వి ఊరుకుందే తప్ప సమాధానం చెప్పలేదు. ఆంటీలో నాకు బాగా నచ్చే గుణం అదే. తనమాటే కరెక్ట్ అని ఎదుటివారితో ఎలాగైనా ఒప్పించాలని వాదనకు దిగదు. అవతలివారి మనస్తత్వం అర్థం చేసుకుని ప్రవర్తిస్తుంది.

ఒక్కమాటలో చెప్పాలంటే నొప్పించక, తానొవ్వక రీతిలో ఉంటుంది ఆంటీ ప్రవర్తన.

ఆంటీ వాళ్ళ ఆయన అంటే అంకుల్ బ్యాంకులో ఉద్యోగం చేస్తారట. ఆంటీకూడా ఇదివరకు ఉద్యోగం చేసేవారట. పాప పుట్టాక ఉద్యోగానికి రిజైన్ చేశారట.

మాటల మధ్యలో నా గురించి ప్రస్తావన వచ్చింది. అమ్మ మాత్రం నా గురించి చాలా నిజాయితీగా బాధపడింది.

"మీ అబ్బాయిలాంటివాళ్ళకు చదువు నేర్పించే స్కూల్స్ ఉన్నాయండీ. అక్కడ చేర్పిస్తే ప్రయోజనం ఉంటుందికదా" అంది ఆంటీ.

ఆ మాటలు వింటుంటే నా చెవిలో




# రచయితలకు మనవి

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత (త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, **ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్ట్‌లోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రూ. 3000/- పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్:

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్,
హైదరాబాద్ 500 482.






ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.

2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.

3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.

4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్ హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని పఠనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

సెప్టెంబర్ చతురనవల **పిచ్చోడు**

సమీక్షకుని పేరు: ..............................

చిరునామా: ..............................

..............................

..............................

అమృతం పోసినట్లుగా అన్పించింది. అమ్మ ఏ కళనుందో ఆంటీని వివరాలు అడిగి తెలుసుకుంది.

రాత్రికి నాన్నగారు రాగానే విషయ మంతా చెప్పింది. నాన్న కూడా సరేన న్నారు. ఆంటీ, అమ్మ, నేను ముగ్గురం కలిసి స్కూలుకి వెళ్ళాం. అక్కడ ముందుగా నన్ను పరీక్షించి ఆ తర్వాత స్కూల్లో చేర్చు కున్నారు.

ఇంటినుంచి స్కూలు చాలా దూరం కావ డంతో అమ్మకానీ, నాన్నకానీ దింపేవారు. సాయంత్రంపూట అమ్మ తీసుకువచ్చేది.

మొత్తంమీద స్కూల్లో చేరడంతో నా మనసు ఓ విహంగంలా ఎగరసాగింది.

నాలో ఏదో తెలీని చైతన్యం చోటుచేసు కుంది.

ఇంతకుముందు నేనెందుకూ పనికిరానివా డినని, నేనసలు బతకడమే వ్యర్థమని అను కునేవాడిని.

కానీ ఇప్పుడలాకాదు...

నా జీవితానికి కూడా ఓ అర్థం ఉందని అన్పించసాగింది.

స్కూల్లో చేరాక నాకు ఓ విషయం బాగా అర్థం అయ్యింది.

అందరికన్నా నేను చాలా అదృష్టవంతు డిని.

అక్కడున్న వారిలో చాలామంది సరిగ్గా నడవలేరు, కూర్చోలేరు.

మాటలు రానివారైతే ఎందరో...

కొంతమంది పిల్లలు కనీసం తల్లితండ్రు లను కూడా గుర్తించలేని స్థితిలో ఉన్నారు.

తామేమిటో, ఎక్కడ ఉన్నామో తెలుసుకో లేని వారు ఎందరో.

అయితే ఇంతవరకూ వారిలో ఉన్నదీ నాలో లేనిదీ ఒక్కటే. ఆత్మవిశ్వాసం... అక్కడున్న పిల్లలందరూ ఏదో ఒక విద్యలో తర్ఫీదు పొందుతున్నారు. అందుకే అంటు న్నాను.

ఆ స్కూల్లో ఉన్న ఎంతోమంది పిల్లల్లో నేను చాలా అదృష్టవంతుడ్ని.

నేనేమిటో...

నా తల్లితండ్రులెవరో...

నాలో లోపం ఏమిటో...

అన్నీ నాకు తెలుసు.

ఆ రకంగా నేను అదృష్టవంతుడ్నేకదా.

వారంరోజులపాటు నిర్విఘ్నంగా స్కూలుకి వెళ్ళాను. స్కూలునుంచి రాగానే శారదాంటీ దగ్గరకు వెళ్ళేవాడిని.

ఆంటీ బాగా పెయింటింగ్ చేస్తుంది. ఆవిడ పెయింటింగ్ చేస్తుంటే ఎంతసేపైనా అలాగే చూస్తుండాలన్పిస్తుంది.

ఆంటీ ఉద్యోగం చేయడంలేదని చెప్పాను కదా. అలా అని టైమంతా ఇంటి పనికే కేటాయిస్తారనుకుంటే పొరపాటే. టైమ్‌ప్ర కారం ఇంటి పని చేసుకుంటారు. ఆ తర్వాత కుట్లు, అల్లికలు, పెయింటింగ్, పిల్ల లకు ఆటపాటలు నేర్పించడం ఇలా ఏదో ఒకటి చేస్తుంటారు. ఎవ్వర్నీ నొప్పించే విధంగా మాట్లాడరు. వ్యర్థప్రసంగాలు చేయరు. ఆంటీని కూడా తమ గ్యాంగ్‌లో కలుపుకోవాలని అమ్మావాళ్ళు ఎంతగానో ప్రయత్నించారు. కానీ ఆంటీకి, వారికీ పొస గదని అర్థం అయ్యాక ఆవిడ్ని పట్టించుకో వడం మానేశారు.

నాకు మాత్రం ఆంటీ అంటే చాలా ఇష్టం. ఆవిడే చొరవ తీసుకుని నన్ను స్కూల్లో చేర్పించకపోతే నేనెలా ఉండేవా డినో.

వారంరోజుల తర్వాత మొదలైంది ముసలం.

నేను రోజూలానే స్కూలుకి రెడీ అయ్యాను. నాన్నగారు రెడీ అయితే ఇక స్కూలుకి వెళ్ళిపోవడమే...

కానీ ఆరోజు నాన్నగారు తనకు పార్టీ సమావేశాలున్నాయని అమ్మను తీసుకువెళ్ళ మని చెప్పారు.

మా ఇంటినుంచి స్కూలు చాలా దూర మని చెప్పానుకదా. స్కూలుకి తీసుకువె

ళ్ళడం, తీసుకురావడం, రెండుసార్లు తిరగడం చాలా కష్టమని ఆ రోజుకి స్కూలు మానేయమని అంది అమ్మ.

చేసేదేంలేక మౌనంగా స్కూలు బ్యాగు లోపల పెట్టేశాను. ఇంట్లో ఉండబుద్ధికాక శారదాంటీ వాళ్ళింటికి వెళ్లాను.

ఆరోజంతా ఆంటీ వాళ్ళింట్లోనే ఉన్నాను.

మరుసటిరోజు యధాప్రకారం స్కూలుకి బయలుదేరాను. కానీ నాన్న మాత్రం మళ్ళీ ఏదో కారణం చెప్పి తప్పించుకున్నారు. నాన్నతో వాదించి లాభంలేదని తెలుసుకున్న అమ్మ తనే స్కూలుకి తీసుకువెళ్ళింది. నా క్లాసులన్నీ అయ్యేదాకా స్కూలులోనే కూర్చుంది. సాయంత్రం ఇద్దరం కలిసి ఇంటికి వచ్చాం. ఇంటికి రాగానే పాపం బోలెడుపని చేసుకోవాల్సి వచ్చింది. ఈవిధంగా మూడు నాలుగు రోజులపాటు అవస్థపడింది కానీ ఆ తర్వాత ఆవిడవల్ల కాలేదు. ఆ విషయమే నాన్నతో చెప్పింది అమ్మ.

"ఈ పిచ్చివెధవ స్కూలుకి వెళ్ళకపోతే పోయిందేం లేదులే. వాడిప్పుడు చదువుకుని ఎవర్ని ఉద్ధరించాలి? " అని తేలికగా తీసిపారేశారు నాన్న.

అక్కడికీ 'పోనీ ఆటోలో పంపిద్దామని' కూడా అమ్మ అంది. కానీ నాన్న మాత్రం ఆ విషయానికి పెద్దగా ప్రాముఖ్యతనివ్వ లేదు.

ఇక అమ్మ మాత్రం ఏంచేయగలదు? బాధపడి ఊరుకుంది. విషయం తెలుసుకుని శారదాంటీ చాలా ఫీలయ్యింది. వాళ్ళాయనను దింపమని అడుగుతానని కూడా చెప్పింది. కానీ అమ్మావాళ్ళు ఒప్పుకోలేదు.

నాన్నగారి మనస్తత్వం గురించి చెప్పాను కదా! ఇదే తన ఫ్రెండు కొడుకైతే వాళ్ళతో మంచివాడని అనిపించుకోవడం కోసం పనులన్నీ పక్కనపెట్టయినా సరే రోజూ వాళ్ళబ్బాయిని స్కూలుకి తీసుకువెళ్ళి తీసుకువస్తారు. ఒకవేళ ఎవరైనా అదేమిటని అడిగితే అందుకు ఆయన దగ్గర ఓ రెడీమేడ్ సమాధానం సిద్ధంగా ఉంటుంది. నాన్నగారు తన వాక్చాతుర్యంతో ఎలాంటి వ్యక్తినైనా నోరు మూయించగలరు. బహుశా మా చుట్టుపక్కలవాళ్ళు అన్నట్టు నాన్నగారికి చక్కటి వాక్చాతుర్యం ఇచ్చిన ఆ భగవంతుడు మళ్ళీ కొడుకుకు ఎందుకులే అని నన్ను మూగవాడిని చేసుంటాడు.

ఆ విధంగా నా పాఠశాల విద్యాభ్యాసం వారంరోజులలో సమాప్తి అయ్యింది.

శారదాంటీ ఈ విషయాన్ని తల్చుకుని అప్పుడప్పుడు బాధపడ్తూ ఉండేవారు. మిగతావారు మాత్రం ఆ సంగతే మర్చిపోయారు. రోజూ ఏదో ఒక టైమ్‌లో తన దగ్గరకు రమ్మని, పెయింటింగ్ నేర్చుకోమని ఆంటీ చెప్పారు. ఏదో ఒక టైమ్ అని ఆంటీ అన్నారు. కానీ నేను మాత్రం రోజు మొత్తంలో ఎక్కువసేపు అక్కడే ఉండేవాడిని. ఆంటీ దగ్గర నేను చదవడం, రాయడం నేర్చుకున్నాను. ఇక చిత్రకళ గురించి చెప్పేదేముంది? నేను, ఆంటీ బ్రష్‌లు పట్టుకుని కూర్చున్నామంటే మా ఇద్దరికీ అసలు టైమే తెలిసేదికాదు. గంటలు నిమిషాల్లా దొర్లిపోయేవి. నాకైతే ఒకేసారి మొత్తం నేర్చేసుకోవాలన్నంత తపనగా ఉండేది. పరాయి ఆవిడ నామీద అభిమానంతో, నేను అందరిలా లేనన్న జాలితో నాకు అంతో ఇంతో సాయం చేయాలని అనుకుంటుంటే... మా ఇంట్లోవాళ్లు మాత్రం ఆ ప్రయత్నాన్ని ప్రోత్సహించడానికి బదులు నన్ను వెక్కిరిస్తున్నారు. ఎగతాళి చేస్తున్నారు. ముఖ్యంగా నాన్నగారు... నేనెప్పుడు పెయింటింగ్ మొదలుపెట్టినీ "ఎందుకురా పేపర్లన్నీ అలా ఖరాబు చేస్తావు? " అనేవారు.

అమ్మ మాత్రం "పోన్లెద్దురూ... పిచ్చో వెర్రో ఏదో వాడి ఏడుపు వాడు ఏడుస్తున్నాడులెండి..." అనేది.





నేను మాత్రం పెద్దగా స్పందించేవాడిని కాదు.

అంతకుముందులా నేను ఎవ్వరితోను గొడవపడటం లేదు.

మాటకు పది అర్థాలైతే మౌనానికి పది వేల అర్థాలని అంటారు. అందుకే మౌనాన్ని నా భాషగా చేసుకున్నాను. పైగా నేను గమనించింది ఏంటంటే జనం మాట్లాడే మాటలలో అధికశాతం స్వోత్కర్ష. పరనిందే.

ఎదుటివారికి ప్రేమను పంచేమాటలు. ఎదుటి వ్యక్తిని ఉత్తేజపరిచే మాటలు... చాలా చాలా తక్కువ. ఈ మాత్రం భాగ్యానికి నాకు మాటలు రాలేదని, నేను మూగవాడినని, బాధపడాల్సిన అవసరం లేదని అన్పించింది.

పెద్ద కొడుకుని నేను ఇలా తయారయ్యేసరికి ఆశలన్నీ నా తమ్ముడిమీద పెట్టుకున్నారు.

తమ్ముడి పేరు శ్రీనివాసు.

నా తర్వాత ఇద్దరు మగపిల్లలు, ఓ ఆడపిల్ల ఉన్నారు.

శ్రీనివాసు రెండోవాడు.

శ్రీనివాసు తర్వాతివాడు మురళి.

చెల్లెలి పేరు వసుంధర.

శ్రీనివాసు ఇంట్లో చాలా గారాబంగా పెరిగాడు. వాడు ఆడింది ఆట, పాడింది పాటగా ఉండేది. వాడిని బాగా చదివించాలని అమ్మ, నాన్న అనుకునేవారు. నేను కూడా పైకి వ్యక్తం చేయకపోయినా మనసులో అదే అనుకునేవాడిని.

తానొకటి తలిస్తే దైవమొకటి తలుస్తాడని అంటారు. ఆవిధంగానే జరిగింది శ్రీనివాసు విషయంలో.

అల్లరి బాగా చేసేవాడు. పెద్దవాళ్ళనెవ్వరినీ లెక్కచేసేవాడు కాదు. మొండితనం, మూర్ఖత్వం... వీటికితోడు అమ్మ, నాన్నల గారాబం... వీటితో వాడు పూర్తిగా అప్రయోజకుడైపోయాడు.

నాకు పదేళ్ళు నిండాయి.

ఇప్పుడు పదకొండో ఏడు నడుస్తోందన్నమాట.

శారదాంటీ వాళ్ళకి ట్రాన్స్‌ఫర్ అయ్యింది. ఆంటీ ఆ విషయం చెప్పి నన్ను దగ్గరకు తీసుకుని కళ్ళనీళ్ళు పెట్టుకున్నారు. నాక్కూడా దుఃఖం ఆగలేదు. నా చిన్నతనంలో నాకేదైనా స్ఫూర్తినిచ్చినా, నన్ను ప్రోత్సహించినా అది ఆంటీ ఒక్కత్తే...

అప్పట్లో రోజుకు నాలుగైదుసార్లైనా అనుకునేవాడిని, ఎలాగైనా ఆంటీ రుణం తీర్చుకోవాలని.

ఆ అవకాశం వస్తుందని నాకు అప్పట్లో తెలీదు కానీ భగవంతుడు నాకా అవకాశాన్నిచ్చాడు.

ఆంటీవాళ్ళు వెళ్లేరోజున నేనెంతగా ఏడ్చానంటే నన్ను పట్టుకోవడం ఎవ్వరికీ సాధ్యం కాలేదు. రెండుమూడుసార్లు ఆంటీ వాళ్ళ వ్యాన్ ఎక్కేశాను కూడా. చివరకు నాన్నగారు బలవంతంగా రెండు తగిలించి లోపలకు లాక్కెళ్ళి తలుపు వేసేశారు.

ఆంటీ వెడుతూ చెప్పిన మాటలు ఎప్పుడూ నా చెవిలో మారుమోగుతూనే ఉంటాయి. కృషి, పట్టుదల ఈ రెండే మనిషికి ఆయుధాలు కావాలని. ఈ ఆయుధాలతో నేను ఆకాశమంత ఎత్తుకు ఎదగాలని ఆంటీ కోరిక. పెయింటింగ్ ప్రాక్టీసు చేస్తూనే ఉండాలని, ఎక్కడ పోటీలు జరిగినా పాల్గొని విజయం సాధించాలని ఆవిడ కోరిక.

ఆంటీకి ఇచ్చిన మాటలు నేను తప్పలేదు.

వాళ్ళు వెళ్లాక నాకెంతో ఒంటరితనంగా అనిపించేది. ఆ ఒంటరితనంనుంచి పారిపోయి చిత్రకళలో దాక్కునేవాడిని. ఆవిధంగా ఎన్నో గంటలపాటు ప్రాక్టీసు చేస్తూనే ఉండేవాడిని.

శారదాంటీ ఉన్నప్పుడు ఎక్కడ పోటీలు జరిగినా ఆంటీ నన్ను తీస్కెళ్లేది. ఇప్పుడు కూడా అమ్మనో, నాన్ననో బతిమాలుకుని ఎలాగో అలా పోటీలలో పాల్గొంటున్నాను.



విజేతనై తిరిగొస్తున్నాను.

మా ఇంట్లో ఓ షెల్ఫ్ మొత్తం నేను సాధించిన కప్పులతో నిండిపోయింది. మరో పక్క తమ్ముడి చదువు మాత్రం అంతంత మాత్రంగానే సాగుతోంది. ఆంటీవాళ్ళు వెళ్ళి పోయాక నాతో ప్రేమగా మాట్లాడేవారు కరువయ్యారు. ఎప్పుడైనా అమ్మ దగ్గరకు వెళ్ళి కూర్చుని ఏదో చెప్పబోతే "ఏమిట్రా నువ్వు! నీ పిచ్చిగోలాను" అని విసుక్కునేది.

నాన్నగారికి నాతో మాట్లాడే తీరిక ఎప్పుడూ లేదు.

పోనీ శ్రీనివాసు...

వాడికి నేనంటే ఎప్పుడూ చిన్నచూపే.

ఇక మిగిలింది మురళి, వసుంధర.

వాళ్ళిద్దరూ బాగా చిన్నవాళ్ళు నేను చెప్పింది వినగలరే కానీ నా ఆవేదనను అర్థం చేసుకోలేరు.

ఓరోజు ఎందుకో నా కాళ్ళు బయటకు దారితీశాయి. తోడు లేకుండా ఎప్పుడూ ఎక్కడికీ వెళ్ళని నేను మొదటిసారి ఒంట రిగా బయటకు వచ్చాను. బస్‌స్టాప్‌లో నిల బడ్డాను. ఎక్కడికి వెళ్ళాలో నాకు తెలీదు. కాసేపు బయట తిరిగిరావాలని మాత్రం అనుకున్నానంతే...

ఏదో బస్ వస్తే ఎక్కి కూర్చున్నాను. అది కూడా విండో సీటు. కిటికీలోంచి తలపెట్టి బయటకు చూస్తుంటే నాకెందుకో ఏనుగు ఎక్కినంత సంబరంగా అనిపించింది. ఆ మనుష్యులు, రోడ్డుమీద వెడుతున్న బస్సులు, కార్లు... అంతా ఓ మధురసంగీ తంగా, వీనులవిందుగా తోచింది. ఆ రణ గొణ ధ్వనులను మధుర సంగీతంతో పోల్చి నందుకు క్షమించాలి.

కానీ ఒంటరితనంతో బాధపడ్తున్న నాకు ఆ జనసందోహం, రణగొణ ధ్వనులు ఇవన్నీ మధురంగా అనిపించడంలో ఆశ్చర్యం ఏముంది?

"బాబూ! ఎక్కడికి వెళ్ళాలి?" అంటూ వచ్చాడు కండక్టరు.

అవును నేను ఎక్కడికి వెళ్ళాలి? ఏం చెప్పాలో తెలీక ఆలోచనలో పడ్డాను.

"త్వరగా చెప్పవయ్యా! ఎక్కడికి వెళ్ళాలి?" విసుక్కున్నాడతను.

ఈసారి సమాధానం చెబుదామనే అనుకు న్నాను కానీ చెప్పలేని నా అశక్తత మీకు తెలుసుకదా!

"ఏరా! నీ దగ్గరసలు డబ్బులున్నాయా?" బాబు, అయ్యాలోంచి కండక్టరు ఏరాలోకి దిగాడు.

గబుక్కున జేబులోంచి డబ్బులు తీశాను. లేదంటే బస్సులోంచి దింపేస్తాడేమోనని భయం వేసింది.

నా చేతిలోంచి విసురుగా డబ్బులు లాక్కున్నాడు. "ఎక్కడికెళ్ళాలి?" అన్నాడు.

చేతిమీద పెన్నుతో రాసి చూపించాను.

అంతవరకు కేకలేసిన కండక్టరు ముఖంలో జాలి, దయ కన్పించాయి.

"సారీ బాబు!" అని టిక్కెట్టు, చిల్లర ఇచ్చాడు.

మనుషుల్లో ఇంకా జాలి, దయ, అభి మానం ఉన్నాయన్నమాట. మా ఇంట్లోవా ళ్ళకు నా సంగతి తెలుసు. అయినా కూడా పరిహాసం చేస్తూనే వుంటారు. ఏనాడూ తాము చేసినది తప్పనిగానీ, నా మనసు బాధ పడుతుందని కానీ వాళ్ళు అనుకోరు. కానీ బస్ కండక్టరు నా సంగతి తెలీగానే 'సారీ' చెప్పాడు. అలా అని మా వాళ్ళు చెడ్డ వారని, కండక్టరు మంచివాడని చెప్పటం నా ఉద్దేశం కాదు. మాలాంటి వారిమీద జాలి చూపించొద్దు, మమ్మల్ని ఎగతాళి చెయ్యొద్దు. మమ్మల్ని ఇలా వదిలేస్తే చాలు. ఒక్కో స్టాప్‌లో బస్ ఆగుతుంటే ఎక్కేవాళ్ళు ఎక్కు తున్నారు. దిగేవాళ్ళు దిగుతున్నారు. నేను మాత్రం బస్‌లో సీటుకు అతుక్కుపోయి కూర్చున్నాను.

బస్ లాస్ట్ స్టాపులో ఆగగానే దిగేశాను.

సరాసరి రైల్వే స్టేషన్‌లోకి నడిచాను.

ప్లాట్‌ఫాం టిక్కెట్టు కొనుక్కోవాలని




ముందుగా నాకు తెలీదు. కానీ లోపలికి వెళ్ళనివ్వకుండా అడ్డుపెట్టేసరికి ప్లాట్‌ఫాం టిక్కెట్టు కొనుక్కోవాలని తెలిసివచ్చింది. ప్లాట్‌ఫాం టిక్కెట్టు కొనుక్కుని లోపలకు వెళ్ళాను.

స్టేషన్ లోపలికి వెళ్ళి ఓ బెంచిమీద కూర్చున్నాను.

రైళ్లు వెళ్ళటం, రావడం, జనం హడావిడి అన్నీ నాకు నచ్చాయి. నేను ఒంటరివాడిని కాదని, నా చుట్టూ విశాలప్రపంచం వుందని అన్పించింది. ఆ విధంగా సాయంత్రందాకా గడిపాను.

సాయంత్రం ఇంటికి వెళ్ళేసరికి అమ్మ, నాన్న తమ్ముళ్ళు, చెల్లాయి, మావయ్యలు, బాబాయిలు అందరూ గుమ్మంలోనే కనిపించారు.

నన్ను అంత దూరాన చూడగానే అమ్మ గబగబా పరిగెత్తుకొచ్చింది. నన్ను దగ్గరకు తీసుకుని "హమ్మయ్య! నా బిడ్డ క్షేమంగా ఇంటికి తిరిగివచ్చాడు. నాకంతే చాలు. ఆ భగవంతుడు నా మొరను ఆలకించాడు. వెంకటేశ్వరస్వామీ నా బిడ్డను తీసుకుని తప్పకుండా నీ దగ్గరకు వస్తాను" అంటూ నా ముఖం అంతా ముద్దులాడింది.

నాన్నగారు విసురుగా నా రెక్క పుచ్చుకుని ఇవతలకు లాగారు. "ఏరా వెధవా! ఇప్పటిదాకా ఎక్కడెక్కడ తిరిగొచ్చావురా? నిన్నెక్కడని వెతికేది? ముప్పొద్దులా తిని ఓ మూల పడుండక బలాదూర్ తిరుగుళ్ళేమిటి? " అంటూ లాగిపెట్టి చెంపమీద కొట్టారు.

"ఏంటండీ ఇది... ఏదో చిన్నపిల్లాడు, తెలియక తప్పు చేస్తే అలా గొడ్డును బాదినట్టు బాదుతారేం" అని అమ్మ అడ్డుపడింది.

"నువ్వు మాట్లాడకు. అసలు ఇదంతా నీ వల్లనే వచ్చింది. పెద్ద కొడుకంటూ వాడ్ని నెత్తినెక్కించుకున్నావ్. ఇప్పుడు చూడు వాడేం చేశాడో? పొద్దున్నుంచి వాడికోసం ఎన్నిచోట్ల వెతికామో, ఎంత ఖంగారుపడ్డామో నీకు తెలీదా? ఉదయంనుంచి పచ్చి మంచినీళ్ళు అయినా తాగకుండా వాడికోసం ఊరంతా తిరిగాం. బంధువులందరి ఇళ్ళకు వెళ్ళి వాకబు చేశాం. పిచ్చివెధవ... ఓ మూలన పడుండక" అంటూ ఏమేమో అన్నారు.

"ఊరుకోండి... అసలు వాడెక్కడికి వెళ్ళాడో, ఎందుకు వెళ్ళాడో కనుక్కోకుండా వాడినలా కేకలేస్తావేంటన్నయ్యా" అన్నాడు మా చివరి బాబాయ్.

"అవునన్నయ్యా! ముందు వాడ్ని లోపలకు రానీండి. పొద్దున్నుంచీ ఏమైనా తిన్నాడో లేదో... వాడికేదైనా పెట్టండి" అన్నాడు మరో బాబాయ్.

"అవునక్కా! వీడిని లోపలకు తీసుకువెళ్ళి ఏదైనా పెట్టు. తర్వాత వాడెక్కడికి వెళ్ళిందీ నిదానంగా అడగొచ్చు" అంది మా పిన్ని. దాంతో నాకు తిట్లు, దెబ్బలు కొంతవరకు తప్పాయి.

నేను లోపలికి వెళ్తుంటే "చూడు ఎలా చూస్తున్నాడో... మనం ఇంత టెన్షన్ పడుతుంటే వాడిలో ఏమైనా చలనం ఉందేమో చూడు" అంటూ పళ్ళు కొరికాడు నాన్న.

"నిజమే అన్నయ్యా! అయినా వాడినని లాభంలేదులే. ఇదివరకు మొద్దు వెధవలా ఉండేవాడు. ఆ శారద పుణ్యమా అని ఇలా తయారయ్యాడు. ఏవో నాలుగు బొమ్మలు వేసి ఓ నాలుగు కప్పులు, షీల్డులు సంపాదించేసరికి ఇక తనంతటి వాళ్ళు లేరనుకుంటున్నాడు" నాన్నకు వంత పాడాడు చంద్రశేఖరం బాబాయ్.

ఆయనో ఓ విచిత్రమైన వ్యక్తి.

ఆయన తన జీవితంలో ఎవరి గురించైనా పాజిటివ్‌గా మాట్లాడగా నేను వినలేదు. ఎప్పుడూ అబద్ధాలు, ఇతరుల్ని మోసం చేయడం, ఇతరుల్ని కించపరిచేలా మాట్లాడటం తప్ప ఆ మనిషిలో మంచి తనమన్నది ఏ కోశానా కనిపించదు.

"నిజమేరా నువ్వన్నది. ఆవిడగారు వాడిని నెత్తినెక్కించుకుంది. నాలుగు అక్షరం ముక్కలు నేర్చుకుని వాడిలా తయారయ్యాడు. లాభంలేదు. వెధవకి నాలుగు తగిలించాల్సిందే..." అంటున్నారు నాన్న.

నాకు ఆ మాటకు నవ్వొచ్చింది.

ఆ వయసులో అంటే నా పదేళ్ళ వయసులో చాలా కోపం వచ్చిందనుకోండి...

కానీ ఇప్పుడు మాత్రం నవ్వొస్తోంది.

కన్నకొడుకు బాగుపడతాడు. స్కూలుకి తీసుకు వెళ్ళండని చెబితే కుదరదని చెప్పిన మనిషి ఆ పని మరొకరు చేసినందుకు ఆనందించాల్సిందిపోయి ఆంటీని విమర్శిస్తున్నాడు. ఆంటీవలన నేనెంత ప్రయోజకుడనయ్యానన్నది ఆలోచించడం మానేసి నా ఇప్పటి ప్రవర్తనకు ఆంటీయే కారణం అంటున్నాడు. దానికి కారణం ఒక్కటే... సందర్భం వచ్చినప్పుడల్లా ఆంటీ నన్ను మెచ్చుకునేది. నా గురించి గొప్పగా చెప్పేది.

నేను చాలా తెలివికలవాడినని ఇంట్లో వాళ్ళు ముఖ్యంగా అమ్మా, నాన్న నిర్లక్ష్యం చేస్తున్నారని తరచూ వాళ్ళతో అనేది. అది వీళ్లిద్దరికీ నచ్చేది కాదు. అందుకే ఆంటీ అంటే అమ్మకు, నాన్నకు కూడా కోపమే.

నన్ను వెళ్ళి కాళ్లు, చేతులు కడుక్కుని రమ్మని అమ్మ చెప్పింది.

అన్నం పెట్టింది.

నేను తింటుండగా అసలు విషయం చెప్పుకొచ్చింది. నేను ఇంటినుంచి బయటకు వెళ్ళిన అరగంటకు ఏదో పనుండి నాన్న ఇంటికి వచ్చారట. అప్పటికే నేనెక్కడా కనబడకపోయేసరికి అమ్మ ఖంగారుపడుతోందట. చుట్టుపక్కల వాళ్లందరి ఇళ్ళకు వెళ్ళి విచారించారట. నేనెక్కడా లేకపోయేసరికి ఊళ్లో ఉన్న బాబాయిల ఇళ్ళకు వెళ్ళారట నాన్న. అందరూ కలిసి నేనెక్కడకు వెళ్ళడానికి వీలుందో ఆ ప్రదేశాలన్నీ తిరిగొచ్చారట. ఇక లాభంలేక పోలీసు రిపోర్టు ఇచ్చి అప్పుడే ఇంటికి వచ్చారట. ఈలోగా నేను వచ్చాను.

నేను కన్పించకపోయేసరికి అందరూ ఎంతగా ఖంగారుపడ్డారో అమ్మ చెప్తుంటే నాకెందుకో చాలా ఆనందంగా అన్పించింది. నన్ను ఎవ్వరూ పట్టించుకునేవారుకాదు! నేను తిన్నానో లేదో ఎవ్వరికీ పట్టేది కాదు. నేనూ మనిషినే అన్న స్పృహే ఉండేది కాదు.

అలాంటిది ఈరోజు.

అందరూ నాకోసం ఆరాటపడ్డారు.

నేనేమయ్యానో అని ఆందోళన చెందారు.

నేను కన్పించాలని, నాకే ప్రమాదం జరగకూడదని దేవుడ్ని ప్రార్థించారు.

ఇలా అందరూ నాకోసం తాపత్రయపడటం నాకెంతో నచ్చింది.

ఆ తర్వాత కూడా రెండుమూడుసార్లు ఇంట్లోంచి వెళ్ళిపోయాను. అలా వెళ్ళిపోయి తిరిగివస్తే ఓ రెండుమూడురోజులపాటు ఇంట్లో నన్నెంతో ప్రేమగా చూసుకునేవారు.

ఆ ప్రేమ, ఆప్యాయత, ఆదరణలకోసం నేను ఇంట్లోంచి పారిపోయేవాడిని.

ఇదంతా పడలేక ఒకరోజు నాన్నగారు నన్ను డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళారు. డాక్టరు పేరు మార్కండేయులు.

చాలా మంచిమనిషి. నిదానస్తుడు.

అమ్మ, నాన్న నా గురించి చెప్పిందంతా సావకాశంగా విన్నారు.

"మీరనుకుంటున్నట్టుగా మీ అబ్బాయికి పిచ్చి లేదండీ..." అన్నారు నాన్నతో. ఆ మాటకు నాకు మాత్రం ఏనుగు అంబారీ ఎక్కి ఊరేగినంత సంబరంగా అన్పించింది.

"మరి పిచ్చి కాకపోతే ఇదంతా ఏమిటంటారు? ఇంట్లో వాళ్ళనందరిని కొట్టడం, కొరకడం, బట్టలు చింపేసుకోవడం, ఇంట్లోంచి పారిపోవడం ఇవన్నీ ఏమిటంట...? " అడిగాడు నాన్న.

మార్కండేయులు చిన్నగా నవ్వారు. నావైపు ప్రేమగా చూశారు. నెమ్మదిగా అడిగారు. "ఏం బాబూ? నాన్నగారు చెప్పే




దంతా నిజమేనా? "

★ ★ ★

ఎందుకో తెలీదు నాకు నిజంగానే చాలా కోపం వచ్చింది.

బలంగా పిడికిలి బిగించి గ్లాసు టేబుల్ మీద కొట్టాను. టేబుల్ గట్టిది కాబట్టి పగల లేదనుకోండి.

"సోమయాజులుగారూ! మీరు ఊరుకోండి... నేను కనుక్కుంటానుకదా!" నమ్రతగా అన్నారు మార్కండేయులు.

"నిజమేలెండి... పిచ్చోళ్లకి వైద్యం చేసి చేసి మీకు ఆ భాష బాగా వంటపట్టినట్టుంది" అని నవ్వారు నాన్న.

ఆ మాటకు కూడా డాక్టరుకి కోపం రాలేదు. నావైపు తిరిగి "చెప్పమ్మా! మీ నాన్నగారు చెప్పిందంతా..."

నిజమేనన్నట్టు తలాడించాను.

"గుడ్... అయితే అలా ఎందుకు చేస్తున్నావ్?' ' అన్నారీసారి.

ఓ కాగితం, కలం కావాలని సైగ చేశాను.

అక్కడున్న ప్యాడ్, పెన్ను ఇచ్చారు డాక్టరు.

"నేను పిచ్చివాణ్ణి కాదు" అని రాసి డాక్టరుకి చూపించాను.

ఆయన చిన్నగా నవ్వుతూ నా భుజం తట్టారు. "ఆ విషయం నాకు తెలుసు" అన్నారు.

సమాధానంగా నేను కూడా నవ్వాను.

"మరి పిచ్చివాడిలా ఎందుకు ప్రవర్తిస్తున్నావు? " అడిగారీసారి.

నేనేమీ సమాధానం చెప్పలేదు.

"చెప్పమ్మా!"



మళ్ళీ మౌనమే నా సమాధానం అయ్యింది.

"నేను డాక్టర్ని కాదు. నీ ఫ్రెండ్‌ని అనుకో. నీ మనసులో ఫీలింగ్స్ అన్నీ నాతో షేర్ చేసుకో" అన్నారాయన.

నాన్న నా వంక ఉరిమి చూశారు. "నేను చెప్పనా... వీడంత మొండివాడు ఎవ్వరూ లేరని... మీరు ఇన్నిసార్లు అడిగినా సమాధానం ఇవ్వకుండా ఎలా చూస్తున్నాడో చూడండి"

నా ముఖం ఎర్రబడింది.

"సోమయాజులుగారూ! మీకు అభ్యంతరం లేకపోతే మీరు కొంచెంసేపు బయటకు వెళ్ళి కూర్చుంటారా? " అన్నారాయన.

నాన్నగారు ఏమనుకున్నారో ఏమో లేచి బయటకు వెళ్ళారు.

"ఇప్పుడు చెప్పు ఏమిటి నీ బాధ?' ' ఎంతో సౌమ్యంగా అడిగారు మార్కేండేయులుగారు.

నా ఒంటరితనం, నేను అనుభవిస్తున్న ప్రేమ రాహిత్యం అన్నీ వివరంగా చెప్పాను. అదే రాశాను.

మీరంతా మాట్లాడగలరు.

మీ ఆవేశం, కోపం, ఇవన్నీ మీరు మాటల్లో వ్యక్తం చేయగలరు. కానీ నాకు ఆ అవకాశం లేదు. అందుకే నన్ను నేను శిక్షించుకుంటున్నాను. పిచ్చివాడిలా ప్రవర్తిస్తున్నాను" అని రాశాను.

డాక్టరుగారు నా బాధను చాలా సానుభూతితో అర్థం చేసుకున్నారు.

"సరే! కానీ ఇంట్లోంచి ఎందుకు వెళ్ళిపో

తున్నావు? "

డాక్టరు ప్రశ్నకు నేను వెంటనే బదులివ్వ లేకపోయాను.

మరోసారి, మరోసారి అదే ప్రశ్న అడిగారు డాక్టరు.

"నేను ఇంట్లోంచి వెళ్ళిపోతే అందరూ నా గురించి ఆందోళన చెందుతారు. ఆదుర్దాగా నేను ఎక్కడున్నానా అని వెతుకుతారు. ఆరోజంతా అందరి దృష్టి నామీదే ఉంటుంది. ఉత్తప్పుడు నా గురించి పట్టించుకోనివారు నేను కన్పించకుండాపోతే నాకోసం వెతకడం నాకు చాలా ఆనందాన్నిస్తోంది. అంతేకాదు ఇంట్లో ఉంటే నేను ఒంటరివాడినని, నాకెవ్వరూ లేరని, చనిపోవాలని అన్పిస్తుంటుంది. అదే ఏ బస్టాండ్కో, రైల్వేస్టేషన్కో వెళ్ళి కూర్చుంటే నేను ఒంటరివాడిని కాదని, నా చుట్టూ ఎంతో మంది ఉన్నారని అనిపిస్తుంది. బతకాలనే కోరిక కలుగుతుంది" అని రాశాను.

డాక్టరుగారికి నేనేమిటో అర్థమయ్యాను.

నన్ను వెళ్లి బయట కూర్చోమని చెప్పి నాన్నను లోపలికి పంపించమన్నారు.

నాన్నగారితో ఏదో చాలాసేపు మాట్లాడారు.

మేమిద్దరం ఇంటికి వచ్చాం.

ఇంటికి వచ్చాక నాన్నగారు అమ్మ దగ్గర ఫైరయ్యారు. "ఈ వెధవ డాక్టరుకేం చెప్పాడోగానీ ఆయన నన్ను ముఖం వాచేలా చివాట్లేశారు. మనం వాడిని సరిగ్గా చూడటంలేదట, వాడి మనసెరిగి ప్రవర్తించడం లేదట. వాడి మనసుని బాధపెడ్తున్నామట. వాడు ఒంటరితనంతో బాధ పడిపోతున్నాడట. ఎంతసేపూ వాడి బాధ గురించేకానీ వాడివల్ల మనం ఎన్ని బాధలు పడ్తున్నామో ఎవ్వరికీ అక్కర్లేదు"

"ఊరుకోండి... అయినా పిచ్చి డాక్టరు అంతకన్నా ఏం చెప్తాడు? ఆయన దగ్గరకు తీసుకువెళ్ళద్దని నేను మీకు ముందే చెప్పాను. మీరే విన్పించుకోలేదు" అని అమ్మ వంతపాడింది.

నామీద నాకు జాలేసింది. దాంతోపాటు డాక్టరుగారిమీద కూడా...

అమ్మ, నాన్నలను మార్చాలనుకున్న ఆయన మీద జాలేయడంలో ఆశ్చర్యం ఏముంది?

కొన్నిరోజులపాటు నేను మామూలుగానే ఉన్నాను.

ఏవో పెయింటింగ్ పోటీలు జరిగితే వాటిల్లో పాల్గొని ప్రైజులు గెలుచుకున్నాను. ఈ సంగతి ఇంట్లోవాళ్ళెవ్వరికీ చెప్పలేదు.

నా ఫొటోతోసహా పేపర్లో వచ్చినప్పుడే వాళ్ళకీ సంగతి తెలిసింది.

అప్పుడు కూడా నాతో ఏమీ అనలేదు.

అమ్మ, నాన్న ఆ పేపరు పట్టుకుని కన్పించిన ప్రతివారికి ఎంతో గొప్పగా చెప్పుకున్నారు.

నాన్నగారైతే మరీను. ఇంటికి వచ్చిన వారందరికి నేను సాధించిన షీల్డులు, కప్పులు చూపించడమే కాదు, నాకు పెయింటింగ్ పట్ల ఆసక్తి ఉందని గమనించిందీ, పెయింటింగ్ నేర్పించింది తనేనని గొప్పలు చెప్పేవారు. నాకే కనుక భగవంతుడు మాట ఇచ్చివుంటే ఆయన చెప్పేదంతా అబద్ధం అని అరిచేవాడిని. ఆయన అదృష్టం... ఆ క్షణంలో నాకు మాట రాకపోవడం. నా ఆసక్తి ఏమిటో తెలుసుకోవడానికి ప్రయత్నించని ఆయన... నేను బొమ్మలు గీస్తుంటే ఎందుకురా ఆ పిచ్చిగీతలని వేళాకోళం చేసిన ఆయన ఈరోజు నేను కాస్తోగొప్పో సక్సెస్ అయ్యేసరికి ఎవరికివారు ఆ సక్సెస్కి తామే స్ఫూర్తి అని చెప్పుకొంటున్నారు.

నేను అవునని అనలేదు.

కాదని అనలేదు... అనలేను కూడా.

ఈమధ్య ఇంట్లో నేను ఎలాంటి గొడవా చేయడంలేదు.

అయినా కూడా

ఓరోజు మా చంద్రశేఖర్ బాబాయి





ఇంటికి వచ్చాడు. మాటల మధ్యలో నా ప్రస్తావన వచ్చింది. డాక్టర్ మార్కండే యులు దగ్గరికి వెళ్లిన సంగతి కూడా నాన్న బాబాయితో చెప్పాడు.

"ఎంత పొరపాటు చేశావన్నయ్యా" అన్నాడు బాబాయి నొచ్చుకుంటున్నట్టుగా.

నాన్న కొంచెం ఖంగారుపడ్డారు "ఏరా? ఏమైంది? "

"ఆ మార్కండేయులు మంచి డాక్టర్ కాద న్నయ్యా! ఆయనకసలు వైద్యం చేయడం వస్తేకదా! ఒకరిద్దరు పేషంట్లకు ఆయన ఇచ్చిన మందులు పనిచేయకపోవడంతో అప్పట్లో చాలా గొడవైంది. ఆయన లైసెన్స్ కాన్సిల్ అయినంతపనైంది. అప్పటినుంచి ఈయనగారు మందులతో కాకుండా మాట లతో వైద్యం చేస్తున్నాడు. పిచ్చోళ్ళని తీసుకు వెళ్లినా సరే ఇదిగో మన వాడి విష యంలో ఎలా ప్రవర్తించాడో అలాగే ప్రవర్తి స్తాడు. సదరు వ్యక్తికి పిచ్చున్నాసరే... అబ్బే అసలు పిచ్చేలేదండీ! కేవలం డిప్రెషన్ అంతే. మీరు వారితో మనసు విప్పి మాట్లా డండి. ప్రేమ చూపండి. వాళ్లే దారిలోకి వస్తారు అని చెప్తాడు తప్ప మందులివ్వడు. అయినా అన్నయ్యా! నాకు తెలీక అడుగు తాను మన కృష్ణ వాలకం చూస్తే నీకేమీ అనుమానం రావడంలేదా? "

"ఏమిట్రా నువ్వనేది? " అనుమానంగా అడిగారు నాన్న.

బాబాయి ఒకసారి నావైపు చూసి గొంతు తగ్గించి చెప్పాడు. ఆయన ఎంత గొంతు తగ్గించినా ఆ మాటలు నా చెవిన పడ్డాయ నుకోండి.

"అవునన్నయ్యా! వాడి వాలకం చూడు ఆ డ్రస్సేంటి? డ్రస్సునిండా ఆ పెయింటే మిటి? వాడి తల చూడు, వాడు జుట్టు దువ్వుకుని ఎన్నాళ్లయింది? ఇదివరకు మేం ఎవరైనా రాగానే ఆప్యాయంగా నవ్వేవాడు, పలకరించేవాడు. ఇప్పుడు ఎలా పిచ్చిచూ పులు చూస్తున్నాడో చూడు. ఎవ్వరితోనూ కలవడు. ఎప్పుడు చూసినా ఒక్కడే శూన్యం లోకి చూస్తూ కూర్చుంటాడు. జుట్టు పీక్కో వడం, బట్టలు చింపుకోవడం, చేతిలో ఏ వస్తువుంటే దాన్ని పెట్టి అందరినీ కొట్టడం ఇవన్నీ ఎవరు చేస్తారన్నయ్యా! ఆలోచించు" అన్నాడు బాబాయి. నాకు నవ్వొచ్చింది.

బాబాయి గురించి మీకు ఇంతకుముందు చెప్పానుగా. ఆయన తన జీవితంలో పొర పాటున కూడా మరొక వ్యక్తి గురించి పాజి టివ్‌గాగానీ మంచిగాగానీ మాట్లాడి ఉండడు. ఇకముందు కూడా మాట్లాడడు. ఎదుటి వారికన్నా తనకు ఎక్కువ తెలుసు నని, ఎదుటవారికన్నా తను తెలివి కలవాడి నని అన్పించుకోవాలని ఎప్పుడూ తపన పడుతూ ఉంటాడు. బాబాయి అన్నట్టు ఇది వరకులా నేను లేను.

ప్రస్తుతం నాకు పదిహేనేళ్లు వచ్చాయి. లోకం గురించి, మనుషుల స్వార్థం గురించి తెలుసుకున్నాను. కృత్రిమంగా నవ్వడం, లేని ప్రేమ నటించడం నాకు చేత కాదు. అందుకే ఇదివరకు ఇంటికి ఎవరైనా రాగానే ముందుగా నేనే పరిగెత్తేవాడిని. వాళ్లకు మర్యాద చేసేవాడిని. మంచినీళ్లు ఇచ్చేవాడిని. కానీ ఇప్పుడు అవేంలేవు.

ఎవరు ఇంటికి వచ్చినా నేను పట్టించుకో వడం లేదు.

ఇక మా బాబాయి అన్నట్టు నేను నా డ్రస్సు గురించి పెద్దగా పట్టించుకోను. నాకూ అందరిలా మంచి మంచి దుస్తులు ధరించాలనే ఉంటుంది. కానీ నాకోసం ప్రత్యేకంగా డ్రస్సులు కుట్టించరు. చిన్న ప్పుడు అది కూడా నేను మూగవాడినని తెలియనప్పుడు నా మీద ప్రేమతో కొత్తకొత్త డ్రస్సులు కుట్టించేవారు. ఆ తర్వాతనుంచి అదేంలేదు. తమ్ముడి బట్టలు ధరించడమే నాకు అలవాటు. ఇప్పుడు నేను తమ్ముడి కన్నా పొడవు కాబట్టి వాడి బట్టలు సరిపో వడంలేదు. అలా అని నాకెవ్వరూ కొత్త బట్టలు కుట్టించలేదు. బాబాయిలు, మామ

య్యాలు వాడి పడేసిన ప్యాంట్లు ఇమ్మని అమ్మ అడిగేది. వాళ్లు తెచ్చిచ్చేవారు. నేను వేసుకుంటున్న బట్టలన్నీ వాళ్లూ వీళ్లూ ఇచ్చినవే.

పెయింట్ చేస్తూ ఉంటాను కాబట్టి బట్టల మీద పెయింట్ పడుతుంటుంది. నా బట్టలు నేనే ఉతుక్కుంటాను కనుక మరకలు పోయుండవు.

ఎవరిమీదనైనా కోపం వస్తే మాట్లాడటం రాదు కాబట్టి మాటలలో వ్యక్తం చేయలేను కాబట్టి ఆ కోపం అంతా నా మీద నేను ప్రదర్శించుకుంటాను. నన్ను నేనే హింసించుకుంటాను.

ఇవన్నీ వాళ్లకూ తెలుసు. కానీ చెప్పానుగా ఇతరులకన్నా తను తెలివి కలవాడినని అన్పించుకోవాలని మా బాబాయి తపన. అందుకోసం పిచ్చిలేని నన్ను పిచ్చివాడ్ని చేయడానికి కూడా ఆయన వెనకాడటంలేదు. "నువ్వన్నది నిజమేరా చంద్రం" బాబాయి మాటలకు నాన్న వంత పాడారు.

"ఏదో మా పనులలో మేముండి అంత వివరంగా గమనించలేదుకానీ నువ్వు చెప్పిందాంట్లో వాస్తవం ఉందిరా" అన్నారు నాన్న.

అప్పటిదాకా ప్రేక్షకురాలిలా వింటున్న అమ్మ కల్పించుకుంది. ఇప్పుడేం చేద్దామంటావ్ అని అడిగింది.

బాబాయ్ కొంచెంసేపు ఆలోచించాడు. ఆ తర్వాత హఠాత్తుగా ఏదో స్ఫురించిన వాడిలా అన్నాడు. "నాకు తెల్సిన డాక్టరు ఒకడున్నాడన్నయ్యా! ఆయనకు చూపిద్దాం"

నాన్న, అమ్మ వెంటనే అంగీకరించారు.

అమ్మ నన్ను తయారవమని చెప్పింది. నిజానికి మళ్లీ డాక్టరు దగ్గరకు వెళ్లడం నాకు ఇష్టంలేకపోయినా విధిలేక వాళ్లతో బయలుదేరాను. డాక్టరు మార్కండేయులుతో పోలిస్తే ఈ డాక్టరుకి ప్రాక్టీసు బావున్నట్టుంది. ఆయన పేరు డాక్టర్ వర్మ.

ముందుగా అపాయింట్‌మెంట్ తీసుకోవడం వలన ఎక్కువసేపు వేచి చూడాల్సిన అవసరం లేకుండానే డాక్టరుగారు పిలిచారు. డాక్టర్ వర్మను చూడగానే నాకెందుకో సదభిప్రాయం కలగలేదు. ఆయన్ని చూస్తే అమ్మ, నాన్నలకు మంచి ఒపీనియన్ కలిగినట్లుంది. అందుకే నా గురించి ఉన్నవీ లేనివీ కల్పించి చెప్పారు. డాక్టరు కూడా వాళ్లు చెప్పినవి విన్నాడు తప్ప నన్నేమీ. అడగలేదు. బరబరా మందుల చీటి రాసిచ్చేశాడు.

ఆ మందులు ఎలా వాడాలో ఏమిటో వివరంగా చెప్పాడు. అప్పటినుంచి నాకు నరకం ఆరంభమయింది.

మధ్యాహ్నం, రాత్రి భోజనం పూర్తికాగానే అమ్మ మందులిచ్చేది. అవి వేసుకునేవరకు నా దగ్గరే ఉండేది. మందులు మింగిన కొద్దిసేపటికల్లా నాకు నిద్రవచ్చేది. ఉదయం నిద్రలేచేసరికి మైండ్ అంతా మొద్దుబారిపోయినట్టుగా ఉండేది. నిద్రమత్తుగాను, వికారంగాను అన్పించేది. అందువల్ల ఇల్లు దాటి ఎక్కడికీ వెళ్లేవాడినికాదు. టైంప్రకారం తినడం, నా గదిలో నిద్రపోవడం ఇదే నా దినచర్యగా ఉండేది.

చాలా రోజులవరకు నేను ఎందుకు మందులు మింగుతున్నానో నాకు తెలిసేది కాదు. కానీ రోజురోజుకీ నిస్తేజంగాను, నిస్సత్తువగాను తయారవుతుండేసరికి నాకు అనుమానం వచ్చింది.

ఓరోజు అమ్మ ఇచ్చిన మందులు మింగకుండా దాచాను. రెండు మూడు రోజుల తర్వాత ఆ మందులన్నీ పట్టుకుని డాక్టర్ మార్కండేయులు దగ్గరికి వెళ్లాను.

నేను వెళ్లేసరికి ఆస్పత్రి కిటకిటలాడిపోతోంది. అక్కడున్న రోగులలో చాలామంది డాక్టర్‌వర్మను తిడుతున్నవారే.

నా వంతు వచ్చేవరకు ఓపికగా ఎదురు చూశాను. సుమారు రెండు గంటల తర్వాత నా వంతు వచ్చింది.

నన్ను చూడగానే పలకరింపుగా నవ్వారాయన.




కూర్చోమన్నట్టుగా కుర్చీ చూపించారు.

చేతులు రెండూ జోడించి నమస్కారం చేశాను. ఆయన చూపించిన కుర్చీలో కూర్చున్నాను.

"చెప్పమ్మా! ఎలా వున్నావు? ఆరోగ్యం ఎలా వుంది?" ఆయన ముఖంలోను, మాటలోను అదే ప్రశాంతత.

బావుందండీ అన్నట్టు తలవూపాను.

ఒక్క నిమిషం తర్వాత అడిగారు డాక్టరు. "ఏదైనా చెప్పాలనుకుంటున్నావా?" అని. అవునని తలాడించాను.

ఓ ప్యాడ్, పెన్ను చేతికిచ్చారు.

"ఈ మందులు డాక్టర్ వర్మగారు రాశారు. ఇవి వాడుతుంటే నా ఆరోగ్యం బావుండటం మాట అటుంచి ఇంకా నాశన మైంది. ఎప్పుడూ నిద్రమత్తుగా వుంటోంది. ఏ పనీ చేయాలన్పించడంలేదు. నీరసం, నిస్సత్తువ, అసహనం, చికాకు, డిప్రెషన్ ఒకటేమిటి నా ఆరోగ్యం పూర్తిగా పాడైంది. ఈ మందులు దేనికి వాడతారు? నేను ఇది వేసుకోవడం అవసరమా?" అని రాసి ప్యాడ్ డాక్టరు చేతికిచ్చాను.

నేను రాసింది చదువుతుంటే ఆయన ముఖకవళికలు మారిపోయాయి. మందులు కూడా చూశారు.

"అసలు నువ్వెందుకు ఆ డాక్టరు దగ్గరకు వెళ్లావు?" అని అరిచారు. ఇక్కడినుంచి వెళ్లాక ఏం జరిగిందో అంతా వివరంగా రాశాను. అది చదివాక మార్కండేయులు గారి ముఖంలో కోపం కొంచెం తగ్గింది.

"ఇవి స్లీపింగ్ టాబ్లెట్స్. హైడోసు. ఇవి వేసుకోవడం వల్లనే నీకు నిద్రమత్తుగాను, చికాగ్గాను ఉంటోంది. నువ్వు చెప్పిన లక్షణా లన్నీ వీటివల్లనే. అర్జెంటుగా వీటిని వాడటం మానేయ్" అన్నారు డాక్టరు.

స్లీపింగ్ టాబ్లెట్సా! ఆశ్చర్యపోవడం నావం తయ్యింది. నాలో ఎలాంటి లోపమూ లేదని, నాకు ఎలాంటి అనారోగ్యమూ లేదని ఆ డాక్టర్‌కి తెలుసు. కాకపోతే నాకేదో అనా రోగ్యం ఉందని తాను బాగు చేశానని అన్పించుకోవడం కోసం స్లీపింగ్‌పిల్స్ ఇచ్చా డన్నమాట. నేను అవి వాడటం వలన ఎప్పుడూ మత్తుగా నిద్రపోతున్నాను. నేను ఇంటిపట్టున ఉండటమే అమ్మా వాళ్లకు కావాలి. సో టోటల్‌గా అందరూ హ్యాపీనే.

ఆ తర్వాత డాక్టరుగారు కొన్ని మాత్రలు రాసిచ్చి ఓ వారం రోజులు వాడితే సరిపో తుందన్నారు.

నేను మళ్లీ ఇంట్లోంచి ఎక్కడికో వెళ్లిపో యానని టెన్షన్ పడతారేమోనని గబగబా ఇంటికి దారితీశాను. అప్పటికే అమ్మకి అను మానం వచ్చినట్టుంది. గుమ్మంలోనే నాకోసం ఎదురు చూస్తోంది.

నన్ను చూడగానే రిలీఫ్‌గా ఫీలయ్యింది.

"ఏరా! ఎక్కడికి వెళ్లావ్?" అని అడి గింది.

చేతిలో ఉన్న పెయింట్‌బ్రష్‌లు చూపిం చాను. వస్తూవస్తూ ఓ రెండు పెయింట్‌బ్ర ష్‌లు కొనుక్కున్నాను.

చాలారోజుల తర్వాత ఆరోజు కూర్చుని ఓ పెయింటింగ్ వేశాను. దాదాపు అయిదు గంటలు పట్టింది అది పూర్తికావడానికి. ఏమనుకుందో ఏమో అమ్మ నన్ను డిస్టర్బ్ చేయలేదు. ఎప్పుడూ అయితే సరిగ్గా నేను చిత్ర రచనకు కూర్చోవడం, ఎవరో ఒకరు వచ్చి డిస్టర్బ్ చేయడంతో నా ఏకాగ్రత దెబ్బ తింటోంది.

పూర్తయిన పెయింటింగ్ చూస్తుంటే నాకెంతో ఆనందంగాను, ప్రశాంతంగాను అన్పించసాగింది.

★ ★ ★

రోజులు గడుస్తున్నాయి. తమ్ముడికి పంతొమ్మిదేళ్లు వచ్చాయి.

చదువు అబ్బలేదు సరికదా పోనీ ఏదైనా ఉద్యోగంలో పెట్టినా అవతల వాళ్లతో గొడ వపడి రెండు రోజులలో ఉద్యోగం మానేసే వాడు. నాన్నగారి సంపాదన కూడా కుంటు పడింది.

రాజకీయాలలో యువతరం ప్రాముఖ్యత ఎక్కువ కావడంతో నాన్నగారిలాంటి వారు ఉత్సవ విగ్రహాలయ్యారు.

ఈ సమయంలో పెయింట్స్‌కు, బ్రష్‌లకు వాళ్లని డబ్బులడగడం నాకు ఇబ్బందిగా ఉంది.

కానీ ఏంచేయాలి? నాకు వేరే పనేమీ రాదే. బాగా ఆలోచించాను. అప్పుడు స్ఫురించింది. నేను చిన్న పిల్లలకు పెయింటింగ్ నేర్పితే మా చుట్టుపక్కలవాళ్లు రారు. వాళ్లకి నేనో పిచ్చి వాడినని నమ్మకం కాబట్టి మా ఇంటి దగ్గర లాభంలేదు. వేరే ఎక్కడైనా ప్రయత్నించాలి. కానీ నాకు మాట్లాడటం రాదని తెలిస్తే వాళ్లు ఒప్పుకుంటారో లేదో. సరే ఈ అనుమానాలు, సందేహాలతో మనసు పాడు చేసుకోవడం ఎందుకు? వెళ్లి ప్రయత్నిస్తే సరి అనుకున్నాను.

ఆలోచన బానేవుంది. కానీ మరీ నా వాలకం పిచ్చివాడి వాలకం మాదిరిగా ఉందే? ముందు సెలూన్‌కి వెళ్లి చక్కగా క్రాఫ్ చేయించుకున్నాను. ఇంటికి వచ్చాక తల స్నానం చేశాను.

అద్దంలో నా ముఖం నాకే ముద్దు వచ్చేంత అందంగా ఉందన్పించింది. నన్ను చూసి అమ్మ కూడా ఆశ్చర్యపోయింది. ఆ తర్వాత బాధపడింది. 'తెలివితేటలిచ్చాడు. చక్కటి కళనిచ్చాడు. నా బిడ్డకు మాట కూడా ఇచ్చుంటే ఎంతో బావుండేది' అనుకుంటూ కళ్లు ఒత్తుకుంది. ఎంతైనా తల్లి మనసుకదా!

సరే ఇప్పుడు డ్రస్ ఏంవేసుకోవాలి? చాలాసేపు ఆలోచించాను. ఏమైతే అయింది లెమ్మని తమ్ముడి డ్రస్సు వేసుకున్నాను. షర్ట్ బానేవుంది కానీ ప్యాంటే పొట్టి అయింది. మా బాబాయి ఒకరు ఈమధ్యన నా మీద జాలితో ఓ ప్యాంట్ కుట్టించాడు. అది పొడవు సరిపోయింది కానీ నడుము దగ్గర బాగా వదులుగా వుంది. పొట్టి ప్యాంట్ కన్నా నడుము దగ్గర వదులు ఉన్న ప్యాంట్ ధరించడమే బెస్ట్ అన్పించింది. అది వేసుకుని తమ్ముడు బెల్ట్ పెట్టుకున్నాను.

అద్దంలో చూసుకుంటే డ్రస్ బానే ఉందన్పించింది. సరే చివరగా చెప్పులు కావాలి కదా!

నాన్నగారు ఇంట్లో వాడే హవాయ్ చెప్పులు వేసుకున్నాను. కరెక్ట్‌గా సరిపోయాయి.

నేను రెడీ అవడం చూస్తున్న అమ్మ ఆత్రుత ఆపుకోలేక "ఎక్కడికిరా?" అని అడిగింది.

"పనిమీద బయటకు వెడుతున్నాను" అని రాశాను.

ఉద్యోగం వెతుక్కోవడానికి అని చెప్తే 'నీకెవరు ఉద్యోగం ఇస్తార్రా' అని నవ్వుతారు. అందుకే అసలు విషయం చెప్పకుండా దాచాను. అయినా అమ్మ ఊరుకోలేదు. "పనిమీద అంటే ఎక్కడికి? ఎన్నింటికి తిరిగి వస్తావు?" అని అడిగింది.

"సాయంత్రానికి వస్తాను. నేను వెళ్లిన పని సక్సెస్ అయితే వచ్చాక చెప్తాను" అని గబగబా బయటకు వచ్చాను. అక్కడుంటే ఇంకేం ప్రశ్నలు వేస్తుందో అనే భయంతో వేగంగా బయటకు వచ్చాను.

మా వీధి దాటాక ఓ స్కూలు ఉంది. స్కూల్లోకి వెళ్లి ప్రిన్సిపల్‌ని కలిసాను.

నా పరిస్థితి వివరించి చెప్పాను. "మాట వచ్చిన వాళ్లకే ఉద్యోగాలు లేవు. మాటరాని నీకు ఎవరయ్యా ఉద్యోగం ఇచ్చేది? వెళ్లు వెళ్లు" అని స్కూల్లోంచి తరిమినంత పనిచేశారు.

మొదట ప్రయత్నమే ఇలా అవడం నాకు కొంచెం బాధగా అన్పించింది. అయినా కూడా నాకు నేను ధైర్యం చెప్పుకున్నాను. మరో నాలుగైదు స్కూళ్లకు వెళ్లాను.

ఒక్కోచోట ఒక్కో అనుభవం. ఒక స్కూలు వాళ్లు సాయంత్రం నాలుగు నుంచి అయిదు గంటలవరకు అంటే ఒక గంట




సేపు నేర్పితే అయిదు వందలు ఇస్తామన్నారు. చాలా తక్కువ. కానీ అవసరం నాదికదా! నేను వెళ్లి అడిగేసరికి వాళ్లు చెట్టెక్కి కూర్చున్నారన్నమాట.

సరేనని ఒప్పుకున్నాను. మరోస్కూలుకి వెడితే స్కూలు ప్రిన్సిపల్ స్కూల్లో కాకుండా తన ఇంటికి వచ్చి మనవరాలికి చెప్పగలవా? అని అడిగారు.

చెప్తానన్నాను.

"ఎంతకావాలి? " అని అడిగితే

ఈసారి మాత్రం కచ్చితంగా చెప్పాను. "ఓ వెయ్యి రూపాయిలు ఇప్పించండి" అని.

ఆయన వెంటనే ఒప్పేసుకున్నారు.

అంతకుముందు వాళ్లు ఇంకా ఎక్కువ అడిగి ఉంటారు. మొత్తంమీద ఆనాటి నా ప్రయత్నాలు ఫలించాయి. అంతా సవ్యంగా ఉంటే నెలకు పదిహేనువందల దాకా వస్తుంది.

ఇంటికి వెళ్లేటప్పుడు స్వీట్స్ కొనుక్కుని వెళ్లాను. ముందుగా ఈ విషయం అమ్మకు చెప్పాను. ఆవిడ ఆనందించింది. నాన్నగారు, తమ్ముడు మాత్రం నిరసనగా మాట్లాడారు. 'బోడి పదిహేను వందలకు పదిహేను వేలన్నట్టు ఫోజిస్తున్నాడు' అని తమ్ముడు నవ్వాడు. మరో తమ్ముడు మురళి వెంటనే వాడి ముఖం పగిలేలా సమాధానం ఇచ్చాడు. "నీకు ఆ సంపాదన కూడా లేదు కదా"

ఆ మాటకు శ్రీనివాసు చాలాసేపు సాధిస్తూనే ఉన్నాడు. నా బెల్ట్ ఎందుకు పెట్టుకుని వెళ్లావంటూ కాసేపు గొడవ చేశాడు. కాసేపాగి ఇంత ఖరీదైన షర్ట్ నీ ముఖానికి అవసరమా అన్నాడు. నేనేమీ సమాధానం ఇవ్వలేదు. నా పాత బట్టలన్నీ తీసుకుని టైలరు దగ్గరకు వెళ్లాను. నాతోపాటు నా చెల్లెలు వసుంధర వచ్చింది.

టైలర్‌కు బట్టలు ఇచ్చి ఏంచేయాలో వివరంగా చెప్పింది. అతను ముందు విసుక్కున్నాడు. పాత బట్టలు సైజు చేయడం కుదరదమ్మా! అన్నాడు. చెల్లాయ్ మాత్రం అతన్ని కన్‌విన్స్ చేసింది.

మొత్తంమీద బట్టలన్నీ నాకు పర్ఫెక్టుగా సరిపోయేలా సైజు చేసిచ్చాడు. ఆరోజు ఉదయం అంతా కొంచెం టెన్షన్‌గానే ఉంది.

సాయంత్రం నాలుగు గంటలకు స్కూల్లో ఉండేలా ఇంట్లోంచి బయలుదేరి వెళ్లాను. బయలుదేరే ముందు దేవుడికి దణ్ణం పెట్టుకున్నాను.

అప్పటికే స్టూడెంట్స్ ఒక రూమ్‌లో కూర్చుని ఉన్నారు. ప్రిన్సిపల్ విద్యార్థులకు నన్ను పరిచయం చేశాడు.

మొదటిరోజు జస్ట్ స్ట్రెయిట్ లైన్స్ గీయటం నేర్పాను. పిల్లలంతా ఉత్సాహంగా నేర్చుకున్నారు. ప్రిన్సిపల్ ముందే నా గురించి చెప్పడంవల్ల వాళ్లల్లో వాళ్లు గుసగుసలాడుకున్నారేకానీ నన్ను మాట్లాడించే ప్రయత్నం చేయలేదు. అయితే మాస్టారు సరదాగా తమతో మాట్లాడాలి. తమకు కథలు చెప్తూ, నవ్వుతూ, నవ్విస్తూ పాఠం చెప్పాలి. అలా కాకుండా మౌనంగా ఉండటం వారికి నచ్చినట్టులేదు. ఆ విషయం వారి ప్రవర్తన చూస్తే నాకు అర్థమైంది.

రెండుమూడు రోజులలోనే పిల్లలంతా నిరశన ప్రకటించారు. దాంతో కనీసం మొదటి నెల జీతమైనా అందుకోకముందే ఉద్యోగం మానుకోవాల్సి వచ్చింది. ప్రిన్సిపాల్ మాత్రం బాధపడ్డారు. బాధపడి చేసేదేం లేదు కాబట్టి ఆ రెండుమూడు రోజులకు ఎంత వస్తుందో అంత లెక్కగట్టి ఇవ్వబోయారు.

నేనే తీసుకోలేదు. ఒకమ్మాయికి ఇంటికి వెళ్లి చెప్తున్నానని చెప్పానుకదా! ఆ ఉద్యోగం ఒకటే మిగిలింది.

ఆ పాప పేరు లావణ్య. నాలుగేళ్లు ఉంటాయనుకుంటాను. నేను చెప్పింది చెప్పినట్టు ఎంతో శ్రద్ధతో నేర్చుకుంటోంది. ఆ అమ్మాయి ఉత్సాహం చూసి నేను మరింత




శ్రద్ధగా చెప్పటం మొదలుపెట్టాను.

లావణ్యా తను పెయింటింగ్ నేర్చుకుంటున్న సంగతి వాళ్ల స్కూల్లో చెప్పినట్లుంది. మరో ముగ్గురు పిల్లలు కూడా నేర్చుకోవడానికి ఉత్సాహం చూపారు. అందరి ఇళ్లకు విడివిడిగా వెళ్లి చెప్పడం కష్టం కాబట్టి వాళ్లకు చెప్పడమో! మానడమో తేల్చుకోలేక పోయాను.

లావణ్యా తాతగారు నా పరిస్థితిని అర్థం చేసుకున్నారు. వాళ్లకి కూడా తమ ఇంట్లోనే చెప్పమని చెప్పారు. ఆ పిల్లల తల్లితండ్రులను ఆయనే ఒప్పించారు. ఆవిధంగా నలుగురు విద్యార్థులకు కలిసి మూడు వేలు నా సంపాదనయ్యింది. అందులో ఇద్దరు అన్నా చెల్లెళ్లు. వాళ్ల అమ్మగారు వచ్చి ఇద్దరికీ చెరో వెయ్యి ఇవ్వలేనని ఇద్దరికీ కలిపి వెయ్యి రూపాయలు ఇస్తానని చెప్పడంతో సరేనని ఒప్పుకున్నాను. ఆ పిల్లలిద్దరూ నేర్చుకోవాలని ఎంతో ఉత్సాహంగా ఉన్నారు. వారి ఉత్సాహం మీద నీళ్లు చల్లడం నాకు ఇష్టం లేదు.

ఇక్కడ నాకు ఓ విషయం అర్థమైంది. మొదటి రూపాయి సంపాదించడమే కష్టం. ఆపైన డబ్బు సంపాదించాలన్న కోరిక మొదలవుతుంది. దాంతో పోటీ మార్గాలు అన్వేషిస్తాము. సంపాదన పెరుగుతుంది.

మొదటి నెల జీతం తీసుకువెళ్లి అమ్మకిచ్చాను. మొదట మూడు వేలు ఇద్దామనే అనుకున్నాను కానీ మా ఇంట్లోవాళ్ల సంగతి నాకు తెలుసు. ఎంత డబ్బున్నా ఆరోజే ఖర్చుపెట్టేసే మహానుభావులు. రేపు అనేది ఒకటుంటుందని ఓ పది రూపాయలు బ్యాంకులో దాచుకోవాలని వాళ్లకు ఆలోచన ఉండదు. అందుకే పదిహేను వందలే ఇంట్లో ఇచ్చాను. మిగతాది లావణ్యా తాతగారు నా పేరు మీద ఎకౌంట్ ఓపెన్ చేయిస్తే అందులో డిపాజిట్ చేశాను. రెండుమూడు నెలలపాటు నెలకు పదిహేను వందలు కరెక్టుగా వస్తుండేసరికి ఇంట్లో నా గౌరవం పెరిగింది. ఇదివరకులా ఎవ్వరూ నన్ను ఇష్టం వచ్చినట్లు మాట్లాడటం లేదు. అంటే సంఘమేకాదు ఇంట్లో వారు కూడా డబ్బుసంపాదనకే విలువనిస్తారన్నమాట. ఈ సందర్భంలో పిల్లలకు ఓ వారం రోజులపాటు సెలవలు వచ్చాయి. ఆ వారం రోజులు నాకు క్లాసులులేవు. పిల్లలు ఊరెడుతుండటంతో నాక్కూడా సెలవలు దొరికాయి.

అంతవరకు ఓ డిసిప్లిన్‌కు అలవాటు పడ్డ నాకు ఖాళీగా కూర్చోవడం బోర్ అన్పించింది. రోజు గడవడం చాలా కష్టమయ్యింది.

కానీ ఈ వారం రోజులలో నాకు మరో ఉద్యోగం దొరికింది. ఈ ఉద్యోగం నాకు ఎవరూ ఇవ్వలేదు. నాకుగా నేను సంపాదించుకున్నాను.

ఓ సాయంత్రం వేళ మా ఇంటికి దగ్గరలో ఉన్న పార్క్‌కి వెళ్లాను. వెళ్లేటప్పుడు పేపర్లు, పెన్సిల్, రంగులు అన్నీ వెంట తీసుకువెళ్లాను. పార్క్‌లో ఓ మూల కూర్చుని దీక్షగా బొమ్మ వేయడం ఆరంభించాను. ప్రకృతి కన్య ఉదయభానుని కిరణాలకు మేల్కొని ప్రకృతినంతా తట్టిలేపడం అన్నది థీమ్. అక్కడ నన్ను డిస్టర్బ్ చేసే వాళ్లెవరూ లేరు. పైగా చాలా రోజుల తర్వాత బొమ్మ వేస్తున్నానేమో ఓ గంట సేపు చాలా దీక్షగా స్కెచ్ వేసుకున్నాను.

అంతలో ఒక బాల్ వచ్చి నామీద పడింది. దాంతో నా ఏకాగ్రతకు భంగం అయింది. ఒక్క నిమిషం పాటు చాలా కోపం వచ్చింది కూడా.

ఆ బాల్ చేతిలోకి తీసుకుని ఎవరైనా వస్తే బాల్ ఇచ్చేద్దామని చూస్తున్నాను. ఓ చిన్న పాప భయంభయంగా నా దగ్గరకు వచ్చింది. "అంకుల్ బాల్ ఇస్తారా ప్లీజ్" అంది.

అంత చిన్నపాప మీద నా కోపం ఎలా



చూపిస్తాను? బాల్ ఆ పాపకు అందించాను. ఆ పాప బాల్ తీసుకుంటూ "థాంక్స్ అంకుల్" అంది.

నేను చిన్నగా నవ్వి ఊరుకున్నాను. అక్కడున్న నా సరంజామా అంతా చూసి తీరికగా కూర్చుంది. బాల్ ఒళ్లో పెట్టుకుంది.

"అంకుల్! మీరు బొమ్మలు వేస్తారా? " అని అడిగింది.

ఆ పాప కుతూహలం చూస్తుంటే ఎంతో ముచ్చటగా అన్పించింది.

అవునన్నట్టు తలాడించాను.

"అయితే నా బొమ్మ వేస్తారా? "

ఆ పాప అంత ఆశగా అడుగుతుండేసరికి కాదనలేకపోయాను.

సరేనని ఆ పాపను కూర్చోబెట్టాను. కదలకుండా కూర్చోవాలని, మాట్లాడకూడదని సైగచేశాను. సరేనంది. ఒకరిద్దరు మా వంక కుతూహలంగా చూస్తున్నారు.

నేను చెప్పినట్టుగానే పాప కదలకుండా కూర్చుంది.

ఓ పావుగంటలో పాప ముఖం అందంగా రూపుదిద్దుకుంది. థాంక్స్ చెప్పి వెళ్లిపోయింది. బొమ్మ చూసుకుని ఆ పాప ఎంతగానో మురిసిపోయింది. చీకటి పడుతుండడంతో పేపర్లన్నీ సర్దుకున్నాను.

ఈలోగా "డాడీ! ఈ అంకులే నా బొమ్మ వేశారు" అని చెప్తుండగా నేను తల ఎత్తి చూశాను.

ఆ పాప తండ్రి అనుకుంటాను "బొమ్మ చాలా బాగా వేసారండీ! థాంక్స్" అన్నాడు.

ఆ తండ్రీ కూతుళ్లు పడుతున్న ఆనందం చూస్తుంటే నాకెంతో తృప్తిగా అన్పించింది.

వాళ్లబ్బాయి అనుకుంటాను "డాడీ! అంకుల్ ని నా బొమ్మ కూడా గీయమని చెప్పండి. ప్లీజ్ డాడీ..." ఆ అబ్బాయి సన్నగా రాగం అందుకున్నాడు.

"ఏమండీ! మీరేమీ అనుకోకపోతే..."

ఆయన అడగలేక అడగలేక అడిగాడు.

వెంటనే ఓ పేపర్ మీద "ఇప్పుడు లైట్ సరిపోదు. రేపు వస్తే తప్పకుండా బొమ్మ వేస్తాను" అని రాశాను. ఆ చిన్న పిల్లాడిని నిరాశపరచడం నాకు ఇష్టంలేదు.

'మీరు" అంటూ అర్థోక్తిగా ఆగిపోయాడాయన.

"నాకు మాటలురావు" అన్నట్టు సైగచేశాను.

"అయ్యో సారీ సర్" ఆయన సానుభూతి చూపించాడు. జేబులోంచి ఓ రెండు వందలు తీసి పాప చేతికిచ్చి ఇమ్మని చెప్పాడు.

నేను వద్దని వారించినా వినకుండా ఆ పాప బలవంతంగా ఆ రెండు వందలు నా చేతికిచ్చింది.

వెడుతూ వెడుతూ వాళ్లబ్బాయి "అంకుల్! రేపు నేను తప్పకుండా పార్క్‌కి వస్తాను. మీరు నా బొమ్మ గీయాలి" అన్నాడు.

అలాగేనని తలాడించాను.

ఆ రాత్రి నాకు ఓ ఆలోచన వచ్చింది. ఒకరి బొమ్మ గీయడానికి నాకు పావుగంట నుంచి అరగంట పడుతుంది. పార్క్‌లో ఓ రెండు మూడు గంటలు కూర్చోగలిగితే ఆరు ఏడు బొమ్మలు దాకా గీయచ్చు. మనిషి యాభై రూపాయలిచ్చినా మూడు వందల దాకా సంపాదించవచ్చు. అంటే నెలకు తొమ్మిది, పదివేలన్నమాట.

చూశారా ఒక చిన్నపాప నా ఆలోచనా విధానాన్ని ఎంతగా మార్చిందో. మరుసటి రోజు మరింత ఉత్సాహంగా పార్క్‌కు వెళ్లాను. వెడుతూ వెడుతూ ఓ కార్డ్‌బోర్డ్ మీద బొమ్మకు యాభై రూ॥ అని రాసిన బోర్డు తీసుకు వెళ్లాను. నేను వెళ్లేసరికి నిన్నటి కుర్రాడు వచ్చి ఉన్నాడు.

అతన్ని కదలకుండా కూర్చోమని చెప్పి చకచకా బొమ్మ గీసేశాను. ఆ అబ్బాయి తండ్రి డబ్బులివ్వబోతుంటే వద్దని వారించాను. ఆ అబ్బాయి తర్వాత మరో ఇద్దరు




ముగ్గురు కూడా వచ్చి వారివారి బొమ్మలు గీయించుకున్నారు. తలో యాభై ఇచ్చి వెళ్లారు.

ఆ విధంగా మూడు గంటలలో కనీసం ఏడెనిమిది మంది పోర్ట్రెయిట్స్ గీశాను. ఆదాయం కూడా సంతృప్తిగా ఉంది. అలా వారం రోజులపాటు రోజూ పార్క్‌కు వెళ్లి బొమ్మలు గీశాను. ఓ మూడు వేలదాకా సంపాదించాను. పిల్లలకు సెలవలు అయిపోవడంతో వారం రోజుల తర్వాత లావణ్య వాళ్లింటికి వెళ్లాను. ఆయన నన్నెంతగానో మెచ్చుకున్నారు. లావణ్య తాతగారికి నా పరిస్థితి అంతా వివరంగా చెప్పాను. ఆయనే ఓ ఆలోచన చెప్పారు. ఇంతకుముందు పిల్లలకు సాయంత్రం అయిదు గంటల నుండి ఏడు గంటల వరకు నేర్పేవాడిని. ఆ సమయంలో పార్క్‌కి వెళ్లి, పిల్లలకు నేర్పడానికి రాత్రి ఏడు గంటలకు రమ్మన్నారు. ఈలోగా పిల్లల హోంవర్క్ అదీ కూడా పూర్తవుతుంది కాబట్టి కొంచెం ఎక్కువసేపు నేర్చుకుంటారు అని చెప్పారు. మిగతా పిల్లల తల్లితండ్రులకు కూడా ఈ మార్పు గురించి చెప్పి వారిని ఆయనే ఒప్పించారు.



ఈ ఆలోచన కూడా బానే వుందనిపించింది. ఆ విధంగా నా పరిస్థితిని అర్థంచేసుకుని నాకు సహకరించేవారు దొరకడం నా అదృష్టం.

మొత్తంమీద నెలకు ఓ పదివేలదాకా సంపాదిస్తున్నాను. అందుకని ఇకనుంచి ఇంట్లో అయిదువేల వరకు ఇవ్వచ్చనుకున్నాను. అదీగాక ఇంటి పరిస్థితి కూడా అధ్వాన్నంగా తయారైంది. ఇంట్లో వాళ్లు ఇబ్బందిపడుతుంటే నేను బ్యాంకులో డబ్బు దాచుకోవడం ఏం సమంజసం.

అమ్మ చాలా ఆనందపడింది.

"ఎంతైనా పెద్దకొడుకు పెద్దకొడుకే. వాడే ఇంటిని ఆదుకుంటున్నాడు" అని మురిసిపోయింది.

★ ★ ★

రోజులు కొద్దోగొప్పో సజావుగా సాగుతున్నాయి.

ఇప్పుడు నా సంపాదన కూడా బావుంది.

నా తరువాత మరి కొందరు ఆర్టిస్ట్‌లు కూడా పార్క్‌లో ఇలాగే బొమ్మలు గీస్తామంటూ మకాం పెట్టారు. అందరమూ బాగానే సంపాదించుకుంటున్నాం.

ఓరోజు ఈ వార్త ఇంట్లో బాంబులా పేలింది. అంతవరకు ఇంట్లో ఈ విషయం తెలీదు. మామూలుగా నా వర్క్ అంతా పూర్తిచేసుకుని ఇంటికి వచ్చాను.

నేను వచ్చేసరికి నాన్నగారు ఇంట్లో ఆవేశంతో చిందులు వేస్తున్నారు.

"వాడు నా పరువంతా పోగొడుతున్నాడు. పార్క్‌లో కూర్చుని ప్రతి అడ్డమైన వెధవ బొమ్మలూ గీస్తూ డబ్బులు సంపాదించి తెస్తున్నాడు. ఛీ... ఛీ... తల్చుకుంటుంటేనే ఎంతో కంపరంగా వుంది. ఇన్నాళ్ళు ఎంతో పరువుమర్యాదలతో

బతికాం. ఇప్పుడు వీడి మూలంగా అన్నీ సర్వనాశనమైపోయాయి. మా పార్టీ సభ్యు డొకడు ఈరోజు ఫ్యామిలీతో పార్క్‌కు వెళ్ళా డట. అక్కడ మనవాడు ఓ బోర్డు పెట్టు కుని కూర్చున్నాడట. ఏమని అని అడ గవేం? "

"ఏమనండీ..." అంది అమ్మ.

'ఇక్కడ అందంగా మీ బొమ్మ గీయబ డును. కేవలం యాభై రూపాయలు మాత్రమే...' అని బోర్డు పెట్టుకుని కూర్చుం టున్నాడట. ఇంకేముందీ ప్రతి అడ్డమైన వెధవ వీడిముందు కూర్చోవడం, బొమ్మ గీయించుకోవడం ఓ ముష్టివాడికి ఇచ్చిన ట్టుగా యాభైరూపాయలు వీడిచేతిలో పెట్టడం... ఇదీ మనవాడు చేస్తున్న నిర్వాకం. "మీ అబ్బాయి పరిస్థితి చూస్తుంటే చాలా జాలేసిందండీ... మీలాం టివారికి పుట్టిన అబ్బాయి ఇలా చేయచ్చా అది మీకెంత చిన్నతనం" అని చూసినవాళ్లు అంటుంటే నా తల కొట్టేసినంత పనైంది..."

నా గురించి అమ్మ ఏమంటుందా అని ఎదురుచూస్తున్నాను.

"అవును! మీ పార్టీసభ్యుల గురించే చెప్పు కోవాలి. అయినా నాకు తెలీక అడుగుతాను ఇందులో అంత పరువుపోయే పని ఏముం దట? వాడేమైనా దొంగతనాలు చేసి సంపాదిస్తున్నాడా లేక హత్యలు చేస్తు న్నాడా? వాడికి వచ్చిన విద్యతో నలుగురి బొమ్మలు గీసి నిజాయితీగా సంపాదిస్తు న్నాడు. తను కడుపునిండా తింటున్నాడు. మనకు కడుపునిండా ఇంత తిండి పెడుతు న్నాడు. ఎందుకండీ ఈ పనికిమాలిన భేష జాలు మనకు పెళ్ళైన నాటినుంచి చూస్తు న్నాను. అప్పట్నించీ ఇల్లు, ఇంటి విష యాలు పట్టించుకోకుండా పార్టీలు, సమావే శాలని తిరుగుతూనే వున్నారు. మీ తరు వాత వచ్చిన వారంతా కోట్లకు కోట్లు సంపా దించారు. మీరు మాత్రం ఎక్కడున్నావే





గొంగళి అంటే వేసినచోటే ఉన్నానన్నట్టుగా ఉండిపోయారు. ఏనాడైనా ముచ్చటకోస మైనా పావలా పెట్టి మల్లెపూలు తెచ్చిన రోజుందా? మనం అందరం కలిసి బయట కెళ్ళి, సరదాగా గడిపిన రోజుందా? పోనీ అలా అని నా మొగుడు తీరిక లేకుండా సంపాయించేస్తున్నాడమ్మా అనుకోవడానికి కూడా లేదాయే"

"సీతా..." అరిచారు నాన్న.

"అవునండీ సీతనే మాట్లాడుతున్నాను. మీరు ఇంటి ఖర్చులకు డబ్బులిచ్చి ఎన్నా ళ్ళైంది? పచారి కొట్లో అప్పు, బియ్యం కొట్లో అప్పు, ఇంటి అద్దె బాకీ, బట్టల కొట్టువాడికీ డబ్బు ఇవ్వాలి. ఇవన్నీ మీకేం పట్టవు. అయ్యో మనం ఇంటి ఖర్చులకు డబ్బులు ఇవ్వకపోయినా అది టైమ్‌కింత వండి పెడుతోందే... సరుకులు ఎక్కడ్నించి వస్తు న్నాయి? అని ఎప్పుడైనా ఆలోచించారా? చిన్నతనంనుంచి మనం వాడిని ఎంత నిర్ల క్ష్యంగా చూసినా, వాడిమీద విసుక్కున్నా, వాడిని ఓ మనిషిగా చూడకపోయినా ఈరోజు వాడే మనల్ని ఆదుకుంటున్నాడు. నెలకు అయిదారువేలు సంపాదించి ఇస్తు న్నాడు..."

"అంటే నేను చేతకానివాడిననేగా నువ్వ నేది..."

"నేను ఎవ్వర్నీ ఏమీ అనడంలేదు. కానీ మీమీ అసమర్థతలు కప్పిపుచ్చుకోవడానికి వాడినేమీ అనద్దని చెప్తున్నానంతే. కృష్ణ కష్టపడి సంపాదిస్తున్నాడే తప్ప ఎవ్వరి పొట్టా కొట్టడంలేదు. అందుకని వాడినేమీ అనకండి. చేతనైతే వాడి కష్టాన్ని అర్థంచేసు కోండి. లేదా ఊరుకోండి..." అంది అమ్మ.

అమ్మ నన్ను సపోర్ట్ చేస్తూ మాట్లాడేస రికి నాపని సులువైంది. ఇదంతా నేను మాట్లాడితే బావుండదు. తండ్రిని గౌరవించ లేదంటారు. పైగా వాళ్ళకు బదులు ఇవ్వా లంటే నేను పేపరు, పెన్ను సహాయం తీసుకోవాలి. ఈ లోపల ఆవేశం చల్లారు తుంది. ఆర్గ్యుమెంట్ వీక్ అవుతుంది.

"సరే... మీ చావు మీరు చావండి. ఏరోజు మీరు నామాట విన్నారు కాబట్టి..." అంటూ నాన్నగారు తన గది లోకి వెళ్ళిపోయారు.

హమ్మయ్య అని తేలికగా ఊపిరి పీల్చుకు న్నాను.

ఆ తరువాత కొన్నాళ్లపాటు ఏ గొడవాలే కుండా ప్రశాంతంగా రోజులు గడిచాయి. కానీ ఇది తుపాను ముందరి ప్రశాంతత అని నాకు తెలుసు.

★ ★ ★

నాన్నగారు ఓరోజు ఓ ప్రస్తావన చేశారు. తమ్ముడు ఉద్యోగం, సద్యోగం లేకుండా బలాదూరు తిరుగుతున్నాడు కాబట్టి పెళ్ళి చేస్తే కుదురుగా ఉంటాడుకదా. బాధ్యత కూడా తెలిసి వస్తుంది అన్నారు.

యథాప్రకారం నేనేం మాట్లాడలేదు.

అమ్మ మాత్రం మరోసారి తన ఆవేశం వెళ్ళగక్కింది.

"రానురాను ఈ ఇంట్లో వాళ్ళందరికీ మతిపోతున్నట్లుంది. పెళ్ళీడుకొచ్చిన కూతు రుండగా కొడుక్కి పెళ్ళి చేస్తారట. హవ్వ... ఈ సంగతి ఎవరైనా వింటే నవ్విపోతారు" అంది.

నాన్నగారు వాదనకు దిగారు. "ఆమాత్రం ఆలోచన నాకూ ఉంది. వసుం ధరకి ఇంకా పదిహేనేళ్ళే కదా. మరో రెండుమూడేళ్ళాగి చేయచ్చులే. ఈలోపు శ్రీనివాసు పెళ్ళి కానిచ్చేద్దాం" అన్నారు.

"పనీ, పాటా లేనివాడికి పిల్లనెవరు ఇస్తారు?" అంది అమ్మ.

"ఈరోజుల్లో ఆడపిల్లల తల్లిదండ్రులు ఎలా వున్నారనుకున్నావ్? కాటికి కాళ్ళు చాపుకున్నవాడికి కూడా పిల్లనివ్వడానికి సిద్ధ పడుతున్నారు. అలాంటిది లక్షణంగా వున్న వాడికి, అందునా ఈ సోమయాజులుగారి కొడుక్కి పిల్లనెందుకివ్వరు?" అని నాన్న గారు మీసం మెలేశారు.

ఆమాట నిజమే...

"అది కాదండీ! వాడికి ఇంకా పాతికేళ్లు కూడా రాలేదు. అప్పుడే వాడికి పెళ్ళెం దుకు? వాడితోపాటు వాడి పెళ్లాన్ని, వాడి పిల్లల్నీ కూడా పోషించాలి. ఏమీ అవసరం లేదు. ముందు వాడికి బాధ్యత తెలిసొచ్చి ఏదైనా ఉద్యోగంలో కుదురుగా ఉంటే అప్పుడు పెళ్ళి గురించి ఆలోచించవచ్చు" అంది అమ్మ.

"ఆ బాధ్యత తెలిసిరావడానికేగా పెళ్ళిచే స్తున్నది. పెళ్ళైతే వాడి బాధ్యత వాడికి తెలి సొస్తుంది. ఇక ఈ విషయంలో నేనెవరి మాటా వినేదిలేదు" ఓ నిర్ణయానికి వచ్చేసి నట్టుగా అన్నారు నాన్న.

"కానీ పెద్దాడికి పెళ్ళి కాకుండా" అర్థోక్తిలో అమ్మ ఆగిపోయింది. అమ్మ ఆమాట అనే సరికి నా మనసులోను ఏవో ఊహలు తలె త్తాయి. నేను, నాభార్య, నా పిల్లలు... నాకంటూ ఓ కుటుంబం అన్న ఊహ ఎంతో మధురంగా అనిపించింది.

ఆశపడటాన్నికైనా అర్హత ఉండాలికదా! నన్నెవరు పెళ్ళి చేసుకోవడానికి ముందుకు వస్తారు?

అక్కడే నా ఆలోచనలను తెంచేశాను.

అమ్మ మరోసారి అదే ప్రశ్న అడిగింది.

నాన్నగారు సమాధానం చెప్పలేదు.

"అవును నాన్నగారూ! ముందు కృష్ణన్న య్యకు పెళ్ళి చేసేద్దాం. ఆ తరువాత శ్రీన న్నయ్యకు చెయ్యండి" అంది వసుంధర.

మురళి కూడా అదే అభిప్రాయం వ్యక్తం చేశాడు.

నాన్నగారి కళ్లు ఎందువల్లనో చెమ్మగి ల్లాయి. "మీకేకాదు... నాక్కూడా కృష్ణకు పెళ్లిచేయాలనే వుంది వాడు నా పెద్దకొ డుకు. తండ్రికి ఎప్పుడూ పెద్దకొడుకుమీదే అభిమానం ఎక్కువగా వుంటుంది. కానీ... వాడికి పిల్లనెవరిస్తారు?" అంటూ కళ్లు తుడుచుకున్నారు.

మొదటిసారి నాన్నగారు నా గురించి ఆలోచించారు.

నా గురించి ఆవేదన చెందారు.

అప్పుడు అన్పించింది రక్తసంబంధం అంటే అదేనని...

"మనం ఇంతవరకూ ప్రయత్నించలేదు కదా. అసలు వాడికి పెళ్ళి చేయాలన్న ఆలోచనే మనకు ఇప్పుడు వచ్చింది. నాలు గుచోట్ల విచారిస్తే వాడికి తగ్గ పిల్ల దొరక కపోదు" అంది అమ్మ.

"సరే అలాగే ప్రయత్నిద్దాం. కానీ ముందు శ్రీనివాసుకి పెళ్ళి చేయాలి. పెళ్ళి అయితేనైనా వాడికి బాధ్యత తెలిసి వస్తుం దేమో చూడాలి. శ్రీను పెళ్ళయ్యాక కృష్ణకు సంబంధాలు చూడడం మొదలుపెడదాం. ఎంత టైమ్ అయినా పట్టనీ... వాడికి తగ్గ సంబంధం దొరికేవరకూ ప్రయత్నిద్దాం" అన్నారు నాన్న.

అమ్మ ఒప్పుకుంది.

"కృష్ణకు పెళ్ళిచేయడం చాలా అవసర మండీ. రేప్పొద్దున్న అందరికీ పెళ్ళిళ్ళయి, ఎవరి సంసారాలు వాళ్ళకి ఏర్పడ్డాక మన కృష్ణ ఒంటరివాడైపోతాడు. మనం ఉన్న న్నాళ్ళూ మనం చూస్తాం. ఆ తర్వాత వాడికి దిక్కెవరు? వాడికి తగ్గ పిల్లను చూసి పెళ్ళి చేస్తే ఆపిల్లే వాడిని చూసుకుం టుంది" అంది అమ్మ.

నాన్నగారు అమ్మ మాటకు అంగీకరిం చారు.

మొత్తంమీద శ్రీనుకు పెళ్ళి చేయాలని నిశ్చయించారు. కానీ తమ్ముడు ఒప్పుకుం టాడో లేదోనన్న సందేహం కలిగింది.

తమ్ముడ్ని ఒప్పించే బాధ్యతను అమ్మకు అప్పగించారు నాన్న.

అమ్మ మాట వినగానే తమ్ముడు ఇంతె త్తున ఎగిరాడు. 'ఉద్యోగం, సద్యోగం లేని నాకు పెళ్ళేంటి? మీకసలు బుద్ధుందా లేదా?' అని అరిచాడు.

ఫర్వాలేదు నా తమ్ముడికి వ్యక్తిత్వం ఉంది అన్పించింది.





అమ్మ వాడిని చాలాసేపు బతిమాలింది. "చాలామందికి పెళ్ళి అవగానే కలిసొ స్తుంది. పెళ్ళైతే నీకు బాధ్యత తెలిసొ స్తుంది. అంతెందుకు మావయ్యా నీ జాతకం చూపిస్తే జ్యోతిష్కుడు కూడా అదే చెప్పా డట. పెళ్ళయితేనే నీకు కలిసి వస్తుందని అన్నాడట" అని చెప్పింది.

ఆ చివరిమాట వాడిమీద బాగా పనిచే సింది.

ఈ దేశంలో జ్యోతిష్కుల మాటకు ఎంత విలువుందో కదా!

"నువ్వు చెప్పేది నిజమేనా? అమ్మా" అని అడిగాడు శ్రీనివాసు.

"అవున్రా..." అంది అమ్మ.

వాడు ఆ మాటను ఎలా నమ్మాడో నాకు అర్థంకాలేదు. చదువా అబ్బలేదు, కుదురు కూడా లేదు. చిన్న చిన్న ఉద్యోగాలు వీడి కంటికి ఆనవు. కష్టపడి పనిచేయలేడు. అలాంటివాడిని పెళ్ళి మారుస్తుందా? అదృష్టం తలుపు తడుతుందా?

కానీ మనిషికి అజ్ఞానం ఇచ్చినంత ఆనందం జ్ఞానం ఇవ్వదుకదా. అందుకే మనిషెప్పుడూ వాస్తవానికి దూరంగా బతకా లనే కోరుకుంటాడు. మొత్తంమీద పెళ్ళి చేసు కోవడానికి మా తమ్ముడు అంగీకరించాడు.

★ ★ ★

మరుసటిరోజు పెళ్ళిళ్ళ పేరయ్యా వచ్చాడు.

అబ్బాయిగారి వివరాలు, ఉద్యోగం అదీ చెప్తే తగిన సంబంధాలు చెప్తానన్నాడు.

ఇంక నాన్నగారు గాల్లో మేడలు కట్టడం మొదలెట్టారు. "మా వాడిది డిగ్రీ అయిపో యింది శాస్త్రులుగారూ! ఏవో ఉద్యోగాలు చేశాడనుకోండి. ప్రస్తుతం మైనింగ్ బిజినెస్ చేసే ఆలోచనలో ఉన్నాడు" అన్నారు.

ఆ విషయం విని అమ్మతోపాటు మేమంతా ఉలిక్కిపడ్డాం.

హైదరాబాద్‌లో మైనింగ్ బిజినెస్సా?

ఆ విషయమే పేరయ్యగారు అడిగారు.

"మావాడు కర్నూలు దగ్గర బేతంచెర్లకు

వెళ్ళిపోతాడండీ. అక్కడే మైనింగ్ బిజినెస్ మొదలుపెడతాం" అన్నారు.

పేరయ్యగారు సంతృప్తిగా తలాడించారు.

నాలుగైదు ఫొటోలు ఇచ్చి అమ్మాయిల వివరాలు చెప్పారు.

"అయ్యా! తమరెంతవరకూ ఆశిస్తున్నారో చెప్తే..."

"ఎంతవరకూ అంటే..." నాన్నగారికి పేరయ్యగారు చెప్పిందేమిటో అర్థం కాలేదనుకుంటాను.

"అదేనయ్యా! కట్నం, లాంఛనాలు కూడా ఒకమాట అనుకుంటే ఇరుపక్షాలకు ఇబ్బంది లేకుండా ఉంటుంది కదా అని"

"ఏమిటయ్యా శాస్త్రులూ... నా గురించి తెలిసే ఆమాట అంటున్నావా? కట్నం తీసుకోవడం పాపం మాత్రమేకాదు, అది నేరం కూడానూ" అన్నారు నాన్న.

నాన్నగారి మాటలు అమ్మకు కోపం తెప్పించాయి.

పేరయ్యగారిముందు గొడవపడితే బాగుండదుకదా అని, "అయ్యా! మీరేమీ అనుకోకపోతే అమ్మాయిల ఫొటోలు ఇక్కడ ఉంచి వెళ్ళండి. ఏ విషయమూ మేం తర్వాత తెలియచేస్తాం" అంది అమ్మ.

పేరయ్యగారు సరేనన్నారు.

ఆయన అలా వెళ్ళారో లేదో గొడవ మొదలైంది.

"మన పరిస్థితి ఏమిటి? ఆర్థికంగా ఎంత ఇబ్బంది పడుతున్నాం. ఈ సమయంలో పెళ్ళి దండగ అనుకుంటే దానికితోడు కట్నం కూడా తీసుకోనంటారేమిటి? " అంది అమ్మ.

"కట్నం తీసుకోవడం అంటే నలుగురిలో నా పరువు పోవడమే" అసహనంగా అరిచారు నాన్న.

"చాల్లెండి... అక్కడికి మీరొక్కరే కట్నం తీసుకుంటున్నారా? అందరితోపాటే మనమూనూ..."

"వీల్లేదు. రేప్పొద్దున ఈ విషయం ఎవరికైనా తెలిస్తే ఇంకేమైనా ఉందా! మా పిల్లలకు కట్నం తీసుకోను, కట్నం ఇవ్వను అని ఎన్నోసార్లు చెప్పిన నేను ఇప్పుడు కట్నం తీసుకుంటే సోమయాజులుగారివి అన్నీ ఒట్టిమాటలేనని, తనదాకా వస్తే నలుగురితో నారాయణేనని అనుకోరూ... డబ్బు ఇవ్వాళ వస్తుంది... రేపు పోతుంది. కానీ పోయిన పరువు తిరిగి వస్తుందా? " అన్నారు నాన్న.

ఈ విధంగా సుమారు ఓ గంటసేపు వారిద్దరిమధ్యా తీవ్రమైన వాగ్యుద్ధం నడిచింది. చివరకు అమ్మే సమాధానపడింది. లేదు లేదు నాన్నగారే తన వాక్చాతుర్యంతో అమ్మను సమాధానపరిచారు.

నాన్నగారికి కట్నం డబ్బు వస్తుందన్న ఆశ వున్నా, సొసైటీలో ఆయన గురించి అందరూ చాలా గొప్పగా చెప్పుకోవాలనే కీర్తి కాంక్ష ఎక్కువ. ఆ కాంక్షే జయించడంతో కట్నం తీసుకోవడం విషయంలో అమ్మ నోరు మూసుకోవలసివచ్చింది.

మరుసటిరోజు. పెళ్ళిళ్ళ పేరయ్య వచ్చారు.

నాన్నగారు విషయం చెప్పారు.

జాతకాలమీద నమ్మకంలేదు. కట్నం అక్కర్లేదు. అమ్మాయిమాత్రం సంప్రదాయ కుటుంబంనుంచి వస్తే చాలు.

పేరయ్యగారు వెంటనే ఓ అమ్మాయి ఫొటో చూపించారు. అమ్మాయి పేరు శాంతిశ్రీ. అమ్మాయికి కుజదోషం ఉండడం వల్ల ఇంతవరకూ పెళ్ళికాలేదట. ఈ అమ్మాయికి సంబంధం కుదిరితే మిగతా ఇద్దరు ఆడపిల్లలకు కూడా చూసి ముగ్గురు అమ్మాయిలకూ ఒకేసారి పెళ్ళి చేస్తారట.

నాన్నగారికి ఈ సంబంధం బాగా నచ్చింది.

యధాప్రకారం అమ్మకు నచ్చలేదు. అమ్మాయి చూడడానికి కొంచెం వయసెక్కువదానిలా ఉంది.

"కుజదోషం ఉన్న అమ్మాయంటే కుజ




దోషం ఉన్న అబ్బాయికే ఇచ్చి చేయాలిక దండీ" అని అడిగింది.

పేరయ్యగారేం సమాధానమిస్తారు?

"ఏంటండీ మాట్లాడరేం? " నిలదీసింది అమ్మ.

"నిజమేననుకోండి... కానీ మీవారు జాత కాల పట్టింపు లేదంటున్నారు కదా అని" పేరయ్యగారు నసిగారు.

"పైగా ముగ్గురు ఆడపిల్లలంటున్నారు. ఇక వాళ్ళనాన్న ఏం అచ్చటా ముచ్చటా జరి పిస్తాడు చెప్పండి" అంది అమ్మ.

నాన్నగారు అమ్మ అనుమానాలన్నీ కొట్టి పారేశారు. "పేరయ్యగారూ! ఈ సంబం ధమే ఖాయం చెయ్యండి. పెళ్ళి చూపుల వన్నీ ఓ ఫార్మాలిటీనే... వాళ్ళకి అబ్బాయి నచ్చితే ఇక తాంబూలాలు పుచ్చుకోవడమే"

"అదికాదండీ. కనీసం లాంఛనాలవీ అయినా మాట్లాడుకోవాలికదా" అంది అమ్మ.

"అవసరంలేదు. వాళ్ళ అమ్మాయికి వాళ్ళేం పెట్టుకుంటారో వాళ్ళిష్టమండీ. మనం అవి కావాలి, ఇవికావాలి అని అడ గద్దు. కన్యాదాత మనసు బాధ పెట్టద్దు" అన్నారు నాన్న.

అమ్మకు కోపం వచ్చింది. ఇదంతా నాన్న గారు తన గొప్పతనాన్ని ప్రదర్శించుకోవడా నికే చేస్తున్నారని అమ్మ అభిప్రాయం. ఆ విధంగా తమ్ముడి పెళ్ళి కుదిరిపోయింది.

అమ్మాయి తరపువాళ్ళు కూడా తమ్ముడ్ని ఇష్టపడ్డారు. తమ్ముడికి ఉద్యోగంలేదని కొంచెం ఫీలయ్యారు. కానీ నాన్నగారి మాటలు విన్నాక ఆ ఫీలింగ్ కూడా పోయింది. అమ్మాయి తండ్రి ఉన్నవాడు. 'అవసరమైతే అల్లుడిచేత నేను వ్యాపారం పెట్టిస్తాన్లెండి' అని వాళ్ళకి భరోసా ఇచ్చాడు.

ఎలాంటి ఇచ్చిపుచ్చుకోవడాలూ లేకుండా పెళ్ళి జరిగిపోతోందని అమ్మ సణుగుతూనే వుంది.

అమ్మకి ఈ సంబంధం ఎంతమాత్రం నచ్చలేదు.

'అమ్మాయికి వయసెక్కువని అన్పిస్తోంది' అని అంటూనే ఉంది.

అదీగాక ఓ అమ్మాయికి జీవితం ఇవ్వద లిస్తే లేనింటి అమ్మాయిని చేసుకోవాలిగానీ ఉన్నవాళ్ళ అమ్మాయిని కట్నం లేకుండా చేసుకుంటే అదేమైనా ఘనకార్యమా! అంటూ అమ్మ సాధించడం మొదలుపె ట్టింది. నాన్న ఒక నిర్ణయానికి వచ్చారంటే ఇక ఎవ్వరేది చెప్పినా విన్పించుకోరు... మొత్తంమీద తాంబూలాలు పుచ్చుకునేం దుకు సిద్ధమయ్యారు.

అమ్మాయివాళ్ళు కర్నూలులో ఉంటారు. తాంబూలాలు పుచ్చుకునేందుకు ఇంటిల్ల పాదీ బయలుదేరారు.

నన్ను మాత్రం ఇంటికి కాపలాగా ఉంచారు.

తాంబూలాల సమయంలో అమ్మాయికి పట్టుచీర, ప్రధాన ఉంగరం పెట్టాలని నాన్న గారన్నారు.

అమ్మ మళ్ళీ వాదనకు దిగింది.

సరే... అమ్మాయికి పట్టుచీర కొనడం కోసం అమ్మ, చెల్లాయ్ బయలుదేరబో తుంటే నాన్నగారు వద్దన్నారు. అమ్మ అయితే ఏదో నాసిరకం చీర తెస్తుందనీ, తన కోడలికి గ్రాండ్‌గా చీర పెట్టాలని చెప్పి తను, తమ్ముడూ బయలుదేరారు.

ఆరేడు వేల రూపాయల పట్టుచీర కొన్నారు. ప్రధాన ఉంగరం తీసుకున్నారు. అమ్మాయి తల్లితండ్రులకు కూడా బట్టలు కొన్నారు. తమ్ముడు కూడా ఓ డ్రస్ కొను క్కున్నాడు. మొత్తం పదిహేను వేల దాకా ఖర్చయ్యింది. ఇప్పట్నించీ అప్పుచేయడం మొదలుపెడితే పెళ్ళి అయ్యేసరికి మొత్తం ఎంత అవుతుందో? నాన్నకానీ, తమ్ముడు కానీ ఈ విషయాన్ని పట్టించుకునే స్థితిలో లేరు. పెళ్ళికి అయ్యే ఖర్చంతా నేను ఇవ్వచ్చు దాదాపుగా మూడు నాలుగేళ్ళ

నుండి నెలకు అయిదువేలు తక్కువ కాకుండా నిల్వ చేస్తున్నాను. కానీ తమ్ముడు మగపిల్లాడు. వాడి పెళ్ళి చేయాల్సిన బాధ్యత నాకు లేదు. చెల్లెల్ని బాగా చదివించి తనకు మంచి సంబంధం చూసి పెళ్ళి చేయాల్సిన బాధ్యత నాకు ఉంది. అందుకే తమ్ముడి పెళ్ళి విషయంలో నేను ప్రేక్షకుడినయ్యాను.

తాంబూలాలు పుచ్చుకునేందుకు అందరూ బయలుదేరారు.

బాబాయిలు, పిన్నిలు, అత్తయ్య, మావయ్యలు ఒక్కమాటలో చెప్పాలంటే అటు అమ్మతరఫువారు, ఇటు నాన్న తరఫువారు ఇద్దరికోసం నాన్న బస్ వేశారు. అక్కడికీ అమ్మ చెప్తూనే వుంది. 'తాంబూలాలకే మనం ఇంత హడావుడి చేస్తే వాళ్ళముందు లోకువ అయిపోతాం' అని. కానీ నాన్న విన్పించుకోలేదు.

నన్ను ఇంట్లో ఉంచి అందరూ వెళ్ళారు.

ఆ రెండుమూడు రోజులు ఇంట్లో నేను వండుకున్నాను. అంతా నా ఇష్ట ప్రకారమే ఉన్నాను. మొదటిసారి ఒంటరితనంలో కూడా కొద్దోగొప్పో ఆనందం ఉంటుందన్పించింది. మొట్టమొదటిసారి నా స్టూడెంట్స్‌ని తీసుకుని ఓ పెయింటింగ్ పోటీలకు వెళ్ళాను.

అక్కడ లావణ్యకు ఫస్ట్‌ప్రైజు మరొకరికి థర్డ్ ప్రైజ్ వచ్చాయి. లావణ్యా తాతగారు ధర్మారావుగారి ఆనందానికి అంతులేదు.

"నాకు తెల్సినంతవరకూ పిల్లలకు చెప్పానని ఇకమీదట వాళ్ళకి నా అవసరంలేదని చెప్పాను"

లావణ్య వినలేదు. "లేదు మాస్టారూ! మీరు రోజూ వచ్చి నాకు నేర్పించాల్సిందే" అని పట్టుపట్టింది.

"లేదమ్మా! ఇకమీదట మీరు ప్రాక్టీసు చేయాల్సిందే తప్ప నేను చెప్పాల్సిందేమీ లేదు. మీకేమైనా సందేహాలుంటే వారానికి ఒకసారి వస్తానులే" అని చెప్పాను. అందుకు ఆ పిల్ల ఒప్పుకుంది.

ధర్మారావుగారు నాకు బట్టలుపెట్టి వెయ్యి నూట పదహార్లు ఇచ్చారు. ప్రస్తుతానికి పార్కుల్లో నేను గీస్తున్న బొమ్మలవల్ల బాగానే డబ్బులు వస్తున్నా ఉదయంనుంచి సాయంత్రందాకా ఖాళీగా ఉండాల్సి వస్తోంది. ఆ టైంలో ఏదైనా చేయగలిగితే బాగుంటుంది. ఏం చేయాలా అన్నదే నా ఆలోచన. ఈలోగా తాంబూలాలకు వెళ్ళిన వారంతా తిరిగి వచ్చారు.

ఓ వారంరోజులపాటు పెళ్ళివాళ్ళని దెప్పడానికే అమ్మకు సరిపోయింది. కట్నం వద్దని నాన్నగారు ఆదర్శం చూపితే ఆడపెళ్ళివారు తమ్ముడిలో ఏదో లోపం వుండి వుంటుందనీ, అందుకే కట్నం వద్దని ఉంటారని గుసగుసలాడుకున్నారట.

మా మరదలితోపాటు మరో ఇద్దరు చెల్లెళ్ళకు కూడా సంబంధాలు కుదిరాయికదా. వాళ్ళిద్దరినీ మేనత్త కొడుకులకే ఇస్తున్నారట. మేనత్త కొడుకులైనా కట్నం, లాంఛనాలు అన్నీ ఉన్నాయట. అంతేకాదు వాళ్ళని గౌరవించినట్టుగా అమ్మావాళ్ళని గౌరవించలేదట.

బంధువులంతా 'ఏమే రామసీతా! ఇంతకన్నా మంచి సంబంధం మీకు దొరకలేదా?' అన్నారట. నాన్నగారు మారు మాట్లాడలేదు. వాళ్ళ మర్యాదలవీ ఆయనకు కూడా నచ్చినట్టు లేదు.

"పోనీ ఇప్పుడైనా మాకీసంబంధం వద్దని చెప్పేద్దామా" అంది అమ్మ. కానీ నాన్నగారు ఒప్పుకోలేదు.

ఓ ఆడపిల్ల జీవితంతో ఆడుకోవడం సమంజసంకాదు. ముందే ఆలోచించి నిర్ణయం తీసుకోవాలి. తీరా ఇప్పుడు తాంబూలాలు కూడా పుచ్చుకున్నాక పెళ్ళి క్యాన్సిల్ చేసుకుంటే ఎలా?

దాంతో అమ్మ కనీసం రోజుకి ఒకసారైనా 'అమ్మాయిది వయసు ఎక్కువని అన్పిస్తోంది' అని సణుగుతూనే ఉండేది.




నాన్న, తమ్ముడూ విని కూడా విననట్టుగా ఉండేవారు.

కానీ ఇంతదూరం వచ్చాక ఎవ్వరూ ఏమీ చేయలేరుకదా.

★ ★ ★

**ఓ** వారం ధర్మారావుగారింటికి వెళ్ళినప్పుడు ఆయన ఓ ప్రపోజల్ పెట్టారు.

ఆయనకు తెల్సిన అతను క్యాలెండరు వేద్దామనుకుంటున్నాడట. దేవుడిబొమ్మలు గీసి ఇస్తే మంచి పారితోషికం ఇస్తాడట. మొదట ఒక శాంపుల్ బొమ్మ గీయమన్నాడట.

సరేనని చెప్పాను.

'పారితోషికం ఎంత ఇస్తారు? ' అని నేను అడగలేదు.

ధర్మారావుగారు నాకు అన్యాయం చేయరని నాకు నమ్మకం వుంది.

అనుకున్నట్లుగానే ఒక బొమ్మ గీసిచ్చాను. విఘ్నేశ్వరుని చిత్రంతో మొదలుపెట్టాను. చిత్రంలో జీవకళ ఉట్టిపడుతోంది. ఆ చిత్రం చూసి ధర్మారావుగారు ఎంతగానో మెచ్చుకున్నారు.

కాంట్రాక్టు మీద సైన్ చేశాను.

ప్రతి బొమ్మకిందా నాపేరు రాయమని చెప్పారాయన.

నేను సరేనన్నాను.



సుమారు నలభైరోజులపాటు ఓ దీక్షగా బొమ్మలు గీశాను. ఆ నలభైరోజులు తెల్లవారుఝామునే లేచి తల స్నానం చేసి భక్తితో దేవుడ్ని ప్రార్థించేవాడిని. ఇంట్లో ఎవ్వరూ లేవకముందే బొమ్మతాలూకు స్కెచ్ గీసేవాడిని.

కటికనేలమీద పడుకునేవాడిని.

రాత్రిపూట పాలు, పండ్లు తప్పితే భోజనం చేసేవాడినికాదు.

మొదట మొత్తం పన్నెండు బొమ్మలనుకున్నాను. కానీ తర్వాత కొన్ని బొమ్మలను పోస్టర్స్‌గా వేద్దాం అని చెప్పడంతో మిగతా బొమ్మలు కూడా గీసివ్వాల్సి వచ్చింది.

మొదట పదిహేను వేలు ఇచ్చారు. ఎప్పుడైతే క్యాలెండర్లు బాగా అమ్ముడుపోయాయో మరో పదివేలు అదనంగా ఇచ్చారు. ఒక్కసారిఅంత డబ్బు నేను ఇంతవరకూ చూడలేదు.

ఈసారిమాత్రం డబ్బు తీసుకువెళ్ళి నాన్నగారి చేతికిచ్చాను. అంత పెద్దమొత్తం నేను సంపాదించడం చూసి నాన్నగారు ఆశ్చర్యపోయారు. "ఎక్కడిదిరా ఇంత డబ్బు నీకు" అనడిగారు.

అసలు సంగతి చెప్పాను.

దాంతో మరేమీ మాట్లాడలేదు.

తమ్ముడి పెళ్ళి ఖర్చు దాదాపు లక్ష రూపాయలవుతుందని నాన్న అంచనా వేశారు. అందులో పాతికవేలు అమ్మాయికి నగలు, మరో పదివేలు చీరలు... మొత్తం ఓ నలభైదాకా రాబోయే కోడలికి ఖర్చుపెట్టాలన్నారు.

"మగరాయుడిలా ఉంది చూడడానికి. దాని ముఖానికి అంత ఖర్చు అనవసరం" అంది అమ్మ.

ఈ మొత్తం వ్యవహారంలో ఆ అమ్మాయి తప్పేం ఉంది?

ఆ అమ్మాయికి ఆ ఆకారం భగవంతుడిచ్చాడు.

వయసు ఎక్కువ అంటే అమ్మాయిని

చూసేగా ఇష్టపడింది, సంబంధం నిర్ణయించుకున్నదీ...

అమ్మాయి తరపువాళ్ళు మర్యాదలు చేయకపోతే దానికి ఆ అమ్మాయి ఎలా బాధ్యురాలు అవుతుంది? కానీ ఈ లాజిక్ ఎవ్వరికీ అక్కర్లేదు.

నాన్నగారు ఎన్నోచోట్ల ప్రయత్నించారు కానీ ఎక్కడా డబ్బు అప్పు పుట్టలేదు. ఆఖరకు వాళ్ళ తమ్ముళ్ళను కూడా అడిగి చూశారు. అన్నయ్యా తిరిగి ఇస్తాడో, ఇవ్వడోనన్న భయంతో వాళ్ళు మా దగ్గర లేదనేశారు. నాన్నగారికి ఏం చేయాలో అర్థంకావడం లేదు.

ఓ పక్కన పెళ్ళిపనులు మొదలుపెట్టాలి. శుభలేఖలు అచ్చు వేయించాలి.

బట్టలు, నగలు కొనాలి. చేతిలో చిల్లిగవ్వ లేదు. ఎప్పుడూ ధీమాగా ఉండే నాన్నగారు కొంచెం డల్ అయ్యారు.

ఈ సందర్భంలోనే చెల్లెలి ఎమ్‌సెట్ రిజల్ట్స్ వచ్చాయి.

ఆరోజు నిజంగానే నా జీవితంలో మర్చిపోలేని రోజు.

సాధారణంగా ఆ సమయానికి ఇంట్లోవాళ్ళెవరూ లేవరు.

పేపర్లో ఫలితాలు చూసేసరికి నాలో కొద్దిగా టెన్షన్ మొదలైంది. వెంటనే చెల్లెలి గదిలోకి వెళ్ళాను. వసుంధర హాయిగా నిద్రపోతోంది. నిజానికి దాని మనస్తత్వమే అంత. ఏ పనైనా నూరుశాతం కష్టపడి పని చేస్తుంది. ఫలితం గురించి పెద్దగా ఆందోళన చెందదు.

చెల్లాయి గదిలోకి వెళ్ళి హాల్‌టికెట్ కోసం వెతికాను. ఓ అరగంటసేపు శ్రమపడితే హాల్‌టికెట్ దొరికింది.

గబగబా హాల్లోకి వచ్చి లైటు వేసుకుని చెల్లాయి నెంబరుకోసం వెతికాను. నా జీవితంలో నేను ఎప్పుడూ అంత టెన్షన్ పడలేదు.

వసుంధర ఎంత కష్టపడి చదివిందో నాకు తెలుసు.

ఆడంబరాలకు, గొప్పలకు డబ్బులు మంచినీళ్ళల్లా ఖర్చుపెట్టే నాన్న చెల్లాయి మెడికల్ ఎంట్రన్స్‌కు కోచింగ్ తీసుకుంటానంటే వీల్లేదనేశారు. అప్పుడు దాన్ని ఊరడించి ఫీజు నేనే కట్టాను. దానికి తగ్గట్టే అది రాత్రింబవళ్ళు కష్టపడి చదివింది. డాక్టరు కావాలని ఎన్నో కలలు కంది. అందుకే నాకింత టెన్షన్‌గా ఉంది.

చిట్టచివరకు వసుంధర నెంబరు కన్పించింది.

అదురుతున్న గుండెతో మనసులో ఒకసారి దేవుడ్ని తలుచుకుని నెంబరు చూశాను. ర్యాంకు చూసేసరికి నా ఆనందం అంబరమైంది.

వసుంధరకు ముప్పైవ ర్యాంకు వచ్చింది.

ఇక ఆగలేకపోయాను.

గబగబ వెళ్ళి చెల్లాయ్‌ని నిద్రలేపాను.

రాత్రిళ్ళు ఎంతసేపైనా మేల్కొంటుంది కానీ తెల్లవారుఝామున మాత్రం చచ్చినా లేవదు.

నేను నిద్ర లేపేసరికి "ఏంటన్నయ్యా! మంచి నిద్ర పాడుచేశావ్?" అంది కళ్ళు నులుముకుంటూ.

లైటువేసి పేపరు చేతికిచ్చాను.

"ఉండన్నయ్యా! ఇప్పుడంత అర్జంటుగా పేపరు చదవకపోతే ఏమిటి? తెల్లారాక చదువుతానులే" అని పడుకోబోయింది.

బలవంతంగా చెయ్యిపుచ్చుకుని కూర్చోబెట్టి, ముఖంమీద కొద్దిగా నీళ్ళు చల్లాను.

ఈ గొడవకు అమ్మ కూడా నిద్రలేచింది. "ఏంట్రా... పొద్దున్నే ఏంటి నీ గొడవ? నువ్వు పడుకోవు, మమ్మల్ని పడుకోనివ్వవు" అంటూ విసుక్కుంది.

చెల్లెలకి పేపరు ఇచ్చాను.

'ఇక్కడ చూడు' అన్నట్టు చెయ్యి పెట్టి చూపించాను.

దాంతో దాని నిద్రమత్తు ఎగిరిపోయింది. గభాల్న నన్ను కౌగలించుకుంది.




"అన్నయ్యా! నాకు... నాకు ర్యాంక్ వచ్చింది. నేను... నేను డాక్టర్ని అయిపో యినట్టే ఇక..." సంతోషంతో దానికి మాటలు తడబడ్డాయి.

అవునన్నట్టుగా తలాడించాను.

సంతోషంగా దాన్ని దగ్గరకు తీసుకు న్నాను.

"ఏమైందర్రా! మీ అన్నాచెల్లెళ్ళు ఎవ్వర్నీ పడుకోనివ్వరా? " అరిచింది అమ్మ.

"నాకు మెడిసిన్‌లో సీటొచ్చిందమ్మా" అంది వసుంధర.

"నిజంగా..." అమ్మ నిద్రమత్తు ఠపీమని ఎగిరిపోయింది.

"అవునమ్మా! ఇదిగో పేపరు చూడు" అంటూ అమ్మచేతికి పేపర్ ఇచ్చి తన నెంబరు వున్నచోట చూపుడువేలితో చూపిం చింది వసుంధర.

"నిజమేనే... పోనీలే నీకష్టాన్ని ఆ దేవుడు గుర్తించాడు" చేతులు జోడించి దణ్ణంపెడుతూ అంది అమ్మ.

"దేవుడు కాదమ్మా! ఈ దేవుడు..." అంది వసుంధర నావైపు చూపిస్తూ,

"ఆరోజు అన్నయ్య ఫీజు కట్టకపోతే నాకు ఇంతమంచి ర్యాంకు వచ్చేదేకాదు" అంటూ నా దగ్గరకు వచ్చింది. "థాంక్స్ అన్నయ్యా! నిజంగా నీ మేలు ఎప్పటికీ మర్చిపోలేను" అంది.

"పిచ్చిపిల్లా! మనలో మనకు ఋణాలు ఏమిటి? చెల్లెల్ని చదివించడం అన్నయ్యగా నా బాధ్యత" అని అందామనుకున్నాను. నేనెప్పుడైనా మాట్లాడాలని ఉద్వేగానికి లోన వుతుంటాను. కానీ నోట్లోంచి మాటరాదు. నాలేమితనం నన్ను వెక్కిరిస్తుంది.

అందుకే నవ్వి వూరుకున్నాను.

"వసూ! వెళ్ళి మీ నాన్నగారికి చెప్పు.. ఈలోగా అందరికీ మంచి కాఫీ పెడ తాను..." అని అమ్మ లేవబోతుంటే

"నువ్వుండమ్మా! నేను కాఫీ కలుపుతాను" అని సైగచేసి వంటింట్లోకి వెళ్ళాను. వసూ ఈ సంగతి నాన్నగారికి చెప్పినట్టుంది.

ఆయన ఎవరెవరికో అప్పుడే ఫోన్లు చేసేస్తు న్నారు.

వాళ్లంతా సందడిగా మాట్లాడుకుంటు న్నారు.

ఉన్నట్టుండి నాన్నగారు "ఇదంతా మన శీను పెళ్లాం అదృష్టం. ఆ అమ్మాయిది అదృష్ట జాతకమని నేనంటే మీరంతా కొట్టి పడేసారు. ఇప్పుడేమంటారు? ఒప్పుకుం టారా? " అన్నారు నాన్న.

పొద్దున్నే ఆయనతో వాదన ఎందుకని అందరూ మౌనం వహించారో లేక నాన్న చెప్పిన మాటలు నిజమని నమ్మారో తెలీదు గానీ మిగతా వారెవ్వరూ నాన్నతో వాద నకు దిగలేదు.

నాన్నగారు ఆయన వియ్యంకుడికి కూడా ఫోన్‌చేసి చెప్పారు.

ఆరోజంతా ఇంట్లో పండగ వాతావర ణాన్ని తలపించింది.

వసుంధరకు మెడిసిన్ సీటు రావడంతో నా బాధ్యత మరింత పెరిగినట్టు అనిపిం చింది.

పార్క్‌లో కూర్చుని ఎన్నాళ్లని బొమ్మలు గీయను?

ఈమధ్య వర్క్ కొంచెం డల్‌గానే వుంది.

ఇదివరకులా జనం ఉత్సాహంగా బొమ్మలు గీయించుకోవడంలేదు.

ఏదో కొంత ఆదాయం వస్తోందిగానీ చెల్లెల్ని మెడిసిన్ చదివించేందుకు, చక్కటి సంబంధం చూసి పెళ్ళిచేసేందుకు ఆ డబ్బు సరిపోదు.

ఏంచేయాలి?

ఏదైనాసరే కాంక్రీట్‌గా ఆలోచించాలి. కానీ ఈ రంగంలో అలాంటి కాంక్రీట్ ఆలో చనలు చేయడం కుదరని పని.

నిజానికి మొదట స్కూల్లో ఉద్యోగం కోసం వెళ్లాను.

అక్కడ్నించి లావణ్య తాతగారు తన మనవరాలికి పెయింటింగ్ నేర్పించమని

అడిగారు. ఒప్పుకున్నాను.

ఈ నేపథ్యంలో ఓ వారంరోజులు సెలవలు వచ్చాయి. పార్క్‌కి వెళ్ళి కూర్చుని బొమ్మ వేసుకుంటున్న నా దగ్గరకు బాల్ వచ్చి పడటం, ఆ బాల్ తీసుకోవడానికి వచ్చిన పాప తన బొమ్మ గీయమనడం, ఆవిధంగా పార్క్‌లో కూర్చుని బొమ్మలు గీయడమన్న ఆలోచన రూపుదిద్దుకుంది.

అనంతరం క్యాలెండర్లు, పోస్టర్లు వేశాను.

ఇలా ఎప్పటికప్పుడు వర్క్ మార్చుకుంటూ వెళ్లాలి. కాంక్రీట్‌గా చేయడం అంటే ఓ స్కూలు పెట్టాలి. ప్రస్తుత పరిస్థితుల్లో అది సాధ్యంకాదు. మరి ఏంచేయాలి?

మరోపక్క తమ్ముడి పెళ్ళి దగ్గర పడింది.

నాన్నగారి చేతికి సమయానికి డబ్బు అందలేదు.

చివరకు ఒకరోజు నాన్నగారు, "సీతా పోనీ మన కోడలు వాళ్ళని డబ్బు పంపమని అడుగుదామా" అన్నారు.

అమ్మకి అరికాలి మంట నెత్తికెక్కింది. "ముందు కట్నం వద్దు. లాంఛనాలువద్దు, పెళ్ళిఖర్చులు కూడా మావే అని భేషజాలకు పోవడమెందుకు? అయినా ఇప్పుడు వాళ్ళని డబ్బు అడిగితే ఎంత అవమానంగా ఉంటుందో ఆలోచించారా? మనల్ని ఇంకా లోకువ కట్టేస్తారు వాళ్ళు..." అంది.

నాన్నకేం చేయాలో పాలుపోలేదు.

తమ్ముళ్ళందరికీ ఫోన్లు చేశారు. వాళ్లు తమ దగ్గర డబ్బు లేదన్నారు, ఉన్నా కూడా ఇవ్వరని నాకు తెలుసు. ఎందుకంటే డబ్బు ఇస్తే తిరిగి రాదని వాళ్ళకు తెలుసు.

మరీ తప్పనిసరి పరిస్థితులో అంతా కలిసి ఓ పదివేల దాకా సర్దగలమన్నారు.

పదివేలకోసం వాళ్ళని అడిగి నోరు ఖాళీ చేసుకోవడం ఎందుకు? వద్దులెమ్మని అమ్మ అంది.

"పోనీ మీ అన్నయ్యను అడుగుతావా?" అన్నారు నాన్న. నాన్నను ఆ స్థితిలో చూసిన నాకు ఎంతో జాలేసింది.

అమ్మ వెంటనే సమాధానం చెప్పలేకపోయింది. అమ్మా వాళ్ళ అన్నయ్యా, వదినా అవకాశం దొరికితే చాలు నాన్నను విమర్శిస్తుంటారు. చేతకానివాడని అంటుంటారు.

శ్రీనివాసుకి పెళ్ళిచేయడం వాళ్లెవరికీ ఇష్టంలేదు.

"ఉద్యోగం సద్యోగం లేనివాడికి పెళ్లేంటే? మీ ఆయనకేదో మతిపోయినట్టుంది" అని పెదమామయ్య ఆరోజు కేకలేశాడు కూడా.

"పోనీ ఆ చేసేదేదో వాళ్ళు ఇస్తామన్న కట్నం అయినా తీసుకుంటే కనీసం ఓ పచారి కొట్టయినా పెట్టుకునేవాడు కదా! ఆదర్శాలకుపోయి మీ ఆయన రెంటికిచెడ్డ రేవడిలా తయారవుతాడు చూస్తుండు" అని అరిచారు.

అలాంటిది ఇప్పుడు వెళ్లి అమ్మ వాళ్లను డబ్బు అడిగితే నాన్నను ఇంకా లోకువ చేసి మాట్లాడతారు.

పైగా పెద్దమావయ్యా డబ్బు విషయంలో చాలా ఖరాఖండిగా ఉంటాడు కూడా.

అందుకే అమ్మ సందేహించింది.

నాన్నగారు బయటకు వెళ్ళగానే సాధింపు మొదలుపెట్టింది. "మీ నాయన చేసే పనులన్నీ ఇలాగే వుంటాయిరా! ఇప్పుడు మా అన్నయ్యని డబ్బులడిగితే వాడు నోటికి వచ్చినట్లు మాట్లాడతాడు"

అమ్మ బాధ చూస్తుంటే జాలేసింది.

"నువ్వెవరిని డబ్బు అడగొద్దు. నేనే ధర్మారావుగారిని అడిగి తీసుకుంటాను" అన్నాను.

ఆ మాటతో అమ్మ ముఖం వెలిగిపోయింది. "ఆయన ఇస్తారంటావా?" అంది.

"ప్రయత్నిస్తానమ్మా" అన్నాను. అదే కాగితం మీద రాశాను.

రెండురోజుల తరువాత డబ్బులు తీసుకొచ్చి అమ్మచేతికిచ్చాను.

డబ్బు చూసేసరికి నాన్నగారికి ఉత్సాహం వచ్చింది. "మీ అన్నయ్యా ఏమీ అనకుండా




డబ్బిచ్చాడా? " అన్నారు నాన్న.
"నేనసలు అడిగితేకదా" అంది అమ్మ.
"మరి ఈ డబ్బు..."
"నా పెద్ద కొడుకు ఎవరినో అడిగి తీసుకొచ్చాడు..." అంటుంటే అమ్మ ముఖంలో గర్వం తొణికిసలాడింది.
"వాడినిచూసి ఎవరు అంత డబ్బిచ్చారు? " నాన్న కళ్లల్లోనేకాదు మాటల్లో కూడా ఆశ్చర్యం తొంగిచూసింది.
"ఎవరో ఇచ్చారు. ఆ సంగతులన్నీ మీకెందుకు? మీకు కావాల్సిన డబ్బు ఇదిగో..." అంది అమ్మ.
నాన్న మారు మాట్లాడలేదు.
మౌనంగా డబ్బులు తీసుకున్నారు.
ఆ తరువాత పనులన్నీ చకచకా పూర్తి అయ్యాయి.
పెళ్ళి ఇంక వారంరోజులే వుంది.
బంధువులందరూ వస్తున్నారు.
ఇంట్లో అంతా సందడి. కోలాహలం. అందరం ఊరు బయలుదేరి వెళ్లాం. విడిదింట్లో తమ్ముడ్ని పెళ్ళికొడుకుని చేశారు.
నిజంగానే పెళ్ళికొడుకుగా వాడ్ని చూస్తే ఎంతో ముచ్చటవేసింది.
పెళ్ళిరోజు అనుకుంటాను...
నేను విడిదింట్లో మేడమీద ఒంటరిగా నిలబడి పెళ్ళిసందడినంతా కుతూహలంగా గమనిస్తూ వున్నాను.
"అన్నయ్యా! ఈ విషయం విన్నావా" అంటూ వసుంధర పరిగెత్తుకొచ్చింది. మెట్లు ఎక్కడంవల్ల కాబోలు ఆయాసపడుతోంది.
"ఏమిటన్నట్టు చూశాను"
"నీకో శుభవార్త అన్నయ్యా! చెప్తే నాకేమిస్తావ్? " చిన్నపిల్లాడిని ఊరించినట్టుగా అంది.
"ఏంట్రా? " అని సైగచేశాను.
"ముందు ఇది చెప్పన్నయ్యా! నీకా శుభవార్త చెప్తే నాకేమిస్తావ్? " మళ్లీ తన ప్రశ్నను రిపీట్ చేసింది.
"ఏంకావాలి? " అని సైగచేశాను.
నన్నేమి అడగాలో దానికే అర్థం కాలేదనుకుంటాను. "సర్లే సమయం వచ్చినప్పుడు అడుగుతానులేకానీ ఇప్పుడు మాత్రం నీకు చాలా ఇష్టమైన వ్యక్తిని చూపించబోతున్నాను. నాతోరా" అంటూ నా చెయ్యి పట్టుకుని తీసుకువెళ్లింది వసుంధర.
అంతగా నాకు ఇష్టమైన వ్యక్తి ఎవరో నాకు అర్థంకాలేదు. చాలుసేపు మ్యారేజ్ హాల్ అంతా తిప్పి ఓ గది దగ్గర నుంచోబెట్టి,
"ఒరేయ్! ఇక్కడే వుండరా... ఇప్పుడే వస్తాను..." అని రెండు అడుగులు
ముందుకు వేసి మళ్లీ వెనక్కి తిరిగి అంది "అన్నయ్యా! వెళ్లిపోకూడదు. అక్కడి నుంచి కదిలితే నామీద ఒట్టే..." అని ముందుకు వెళ్లిపోయింది.
నాకు చాలా చిరాగ్గా అనిపించింది.
ఎవరెవరో ఆడవాళ్లు వస్తున్నారు. వెడుతున్నారు. పెళ్లికూతురికి ఇచ్చిన గది కాబోలు... ఆ గది ముందు నిలబడడం అంటే... పోనీ వెళ్లిపోదామా అంటే చెల్లాయ్ ఒట్టేసిందాయె.
దాదాపు అయిదునిమిషాలు క్షణమొక యుగంగా గడిచింది నాకు. అంతలో వసుంధర వస్తూ కనిపించింది.
'హమ్మయ్య' అనుకున్నాను.
వసుంధర పక్కన ఎవరో ఉన్నారు. దూరానికి ఎవరో స్పష్టంగా అర్థం కావడం లేదు. కానీ బాగా తెలిసిన వ్యక్తి అనే అనిపిస్తోంది.
వసూవాళ్లు నన్ను సమీపిస్తున్నకొద్దీ నా హృదయం ఆనందం, ఉద్వేగం, సంభ్రమం, ఆశ్చర్యాలతో కొట్టుకోసాగింది.
"అన్నయ్యా! ఇదిగో నీకిష్టమైన వ్యక్తి ఈవిడే. ఎవరో గుర్తుపట్టకలవేమో చూడు.." అంది వసుంధర.
ఆవిడ నావంక చిరునవ్వుతో చూస్తోంది.
అవే కళ్లు...




ఆ కళ్లు వెన్నెల లోగిళ్లు...

ఆ కళ్లు ప్రశాంత మానససరోవరాలు....

ఆ కళ్లు మమతకు ఆనవాళ్లు...

"శారదాంటీ..!" నా పెదవులు అస్పష్టంగా ఉచ్ఛరించాయి. శబ్దం పైకి రాకపోయినా మనసు పలికింది.

"ఏం కృష్ణా! గుర్తున్నానా?.." అని అంటోంటే గభాల్న ఆంటీ చెయ్యి పట్టుకుని కళ్లకు అద్దుకున్నాను.

నా కళ్లు నీళ్లతో నిండిపోయాయి.

భగవంతుడా! నువ్వు చాలా నిర్దయుడవు. నాకు మాట ఇవ్వకుండా చాలా అన్యాయం చేశావు. నాకే మాటలొచ్చివుంటే ఆంటీతో ఎన్నో మాట్లాడివుండేవాణ్ణి. అని మనసులో ఎలుగెత్తి అరిచాను.

ఆతర్వాత ఆంటీ, నేను చాలా సేపు మాట్లాడుకున్నాం. నేనేం చేస్తున్నానో అంతా వివరంగా ఆంటీకి చెప్పాను.

ఆవిడ చాలా ఆనందించారు.

"అన్నయ్యా! నీకొక విషయం తెలుసా? ఇప్పుడు ఆంటీవాళ్లు మనకు బంధువులవుతారు" అంది వసుంధర.

నేను అపనమ్మకంగా ఆంటీవంక చూశాను.

అవునన్నట్టు తలాడించారు ఆంటీ.

"శాంతి... అదే నీ మరదలు మా అక్కయ్య కూతురు. ఆవిధంగా నేను కూడా నీకు అత్తగారినే అవుతాను" అన్నారు ఆంటీ.

"అన్నట్టు మీకో అమ్మాయి ఉందికదండీ" ఆరిందాలా అడిగింది వసుంధర.

"అవునమ్మా అది కూడా పెళ్లికి వచ్చింది. ఇక్కడే ఎక్కడో ఉండి ఉంటుంది" అన్నారు ఆంటీ.

ఈలోగా ఏదో పని ఉండి అమ్మ అటుగా వచ్చింది.

"అమ్మా, అమ్మా! ఒకసారి ఇటురా..." అని పిల్చింది వసుంధర.

అమ్మ మా దగ్గరకు రాగానే ఆంటీని చూపించింది. అమ్మ ఆంటీ చేతులు పట్టుకుని కృతజ్ఞతలు చెప్పింది. "ఆరోజు మీరు సరదాగా మా అబ్బాయికి పెయింటింగ్ నేర్పించారు. ఈరోజు అదే మా అందరి కడుపులు నింపుతోంది. ఒకప్పుడు మిమ్మల్ని ఎంతో అపార్థం చేసుకున్నాను. నన్ను క్షమించండి...." మనస్ఫూర్తిగా అంది అమ్మ.

"అయ్యో! అంత పెద్దమాటలెందుకండీ? కృష్ణ ప్రయోజకుడయ్యాడు. నాకు చాలా ఆనందంగా ఉంది..." వారించారు ఆంటీ.

అంతలో "అమ్మా" అంటూ వచ్చిందో అమ్మాయి.

అచ్చంగా శారదాంటీలానే ఉంటుంది.

ఎప్పుడో చిన్నప్పుడు చూశాను. ఎంత పెద్దదయిపోయింది?

"మా అమ్మాయి అరుంధతి" అన్నారు ఆంటీ.

ఆ అమ్మాయికి మేమెవ్వరం తెలీదనుకుంటాను.

"అరుంధతీ! నీ చిన్నప్పుడు మనం వాళ్లింటి దగ్గర అద్దెకుండేవాళ్లం. ఇతను కృష్ణ. బాగా బొమ్మలు వేస్తాడు. తను వసుంధర. ఆవిడ వాళ్ల మదర్..." ఒక్కొక్కరినీ పేరుపేరునా పరిచయం చేశారు ఆంటీ.

"నమస్కారమండీ" చేతులు జోడించింది అరుంధతి.

నాచిన్నప్పటి నేస్తమే అయినా ఎందుకో గానీ తలెత్తి చూడటానికి బిడియం అడ్డొచ్చింది.

"అమ్మా! పెద్దమ్మ పిలుస్తోంది" అంది.

"మీ అమ్మాయి అచ్చంగా నీ నోట్లోంచి ఊడి పడ్డట్టే ఉంది శారదా! బంగారు బొమ్మలా ఉంది. నాకే కనుక మరో అబ్బాయి ఉంటేనా మీ అమ్మాయిని బలవంతంగానైనా లాక్కెళ్లిపోయి కోడల్ని చేసుకునేదాన్ని..." అంది అమ్మ.

"ఏం? ఇప్పుడు మాత్రమేమైంది. మన

కృష్ణకు అరుంధతిని పెళ్లి చేస్తే సరి..” అన్నారాంటీ.

“అమ్మా!” చిన్నగా పిలిచింది అరుంధతి. ఆ సంభాషణ ఆమెకి నచ్చనట్టుంది. అమ్మ ముఖం అప్రసన్నంగా మారిపోయింది.

“వస్తానండీ. అక్క ఎందుకో పిలుస్తోందిట.. మళ్లీ కలుస్తాను” అని అమ్మకి చెప్పి “వెళ్లొస్తాను కృష్ణా! మళ్లీ మాట్లాడుకుందాం” అన్నారు. “వస్తాను వసుంధరా” అని పేరు పేరునా చెప్పి కదిలారు.

ఆ అమ్మాయి కూడా “వస్తానండీ” అని చెప్పింది. ఆ చెప్పడంలో మర్యాద తప్పితే ఎలాంటి ప్రత్యేకతా లేదు.

“అమ్మా! ఆ అమ్మాయి చాలా బావుంది కదూ” అంది వసుంధర.

“అవును. శారద చాలా అదృష్టవంతురాలు. అరుంధతి బ్యాంకులో పనిచేస్తోందిట” అంది అమ్మ.

శారదాంటీ ఎందుకు అదృష్టవంతురాలో నాకు అర్థంకాలేదు. వాళ్ల అమ్మాయి అందంగా ఉంటుంది కాబట్టి అదృష్టవంతురాలా? లేక ఆ అమ్మాయి బ్యాంక్‌లో ఉద్యోగం చేస్తున్నందుకా?

“అమ్మా అరుంధతిని మన కృష్ణన్నయ్యకు చేసుకుంటే బావుంటుంది కదూ?”

“ఎందుకు బావుండదూ? నా కొడుక్కి ఏంతక్కువ? మాట లేదనే కానీ కృష్ణలాంటివాడు వాళ్లకెక్కడ దొరుకుతాడు?”

అమ్మ అంటుంటే నాకు నవ్వొచ్చింది. తల్లికి పిల్లలమీదుండే మమకారం ఆవిడ్ని అలా మాట్లాడిస్తోంది కానీ నిజానికి నేను అరుంధతికి తగిన వాడినా?

ఆ అమ్మాయి ఎక్కడ? నేనెక్కడ?

చక్కని చుక్క, సుగుణాల గని, బంగారు బొమ్మలా ఉండే అరుంధతికి మూగవాడిని పెళ్లాడాల్సిన అవసరం ఏముంది?

కానీ అమ్మ ఆ మాట అనగానే నా మనసు విచిత్రంగా స్పందించింది. మనసులో కోటి వీణలు మీటినట్టుగా ఉంది.

ఆశ్చర్యం ఏమంటే నేను శారదాంటీని, వాళ్లమ్మాయినీ మర్చిపోలేదు.

ఆ అమ్మాయికి మాత్రం మేమెవ్వరమూ గుర్తులేదు.

నిజంగా గుర్తులేదో లేక గుర్తుంచుకోవాల్సిన అవసరం ఏముందని అనుకుంటోందో తెలీదుగానీ మమ్మల్నెవ్వరినీ తను పెద్దగా పట్టించుకోలేదు.

పెండ్లి సమయంలో కూడా హడావుడంతా అరుంధతిదే...

ఆ అమ్మాయి అలా పెళ్ళిపందిరంతా సందడిగా తిరుగుతుంటే తన మీంచి కళ్ళు తిప్పుకోలేకపోయాను.

పెళ్ళితంతు ముగిసింది.

అమ్మ అన్నట్టుగానే మిగిలిన అల్లుళ్ళను ఎంతో గౌరవంగా చూశారు కానీ తమ్ముడ్ని అంతగా గౌరవించలేదు.

పెట్టుపోతల దగ్గర, అతిథి మర్యాదల దగ్గర ఆ తేడా స్పష్టంగా కన్పించింది.

కట్నం తీసుకోకుండా చేసుకుంటున్నందుకు తమను నెత్తిన పెట్టుకుని చూసుకుంటారని నాన్న అనుకున్నారు. కానీ అమ్మ అన్నట్టు లేనింటి అమ్మాయిని చేసుకుని వుంటే అలాగే చూసేవారేమోకానీ ఉన్నింటి అమ్మాయి దగ్గర కట్నం వద్దనేసరికి మాలో ముఖ్యంగా పెళ్ళికొడుకులో ఏదోలోపం వుందని అనుకుంటున్నారు. లోపం వున్న అబ్బాయికి కూతురునెలా ఇచ్చారు అని అనుమానం రావచ్చు. ఓపక్క కుజదోషం మరోపక్క అమ్మాయి మామూలుగా వుంటుంది. వయసెక్కువ అందువల్ల ఎవరో ఒకరికి అన్నట్టు పెళ్ళిచేసేశారు.

నాన్న తొందరపాటుతనంవల్ల ఈ పెళ్ళి జరిగిందిగానీ తమ్ముడికి ఏరకంగాను అమ్మాయి జోడీ కాదు.

కానీ ఇప్పుడేమనుకుని ఏమిటి ప్రయోజనం?

అందరితోపాటు తమ్ముడు, మరదలు నా

కాళ్లకు కూడా నమస్కరించారు.

మౌనంగానే ఆశీర్వదించాను.

నేను కొన్న వెండి కుంకుమ భరిణి అమ్మాయి చేతిలో పెట్టాను.

"అన్నీ సవ్యంగా వుంటే ఈ పాటికి కృష్ణకు కూడా పెళ్ళి చేసేవాళ్లం" అంటూ అమ్మ కళ్ళు ఒత్తుకుంది.

అప్పగింతలప్పుడు అమ్మాయిని అప్ప గిస్తూ పెళ్ళికూతురి తల్లిదండ్రులు ఏడుస్తా రని అంటారు. కానీ వాళ్ళేమీ ఏడవలేదు. ఫీలింగ్స్ తక్కువా లేక అంతమంది అమ్మా యిలుండటం వలన అలవాటైపోయిందా?

పెళ్ళికూతురితోపాటు అరుంధతి, శార దాంటీ కూడా మా ఇంటికి వచ్చారు.

ఇంట్లోకి అడుగుపెట్టగానే ఆంటీ, "ఏది కృష్ణా! నీపెయింటింగ్స్ చూపించు..." అంది.

నా గదిలోకి తీసుకువెళ్లాను.

మంచం కిందనుంచి ఓ ట్రంకుపెట్టె బయటకు తీశాను.

అందులోంచి నా పెయింటింగ్స్ అన్నీ తీసి చూపించాను. అన్నింటికీ ఫ్రేమ్ కట్టిం చాను. మొన్నటివరకూ హాల్లో గోడకి ఉండేవి. తమ్ముడి పెళ్ళికదా అని ఇంటికి రంగులు వేయించాం. ఆ టైంలో తీసి లోపల దాచాను. మళ్ళీ గోడకు తగిలిం చడం కుదరలేదు.

ఒక్కో చిత్రం చూస్తూ ఆంటీ ఎంతో మురిసిపోయారు.

ఆంటీని పిలుస్తూ వచ్చిన అరుంధతితో "కృష్ణ చూడు... ఎంత బాగా బొమ్మలు వేశాడో... నువ్వూఉన్నావెందుకు?" అన్నారు.

"పో అమ్మా! ఆ బొమ్మలు గీయడం అంటే నాకెంతో బోర్ అని నీకు తెలుసు కదా" అంది అరుంధతి.

తల్లిపక్కన కూర్చుని ఒక్కో చిత్రాన్ని నిశి తంగా చూసింది. "కలర్ కాంబినేషన్ చాలా అద్భుతంగా ఉందికదమ్మా" అంది.

అవునని తలాడించారు ఆంటీ.

"మీరు నాకో హెల్ప్ చేస్తారా కృష్ణా?" అంది అరుంధతి.

ఆమె నోటివెంట నా పేరు వింటున్నప్పు డల్లా నా పేరు ఇంత అందంగా ఉంటుందా! అని అన్పిస్తుంటుంది.

"మీరెప్పుడైనా ఫాబ్రిక్ పెయింట్ చేశారా?"

"ఓ... చేశాడు" రిప్లై ఇచ్చింది వసుంధర.

దానికి అరుంధతి ఎంతగా నచ్చిందంటే ఆమె వెనకే తిరుగుతోంది. అరుంధతి తల వెనక్కి తిప్పి చూసి, "నిజమా!" అంది.

"అవును. చాలా బాగా వేస్తాడు. ఉండు... వస్తాను" అంటూ పరుగెత్తింది. అంతెందుకు పరిగెత్తుతూ వెళ్ళిందో నాకు తెలుసు.

వసుంధర ధరించే పరికిణీలు, ఓణీలు, డ్రస్సులు అన్నీ నేను డిజైన్ చేసినవే. దాని డ్రస్సులన్నీ తీసుకొచ్చి కుప్ప పోసింది.

ఒక్కో డ్రస్ గురించి అరుంధతికి ఎక్స్ ప్లైన్ చేసింది. వసుంధర చెప్పింది వింటుంటే అసలే పెద్దవైన ఆ కళ్ళు విభ్రాం తితో మరింత పెద్దవయ్యాయా అన్పిం చింది.

మొత్తం గంటసేపు వసు దాని డ్రస్సుల గురించి చెప్తూనేవుంది.

అంతా విన్నాక "కృష్ణా! యు ఆర్ రియల్లీ గ్రేట్" నా చెయ్యి పట్టుకుని వూపేసింది అరుంధతి.

స్త్రీ తాలూకు ప్రథమ స్పర్శ నన్ను తాకేస రికి నా మనసు, శరీరం కూడా ఏదో తెలీని అనుభూతికి లోనయ్యాయి.

నేను ఇలా ఆలోచించడం తప్పేకావచ్చు అరుంధతి మనసులో స్నేహం తప్ప మరో అభిప్రాయం లేకపోవచ్చుకానీ తను అలా నన్ను స్పృశించగానే నా మనసులో కలిగిన ఫీలింగ్ మాత్రం అదే.

"కృష్ణా! నేను వెళ్లేలోపు నా శారీమీద పెయింట్ చేసి ఇస్తారా?" గోముగా అడి

గిందామె.

అరుంధతికి ఎప్పుడు, ఎక్కడ, ఎవరితో ఎలా మాట్లాడాలో బాగా తెలుసు. ఎక్కడ గారాబాలు పోవాలో, ఎక్కడ కోపం ప్రదర్శించాలో, ఎక్కడ రిక్వెస్టింగ్‌గా అడగాలో, ఎక్కడ ఆర్డర్లు వేయాలో ఎవరైనా అరుంధతి దగ్గర నేర్చుకోవాల్సిందే.

"అలాగే" అన్నట్టు తలాడించాను.

నేను అంగీకరించగానే పరిగెత్తినట్టే వెళ్లింది. ఇలా వెళ్లి అలా వచ్చేసింది.

పింక్ కలర్ శారీ అది. ఆ కలర్ చూడగానే ఏ ఆర్టిస్ట్‌కైనా తనకు వచ్చిన విద్యనంతా ప్రదర్శించాలనుకుంటాడు. నాకూ అలాగే అన్పించింది.

ఇంట్లో సత్యనారాయణ వ్రతం అదీ, అంతా హడావుడిగా ఉన్నారు. నాతో మాట్లాడే తీరిక ఎవ్వరికీ లేదు. దాంతో పెయింట్ బాటిల్స్ అన్నీ తీసుకు వెళ్లి మేడ మీద కూర్చుని చీరమీద పెయింటింగ్ మొదలుపెట్టాను.

నేను ఏ పని చేసినా పూర్తి అంకితభావంతో చేస్తాను. మొత్తం పూర్తయేసరికి టైమ్ సాయంత్రం నాలుగు గంటలయ్యింది.

చీర మేడమీదే ఆరబెట్టి నేను క్రిందకు వచ్చాను. అప్పుడే అందరి భోజనాలు పూర్తయినట్టున్నాయి. ఆంటీ నన్ను చూడగానే "పద కృష్ణా! భోంచేద్దాం" అన్నారు.

నేను, అమ్మ, శారదాంటీ, వసుంధర, అరుంధతి మేము మాత్రమే మిగిలాం. అందరం భోజనాలకు కూర్చున్నాం.

భోజనం చేస్తున్నంతసేపూ పెళ్లివారు తమను ఎలా అవమానించారో అమ్మ చెప్తూనే ఉంది.

ఆంటీ ఏమని సమాధానం చెప్తుంది?

అటు సొంత అక్కయ్య కుటుంబమైపోయె. అందుకే ఆంటీ మౌనంగా వింటూ ఉండిపోయారు.

భోజనం చేశాక వసుని పిలిచి చీరమీద పెయింటింగ్ పూర్తయ్యిందని అరుంధతిని తీసుకువెళ్లి చూపించమని చెప్పాను.

సాయంత్రం ఆరుగంటలవుతుండగా ధర్మారావుగారింటికి బయలుదేరాను. బయట మాకు చాలా ప్లేస్ ఉంటుంది. అక్కడ అటూఇటూ దారి వదిలి బాటకు ఇరుపక్కలా మొక్కలు నాటించాను. మొక్కల మధ్యలో ఓ సిమెంటు గట్టు ఉంటుంది.

మా మరదలు, మరికొందరు ఆడవాళ్లు అక్కడ కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

"మీ బావగార్ని చూస్తుంటే నాకు భయమేసిందే శాంతీ! కాస్త జాగ్రత్తగా ఉండు" అందో అమ్మాయి.

"ఏం? ఏం చేశాడేంటి? " కుతూహలంగా అడిగింది నా మరదలు.

"ఏమోనే బాబు! ఆ చూపులు, ఆ మనిషి భయమేసిందనుకో" అంటోందోమ్మాయి.

"నీ ముఖం! మా బావగారికేంటే మాటే లేదుగానీ మంచి డ్రస్సులు వేసుకుంటే రాజాలా ఉంటాడు. మా ఆయన కన్నా బావగారే నాకు నచ్చారు" అని నవ్వింది శాంతి.

"కొంపదీసి ముందు ఆయన్నిగానీ చూసుంటే ఆయన్నే పెళ్లి చేసుకునేదానివా!" ఆరాతీసింది మరో అమ్మాయి.

"ఊరుకోండే ఏంటా మాటలు" కసిరింది వాళ్లల్లో కొంచెం ఎక్కువ వయసున్న ఆవిడ.

నవ్వొచ్చింది... వాళ్ల మీద జాలేసింది కూడా!

నరంలేని నాలుక అంటారు. ఈ మనుషులు ఆ మాటను సార్థకం చేస్తున్నట్టుగా ఎప్పుడు ఏం మాట్లాడతారో వారికే తెలీదు.

ధర్మారావుగారింటివైపు నడిచాను.

స్వీట్స్ అన్నీ తీసుకు వెళ్లాను.

"చాలా రోజులకు వచ్చావయ్యా" అన్నారాయన.

"పది రోజులే అయ్యిందండీ!" అని సైగ





చేశాను.

ఇద్దరం నవ్వుకున్నాం.

శారదాంటీ తర్వాత నాకు ఎంతో సపోర్ట్ ఇచ్చిన వ్యక్తి ధర్మారావుగారు.

నా మనసులో మెదులుతున్న ఆలోచనను ధర్మారావుగారి ముందుంచాను.

"దాని వలన పెద్దగా ప్రయోజనముండ దేమో" సందేహం వెలిబుచ్చారాయన.

"ఇవ్వాళ రేపు చాలామంది ఆడవారు ఈ ఫ్యాబ్రిక్ పెయింటింగ్ అదీ చేస్తున్నారు. దీనివలన నీకు పెద్దగా ఆదాయం ఉండక పోవచ్చు" అన్నారు.

నాక్కూడా అదే నిజమన్పించింది.

కానీ ఉదయం నుంచి సాయంత్రం అయిదు గంటలవరకు ఖాళీగా ఉంటున్నానుకదా! ఈ సమయంలో ఏదైనా చేయాలన్నది నా ఉద్దేశ్యం. ఆ విషయమే ఆయనకు చెప్పాను.

"చూద్దాం... స్కూల్లో టీచర్స్‌కు కూడా ఈ విషయం చెప్పి చూస్తాను" హామీ ఇచ్చారు ధర్మారావుగారు.

ఆయన ఏదైనా ఓ విషయం సీరియస్‌గా తీసుకున్నారంటే దాని అంతు తేల్చేదాకా నిద్రపోరు. ఆయనకు మనం ఏదైనా అప్పగిస్తే ఆ తర్వాత ఎంతో నిశ్చింతగా ఉండచ్చు.

నేను ఇంటికి వచ్చేసరికి రాత్రి 9 గంటలయ్యింది.

గుమ్మంలోనే ఎదురయ్యింది అరుంధతి.

నేను కొంచెం ఆశ్చర్యపోయాను.

"కృష్ణా! మీకోసమే ఎదురు చూస్తున్నాను" అంది.

ఆ అమ్మాయి నన్ను కృష్ణ అని పిలిచిన ప్రతిసారి నా హృదయంలో ఏదో తెలీని పులకింత కలుగుతుంటుంది.

నా కోసం ఎందుకు ఎదురు చూడటం అన్నట్టుగా ముఖం పెట్టేనేమో,

"ఏం లేదు. మీరు చాలా చాలా బాగా పెయింట్ చేశారు. ఎప్పుడెప్పుడు ఆ చీరని కట్టుకుందామా అని ఉంది" అంది.

చీరెల విషయంలో ఆడవారి ఆత్రుత గురించి నాకు తెలుసు. అరుంధతి కూడా ఇందుకు మినహాయింపు కాదంటే చిన్నగా నవ్వొచ్చింది.

ఈలోగా వసుంధర వచ్చింది.

"అన్నయ్యా! నాకు అప్పుడే పది చీరలు ఆర్డర్లు వచ్చాయి. మరి పని ఎప్పుడు ఆరంభిస్తావో" అంది.

చేతిలో ఉన్న పూల పొట్లం చెల్లెలికిచ్చాను. గత నాలుగైదు ఏళ్లుగా బయటకు వెడితే వచ్చేటప్పుడు పూలు తెచ్చి అమ్మకు, చెల్లెలికి ఇస్తుంటాను.

చెల్లెలు పూలు తీసి మాలను రెండు సగాలు చేసింది. ఒక మాల తను తీసుకుని మరొకటి అరుంధతికిచ్చింది.

"అన్నట్టు కృష్ణగారూ! నా చీర చూసి మా వాళ్లెంతో అడుగుతున్నారు. కానీ ఊరికే వేసివ్వకండి. ఆ ముఖాలకు చీర విలువ తెలీదు" అంది అరుంధతి.

మరోసారి నవ్వి లోపలికి వెళ్లిపోయాను.

బంధువులెందరు వచ్చినా అమ్మ మాత్రం నా గది నాకు ఉంచుతుంది. అదో సుఖం. లేదంటే ఆ ప్లాస్టిక్ పలకరింపులు, నవ్వులు మనవల్ల కాదు. బట్టలైనా మార్చుకోకుండా మంచానికి అడ్డంగా పడుకున్నాను. ఎందుకో ఒకసారిగా తీవ్రమైన స్థబ్దత నన్ను ఆవరించింది. ఎందుకు అంటే బహుశా నేను కారణం చెప్పలేకపోవచ్చు

అలా ఎంతసేపు ఉండిపోయానో "అన్నయ్యా" అంటూ వసు వచ్చి లేపేదాకా నాకు మెలకువే లేదు.

ఇప్పుడు కొంచెం నా మనసు నెమ్మదించింది.

"భోజనం చేద్దాం రా" అంది వసు.

ఇక్కడికి తీసుకొచ్చేయ్" అని సైగ చేశాను.

"సర్లే. ఉండు వస్తాను" అని అది వెళ్లింది.



పది నిమిషాల తర్వాత వసు భోజనం తీసుకొచ్చింది. నా భోజనం పూర్తి అయ్యేవ రకు అరుంధతి గురించి చెప్తూనే ఉంది. వసుకి అరుంధతి ఎంతగానో నచ్చిందని వసు ముఖం చూస్తుంటే అర్థం అవుతోంది.

ఏదో నాలుగు మెతుకులు తిని, చెయ్యి కడుక్కున్నాను. వసు కంచం తీసుకుని వెళ్లి పోయింది. తను వెళ్లగానే లేచి వెళ్లి గది తలుపు వేసేశాను. నిస్సత్తువగా మంచం మీద వాలిపోయాను.

★ ★ ★

ఓ వారం రోజులపాటు చీరెల మీద పెయింట్ చేయడంతో పగలంతా గడిచిపో యింది.

ఈ విషయం గురించి చెల్లెలితో మాట్లాడాను. చెల్లాయ్ వెళ్లి నాలుగు చోట్ల విచారించి వచ్చింది. వాళ్ల దగ్గరి నుంచి ఆర్డర్స్ కూడా తెచ్చింది. అమ్మ కోసం వచ్చిన చుట్టుప క్కల వాళ్లు కూడా ఆర్డర్ చేశారు. ఆవిధంగా నాకు పగ లసలు తీరికే ఉండటంలేదు. కళాకా రుడు ఎప్పటికప్పుడు తను చేసే పనిలోనే వైవిధ్యం చూపుతుండాలి. లేదంటే కొన్నాళ్లికి తన కళపట్లే విసుగొచ్చేస్తుంది. అందుకే కొన్నాళ్లపాటు ఈ వర్క్‌ను నేను ఆసక్తిగానే చేయగలనన్పించింది.

ఈ విషయంలో పాపం చెల్లెలు చాలా కష్టపడింది. దానికి కూడా కాలేజీలో చేరడా నికి టైమ్ ఉండటంతో ఈ పని ఆసక్తిగా చేయసాగింది.



వారం రోజుల తర్వాత బంధువులంతా వెళ్లిపోయారు.

శారదాంటీ కోసం మంచి చీర కొని తెచ్చాను. అమ్మ ఆంటీకి చీరపెడుతూ ఆ విషయం చెప్తే ఆంటీ కళ్ల వెంట నీళ్లు తిరి గాయి. అరుంధతి వెళ్లిపోతున్నందుకు నాకెందుకో చాలా బాధగా అన్పించింది.

తను ఉన్న ఈ వారం రోజులలో నేను తనతో మాట్లాడింది చాలా తక్కువ. కానీ తను ఇంట్లో తిరుగుతుంటే నాకు చాలా బావుండేది. ఏదో తెలీని ప్రశాంతత. ఏదో తెలీని ధైర్యం. ఏదో తెలీని ఆత్మవి శ్వాసం ఇవన్నీ నేను ఫీల య్యాను.

నాకే కనుక దేవుడు మాట ఇచ్చి ఉంటే ఆ అమ్మాయిని ఎలాగో అలా పెళ్లికి ఒప్పించేవా డిని.

వాళ్లు వెళ్లాక నేను మామూలు మనిషిని కావడా నికి కొంత టైం పట్టింది.

కోడలు వచ్చాక అమ్మ పూర్తిగా స్వేచ్ఛా జీవి అయిపోయింది. క్యాంపుల మీద క్యాంపులు వేస్తోంది.

మొదట్లో శాంతి చాలా ఓర్పుగా ఉండేది. కానీ రానురాను ఆమెలో విసుగు, కోపం ఎక్కువయ్యాయి.

పెళ్లి అయితే తమ్ముడికి బాధ్యత తెలిసి వస్తుందని, వాడిలో మార్పు వస్తుందని నాన్న అనుకున్నారు. కానీ వాడు మాత్రం అలాగే ఉన్నాడు. బయటకు వెళ్లి నాలుగు చోట్ల విచారించి ఉద్యోగం సంపాదించుకుం దామన్న ఆలోచన వాడికి లేదు.

ఎప్పుడూ ఇంటిపట్టునే ఉండి, ఏవో కుళ్లు జోకులు వేస్తూ అందరినీ నవ్వించే ప్రయ




త్నంలో వాడు నవ్వుల పాలవుతున్నాడన్న సంగతి తమ్ముడు తెలుసుకోలేకపోతు న్నాడు.

ఇక అమ్మ... చిన్నతనంలోనే అమ్మకు పెళ్లయింది. అక్కడ్నించే కుటుంబ బాధ్య తలు నెత్తినపడ్డాయి. అదీగాక నాన్నగారు ఆమెను ఎక్కడికీ తీసుకు వెళ్లేవారు కాదు. దాంతో అమ్మకు ఇల్లే వైకుంఠం అయిపో యింది. ఎప్పుడైతే శాంతి ఇంట్లో అడుగుపె ట్టిందో అప్పుడు అమ్మకి ఆటవిడుపుగా అన్పించింది. ఇంకేముందీ వారానికి తక్కువ కాకుండా క్యాంపులకు వెళ్లడం మొదలు పెట్టింది. ఊళ్లోవున్న మావయ్యల ఇంటికి వెళ్లి రెండు మూడు రోజులకు కానీ తిరిగొచ్చేది కాదు.

ఇంకేముంది శాంతికి వంటింట్లో పనితోనే సరిపోయేది.

కొత్తగా పెళ్లైన అమ్మాయి భర్తతో నాలుగు చోట్లకి సరదాగా వెళ్లాలనుకుంటుం దని అమ్మ అనుకునేది కాదు. పనంతా ఆ అమ్మాయి నెత్తిన వేసేసేది.

ఎన్నో ఆశలతో కొత్త పెళ్లికూతురిగా ఇంట అడుగుపెట్టిన శాంతికి త్వరలోనే మా ఇంటి పరిస్థితి అంతా అర్థమైపోయింది. పనీపా టాలేకుండా సోంబేరిలా తిరిగే భర్త, గొప్పలు చెప్పే మావగారు, ఇంట్లో ఉండ కుండా పనంతా తననెత్తిమీద పడేసి బంధు వుల ఇళ్లకు వెళ్లికూర్చునే అత్తగారు, పిచ్చి బావగారు... ఇదీ ఆమె సంసారం.

మురళి, వసుంధరలు చిన్నవాళ్లు కాబట్టి వాళ్లమీద విసుక్కునేది కాదు కానీ మిగతా వారినందరిని పూచిక పుల్లల్లా తీసిపారే సేది.

అమ్మకు కోపం వచ్చేది. ఓ రోజు ఈ విషయంలో కొంచెం గొడవ జరిగింది.

"మేము కాబట్టి జాలిపడి నిన్ను కోడల్ని చేసుకున్నాము. లేదంటే నీకీ జన్మకు పెళ్లి అయ్యేదికాదు" అంది అమ్మ.

ఆ అమ్మాయి మాత్రం తక్కువ తిందా! "పెళ్లికాకపోతే అలాగే ఉండేదాన్ని. పెళ్లి అయి నేను సుఖపడిపోతున్నదేముంది? పావలా మల్లెపూలు కొనాలన్నా తండ్రి ముందో అన్నముందో చేతులు చాపి నిల బడే మొగుణ్ణి కట్టుకుని ఎవరు మాత్రం ఏం సుఖపడతారు?" అంది శాంతి.

అమ్మ మరి మాట్లాడలేదు. ఈ గొడవ అంతటితో ఆగిపోలేదు. ఆరోజు నాన్న వచ్చాక అమ్మ జరిగినదంతా చెప్పింది. నాన్నగారైనా ఏదో ఆడవాళ్ల గొడవలెమ్మని వదిలేసి ఊర్కున్నా బాగుండేది. ఆయన అలా చేయలేదు. "కానీ కట్నం తీసుకో కుండా నిన్ను కోడల్ని చేసుకున్నందుకు బానే బుద్ధి చెప్పావమ్మా" అన్నారు శాంతితో.

దాంతో శాంతి మరీ రెచ్చిపోయింది. "మేమేమీ గతిలేనివాళ్లంకాదు. మా నాన్న కొద్దోగొప్పో ఉన్నవాడే. మిగతా ఆడపిల్లలకు ఇచ్చినట్టే నాకూ కట్నం ఇచ్చేవాడు. కట్నం వద్దని చెప్పి అక్కడికి నాకేదో మహోప కారం చేసినట్లు మాట్లాడతారేంటి? అయినా మీ అబ్బాయికి ఉద్యోగం లేదు కాబట్టి కట్నం అడగడానికి ముఖం చెల్లక అడగలేదు కానీ మమ్మల్ని ఉద్ధరిద్దామని కాదులెండి" అంది శాంతి.

"నిజమే! అందుకేగా మమ్మల్ని మీ వాళ్లు వెధవల్ని చూసినట్టు చూశారు" అని అందు కున్నాడు తమ్ముడు.

"సరే ఇక ఈ గొడవలన్నీ వదిలేయండి. ఇప్పటికైనా మీరు ఏదైనా ఉద్యోగంలో చేర తారా? లేదా? అది చెప్పండి ముందు" నిలదీసింది శాంతి.

"నాకు మరొకరి దగ్గర పని చేయడం ఇష్టం ఉండదు" నెమ్మదిగానే అయినా స్థిరంగా చెప్పాడు తమ్ముడు.

"సరే... పెళ్లికిముందు మైనింగ్ బిజినెస్ చేస్తానన్నారుకదా! అదేమైంది" శాంతి ప్రశ్నకు గుటకలు మింగాడు తమ్ముడు.

"చెప్పండి. అడుగుతున్నానుకదా!" మరో

సారి అదే ప్రశ్న రిపీట్ చేసింది శాంతి.

ఈలోగా నాన్నగారు కల్పించుకున్నారు.

"అప్పుడేదో అనుకున్నాం అమ్మాయ్! కానీ ఆ బిజినెస్‌లో చాలా రిస్క్ వుందట. అందుకే డ్రాప్ అయిపోయాం" అన్నారు నాన్న.

"చూడండీ! నేను రేపే బయలుదేరి ఊరు వెడతాను. మా వాళ్లకి ఏదో చెప్పి డబ్బు తీసుకు వస్తాను. దాంతోనైనా ఏదైనా వ్యాపారం ఆరంభించండి" అదే తన ఫైనల్ డెసిషన్ అన్నట్టుగా ఉంది ఆ అమ్మాయి స్వరం.

"అది కాదమ్మా! ముందు కట్నం వద్దని చెప్పి ఇప్పుడు నువ్వు డబ్బు తీసుకు రావడానికి వెడితే నిన్ను మేమే పంపించామనుకోరూ! మా పరువేంకావాలి? " ఫాల్స్ ప్రెస్టీజ్ ఒకటి అడ్డొచ్చింది.

"చూడండి! మా వాళ్లకి ఏం చెప్పాలో నాకు తెలుసు. ఏం చెప్పి డబ్బులు తీసుకు రావాలో కూడా నాకు తెలుసు. మీరేం ఖంగారుపడకండి" అని లోపలకు వెళ్లిపోయింది శాంతి.

అన్నట్టుగానే మరుసటి రోజు ఊరికి బయల్దేరింది.

తమ్ముడు ఏమాత్రం అభిమాన పడకుండా వెళ్లి ఆమెని బస్ ఎక్కించి వచ్చాడు.

అక్కడ్నించి అమ్మ, నాన్న, తమ్ముడు, శాంతి ఎంత డబ్బు తెస్తుంది? దాంతో ఏం బిజినెస్ చేయాలి... అన్న ఆలోచనలో పడ్డారు.

"చీరెల వ్యాపారం చేస్తే! ఈమధ్య చాలా మంది ఈ వ్యాపారం చేస్తున్నారు" అంది అమ్మ.

ఆ వంకతో రకరకాల చీరెలు కట్టుకోవచ్చని ఆవిడ కోరిక.

"ఆ...ఆ... ఇన్‌స్టాల్‌మెంట్లు సరిగ్గా వసూలు చేసుకోకపోతే అప్పుడుంటుంది" అన్నారు నాన్న.

ఒకరు అవునంటే మరొకరు కాదనడం వాళ్లిద్దరికీ మొదటినుంచి అలవాటే.

"ఓ పని చేద్దాంరా. ప్రింటింగ్ ప్రెస్ పెడదాం. మా పార్టీ వర్క్ అంతా మనమే తెచ్చుకోవచ్చు" ఉత్సాహంగా అన్నారు నాన్న.

"ఏరా నువ్వేం మాట్లాడవేం? " తమ్ముడ్ని అడిగింది అమ్మ.

"ముందు డబ్బు రానీ నాన్నా! శాంతి ఎంత డబ్బు తెస్తుందో తెలీదుకదా? " అన్నాడు తమ్ముడు.

వీళ్లంతా ఇంత త్వరగా ఎలా మారిపోగలరు అన్న సందేహం నా మనసుని తొలిచేసింది.

"సోమయాజులగారి ఆదర్శాలే వేరు. ఆయన ఏం చెప్తారో అదే చేస్తారు. లక్షలకి లక్షలు కట్నం గుంజుతున్న ఈ రోజుల్లో పైసా కట్నం తీసుకోకుండా పెళ్లి చేశారు. నిజంగా గొప్ప వ్యక్తి" అని నాన్నగారు పది మందితో భేష్ అన్పించుకున్నారు.

తమ్ముడు కూడా ఇంచుమించుగా అలాగే ఫీలయ్యాడు.

కానీ ఇప్పుడు ఇద్దరూ అదంతా మర్చిపోయారు. నాకిక్కడ ఓ విషయం అర్థమైంది. చాలామందిలానే మా వాళ్లకి కూడా రెండు నాలికలు, రెండు ముఖాలు ఉన్నాయి. బయట ఆదర్శవాది, గొప్ప వాడు అన్పించుకోవడం కోసం పెళ్లి సమయంలో కట్నం వద్దన్నారు. కానీ ఇప్పుడు శాంతి డబ్బు తీసుకువస్తానంటే ఎవ్వరూ వారించలేదు. రేపొద్దున ఎవరైనా ఏదైనా అంటే శాంతిని డబ్బు తీసుకురమ్మని మేము పంపించామా! తనే బయలుదేరింది. మేము ఎంతగా వారించినా వినలేదు అని చెప్తారు.

తమ్ముడు ఏమాత్రం అభిమానపడకుండా భార్యని బస్ ఎక్కించి వచ్చాడు. ఆ తర్వాత కూడా చాలాసేపు శాంతి తెచ్చే డబ్బుతో ఎలాంటి బిజినెస్ మొదలుపెడితే బాగుంటుందా అని ఆలోచించారు. చివరకు శాంతి తీసుకొచ్చే డబ్బుని పట్టి నిర్ణయించుకోవచ్చు

లెమ్మని ఊరుకున్నారు.

తమ్ముడు మాత్రం చాలా ఉత్సాహంగా ఉన్నాడు. కష్టపడకుండా వచ్చే డబ్బు ఎన్నాళ్లుంటుంది? పైసకూడా సంపాదించడం చేతకాని వ్యక్తి చేతికి డబ్బు ఇస్తే బాధ్యతగా ఖర్చు చేయగలడా? లేడనే నా నమ్మకం. అలా అని తమ్ముడు బాగుపడకూడదని నేను కోరుకోవడంలేదు. బాగు పడేందుకు చేసే ప్రయత్నమే సరిగాలేదు.

మొదట తనేమిటో, తను ఎందుకు పనికి వస్తాడో ఏ వ్యాపారంలో రాణించగలుగుతాడో తెలుసుకున్నాకకదా డబ్బులు గురించి ఆలోచించాలి. ఏ రంగంమీదా అవగాహన లేనివాడు చేతిలో డబ్బుందికదా అని ఏదో ఒక వ్యాపారం మొదలుపెడితే రాణించడం కష్టం.

ఈ విషయం గురించి నన్నెవ్వరూ నా అభిప్రాయం అడగలేదు. ఒకవేళ నా అంతట నేనుగా ఏదైనా సలహా ఇచ్చినా కూడా తీసిపారేస్తారే తప్ప పట్టించుకోరు.

అన్నట్టుగానే మూడునాలుగు రోజులలో శాంతి వచ్చింది. ప్రస్తుతం యాభై వేలు ఇచ్చారని ఓ నెల రోజులలో మరో యాభై వేలు ఇస్తానన్నారని చెప్పింది. దాంతో ఏం వ్యాపారం చెయ్యగలం?

ఓ వారంరోజులపాటు అందరూ కలిసి తీవ్రంగా ఆలోచించారు. ఆ డబ్బు ఎటూ సరిపోదని అర్థం అయింది. క్రమంగా ఆ సంగతి అందరూ మర్చిపోయారు. అమ్మ మాత్రం "ధర్మారావుగారి అప్పు తీర్చాలికదా! ఆ డబ్బు ఇంట్లో ఉంటే వృధాగా ఖర్చు అవుతుంది. పోనీ పెద్దాడికి ఇస్తే ధర్మారావుగారి అప్పు తీర్చేస్తాడుగా" అంది.

"కోడలు తన పుట్టింటినుంచి తెచ్చిన డబ్బుతో మన అప్పులు తీర్చుకోవడమేమిటి? ఆయనకు నెమ్మదిగా ఇద్దాంలే" అన్నారు నాన్న.

డబ్బులు బ్యాంకులో వేసినట్టుంది.

తమ్ముడు, మరదలు వ్యాపారం కోసమని తెచ్చిన డబ్బును హ్యాపీగా ఖర్చుపెట్టేవారు. సినిమాలు, షికార్లు, హోటల్స్‌లో భోజనాలు, ఓ నెలా, రెండు నెలల పాటు ఎలాంటి గొడవలు లేకుండా ఆనందంగా గడిపారు.

ఇలాగే సంవత్సరం గడిచిపోయింది. డబ్బులు అయిపోయినప్పుడల్లా శాంతి పుట్టింటికి వెడుతోంది. అయిదో పదో తెస్తూనే ఉంది.

తమ్ముడి జీవిత విధానంలో మాత్రం ఏవిధమైన మార్పు రాలేదు.

మురళి డిగ్రీ ఫైనల్ ఇయర్‌కు వచ్చాడు.

చెల్లాయ్‌ని మెడిసన్‌లో చేర్పించాను.

సంవత్సరం గడిచేసరికి కొత్త పెళ్లాం మీద మోజు పోతుంది అంటారు. తమ్ముడి విషయంలో అది నిజమైంది. వాడి అసమర్థతను కప్పిపుచ్చుకునేందుకు భార్యమీద విసుక్కునేవాడు. ఆ అమ్మాయి ఒక్కోసారి ఎదురుతిరిగేది. కొన్నిసార్లు ఓర్చుకునేది. అందరూ మారుతున్నారుకానీ మా ఇంట్లో మాత్రం ఏవిధమైన మార్పులేదు. అసలు మార్పు వస్తుందని కూడా నేను అనుకోను. వేసవి సెలవులవగానే ఓ రోజు శాంతి నా దగ్గరకు వచ్చింది. ఈ వేసవి సెలవుల్లో మా ఇంట్లో రోజూ గొడవలు జరిగేవి. తమ్ముడి ఉద్యోగం గురించే ఈ గొడవలన్నీ. కానీ ఓ పరిష్కారం మాత్రం దొరకలేదు.

"బావగారూ! కాఫీ తీసుకోండి" అని ఇచ్చింది.

ఆ అమ్మాయి హయాం వచ్చాక ఈ అందింపులన్నీ ఏమీలేవు. కాఫీ కలిపి కప్పుల్లో పోసి డైనింగ్ టేబుల్ మీద పెడుతుంది. భోజనం అయినా అంతే. తన భర్తకు తప్పితే ఎవరికీ చేతికి కాఫీ కప్పు ఇవ్వదు. భోజనం వడ్డించదు. అన్నీ టైమ్ ప్రకారం చేసి టేబుల్ మీద పెడితే టైమ్ చూసుకుని ఎవరికి వారు వెళ్లి తెచ్చుకోవాలి. ఒకవేళ మర్చిపోతే కాఫీ అలాగే చల్లారిపో

తుంది. తాగగలిగితే చల్లారిపోయిన కాఫీ తాగాలి. లేదా మళ్లీ వెచ్చచేసుకోవాలి. అలాంటిది ఈ రోజు తనే స్వయంగా కాఫీ తీసుకొచ్చి ఇచ్చేసరికి నాకు ఆశ్చర్యం కలిగింది.

కాఫీ కప్పు అందుకున్నాను. శాంతికి నాతో ఏదో పనుంటేనే ఇలా చేస్తుంది. అప్పుడప్పుడు తమ్ముడు తను అడగలేక భార్యతో డబ్బులు అడిగిస్తుంటాడు. అలాంటప్పుడే శాంతి కాఫీ కప్పుతో వస్తుంది. లేదా భోజనానికో, టిఫిన్‌కో రమ్మని పిలిచి దగ్గరుండి వడ్డిస్తుంది.



నీకేం కావాలో సూటిగా అడుగు ఇలా లేని అభిమానం నటించద్దు అని చెబ్దామన్పిస్తుంది కానీ చెప్పలేను. అందుకే మౌనంగా ఉండిపోతాను. పట్టించుకోకపోవడం కన్నా ఈ నటనే నన్ను ఇబ్బంది పెడుతుంటుంది.

"బావగారూ! ధర్మారావుగారి స్కూల్లో నాకేదైనా ఉద్యోగం దొరుకుతుందేమో కనుక్కుంటారా?" నెమ్మదిగా అడగలేక అడగలేక అడిగింది శాంతి.

కొంతవరకు నేను ఊహించినదే ఇది. అలాగే కనుక్కుంటాను అని తల వూపాను.

'అక్కర్లేదమ్మా, నీకు ఉద్యోగం వచ్చినట్టే' అని చెప్పొచ్చు. కానీ ఏమాత్రం శ్రమపడకుండా లభించే దాంట్లో తృప్తి ఉండదు. దాని విలువ కూడా అర్థంకాదు. మనకు చేతనైన దానిలో ఎవరికైనా సహాయం చేసినా కూడా ఆ సహాయం చేసేందుకు మనం ఎంతో కష్టపడ్డామని ఎదుటివారికి అర్థం కావాలి. ఆల్రెడీ ధర్మారావుగారు ఈ విషయం చెప్పారు. ఇంటి పరిస్థితులు తెలుసుకుని పోనీ ఆ అమ్మాయికేదైనా ఆసక్తి ఉంటే మన స్కూల్లో ఏదైనా జాబ్ చూద్దాం అని అన్నారు కూడా.

కానీ చెప్పానుగా! నా అంతట నేను చెప్తే విలువ వుండదని. ఆ సాయంత్రం నేను పార్క్‌కు బయలుదేరుతుంటే "బావగారూ" అంటూ ఓ కాగితం అందించింది శాంతి.

"అది నా బయోడేటా... మీరు ధర్మారావుగారి దగ్గరకు వెళ్తున్నారేమోనని" అంటూ అర్థోక్తిగా ఆగిపోయింది.

అలాగేనన్నట్లు తీసుకున్నాను.

పార్క్‌లో కూర్చుని కాగితం తీసి చదివాను. నా తమ్ముడికన్నా నా మరదలు ఎక్కువే చదివింది.

మర్నాడు ఆదివారం కాబట్టి ఉదయమే ధర్మారావుగారింటికి వెళ్లాను. ఆయనకు శాంతి బయోడేటా ఇచ్చాను.

మరో వారం రోజులకు మూడు వేల రూపాయల జీతంతో శాంతి స్కూలు టీచర్‌గా చేరింది.

మళ్లీ పనంతా తననెత్తిన పడేసరికి అమ్మ సణుగుడు ప్రారంభించింది కానీ ఆ మాటలు పట్టించుకునే తీరిక ఎవరికీ లేదు. శాంతి రెగ్యులర్‌గా జాబ్‌కి వెడుతోంది. భర్తని నమ్ముకోవడంకన్నా స్వశక్తిమీద ఆధారపడటమే మంచిదన్న నిశ్చయానికి వచ్చినట్టుంది.

★ ★ ★

తమ్ముడు మాత్రం యధావిధిగా ఉద్యోగ

ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాడు. కొన్ని సంఘటనలు మన ఊహలకు అతీతంగా జరుగుతుంటాయి. అందుకేనేమో 'అంతా విధి విలాసం' అని మన పెద్దవాళ్లు అంటుంటారు. నా జీవితంలో పెళ్లి అనేది ఓ అందని జాబిల్లి అయితే సాక్షాత్తు అరుంధతిని పెళ్లాడాల్సి రావడం విధికాక మరేమిటి? మీకు ఆసక్తిగా ఉందికదూ!

నా జీవిత కథలో ఈ ఘట్టం అత్యంత ప్రధానమైనది. అరుంధతికి, నాకు పెళ్లి అంటే మీకు కూడా కుతూహలంగా ఉండి ఉంటుంది. అందుకే వివరంగా చెప్తాను. ఆ రోజు నేను పార్క్‌నుంచి వచ్చేసరికి రాత్రి పది గంటలయ్యింది. ఒక్కోసారి నా వర్క్ పూర్తయ్యాక కూడా అక్కడే కొంతసేపు ఉండి జనాన్ని గమనిస్తుంటాను. గుమ్మంలోకి అడుగుపెట్టేసరికి ఎన్నడూ లేనిది గల గలా మాటలు విన్పిస్తున్నాయి. మామూలుగా ఆ టైంలో నిశ్శబ్దానిదే రాజ్యం. కానీ ఈ రోజు అందుకు భిన్నంగా ఉంది.

ఈ టైంలో మా ఇంటికి ఎవరొచ్చి ఉంటారు? అనుకుంటూ కుతూహలంగా లోపలికి నడిచాను.

అంతే నా కళ్లను నేనే నమ్మలేకపోయాను.

నేను చూస్తున్నది కలా! వాస్తవమా! నాకు అర్థం కాలేదు.

అక్కడ అరుంధతి కన్పించింది. ఒకసారి కళ్లు నలుముకుని మరీ చూశాను.

అవును అచ్చంగా అరుంధతే. నట్టింట్లో కూర్చుని గలగలా మాట్లాడుతోంది. నా మనసుకు ఎంతో సంతోషంగా అన్పించింది.

ఎవరేమైనా అనుకోని అరుంధతి రాకతో మా ఇంటికి ఎంతో వెలుగు వచ్చిందన్పించింది.

నన్ను చూడగానే "హాయ్! కృష్ణా! బావున్నావా?" అంటూ పలకరించింది. బావున్నానన్నట్లు తలూపాను.

వసుంధర గబగబా నా దగ్గరకు వచ్చింది. "అన్నయ్యా! అరుంధతి ఇక మన ఇంట్లోనే వుంటుంది" అసలు సంగతి చెప్పే ముందు ఉపోద్ఘాతంలా అంది వసుంధర.

అవునా అన్నట్టు అరుంధతి వంక చూశాను. మనింట్లో ఉండిపోవడమన్న మాటకు అర్థం ఏమిటో నాకు ఆ క్షణంలో అర్థం కాలేదు.

అవునన్నట్లుగా ఆల్చిప్పలాంటి తన కనురెప్పలను అల్లల్లాడించింది. సభ్యత కాదని ఊరుకున్నానుగానీ ఆమెని ఆ భంగిమలో ఓ అందమైన చిత్రం చిత్రించాలన్పించింది.

"అవునన్నయ్యా! అరుంధతికి ఈ ఊరు ట్రాన్స్‌ఫర్ అయ్యింది. తనకి ఈ ఊరు గురించి అంతగా తెలీదుకదా! ఇల్లు అదీ చూసుకునేదాకా ఇక్కడ ఉండనిస్తారా అని అడుగుతోంది. నాన్నగారేమో 'ఇల్లు అదీ దొరికేదాకా ఏంటి? ఇంత ఇంట్లో నువ్వొక్క దానివి మాకు బరువా నీకు పెళ్లి అయ్యే దాకా ఇక్కడే ఉండిపో. అలా అయితేనే ఇప్పుడు నువ్వు మా ఇంట్లో ఉండడానికి అంగీకరిస్తాను' అన్నారు. ఏం చేస్తుంది? చచ్చినట్టు ఒప్పుకుంది"

మొదటిసారి నాన్నగారి మీద నాకు అమాంతంగా గౌరవం పెరిగిపోయింది. నాకు తెలిసి ఆయన తన జీవితంలో నా వరకు చేసిన మహోపకారం ఏదైనా ఉందంటే అది ఇదొక్కటే.

నిజంగా ఆ రాత్రి నాకు చాలా ప్రశాంతంగా నిద్రపట్టింది.

నేను ఇలా ఆలోచించడం తప్పేకావచ్చు కానీ చంద్రుడు మనకు అందడని తెలిసి కూడా వెన్నెలను అనుభవిస్తున్నాంకదా! ఇదీ అంతే! అరుంధతి నాకు భార్య కాకపోయినా ఆమె మా ఇంట్లో ఉంటే నా కన్నుల ముందు తిరుగుతూ ఉంటే నాకెంతో ప్రశాంతంగా ఉంటుంది. నా మనసుకు శాంతిగా అన్పిస్తుంది.

కోల్పోయిన ధైర్యం తిరిగి వచ్చి నా గుండెల్లో చేరుతుంది.



ఒక వ్యక్తి నుంచి స్ఫూర్తి పొందడం తప్పేంకాదు కదా! అరుంధతి నన్నేమీ ప్రత్యేకంగా చూడకపోయినా ఆమె చూపు, మాట అన్నింటా నా మీద అభిమానం వున్నట్టుగా నాకు అన్పిస్తుంది. నిజంగానే అరుంధతి చాలా కలుపుగోలు పిల్ల.

ఇంతకుముందు పెళ్లికూతురితో వచ్చినప్పుడు తను మా ఇంటికి అతిథిగా వచ్చింది కాబట్టి అతిథి మర్యాదలు చేయించుకుంది. కానీ ఇప్పుడు మా ఇంట్లో మనిషిగా ఉండబోతోంది కాబట్టి పనులు పంచుకుంది. ఎప్పుడు ఎక్కడ ఎవరితో ఎలా ప్రవర్తించాలన్నది అరుంధతికి బాగా తెలుసు.

మేము నిద్రలేచేసరికల్లా వాకిట్లో నీళ్ల చల్లి ముగ్గులు పెట్టేసింది. వేడినీళ్లకు బాయిలెర్ వేసేసింది.

డికాషన్ వేసి ఉంచింది.

స్నానం చేసేసి పూజకూడా చేసుకుంది.

మేము నిద్రలేవగానే అందరినీ అభిమానంగా పలకరిస్తూనే కాఫీ ఇచ్చింది.

"నీకెందుకమ్మా ఈ పనులన్నీ" అని అమ్మ అంటే,

"ఫర్వాలేదాంటీ. నాకు అలవాటే. ఒక్కత్తే కూతురునైనా అమ్మ నన్ను గారాబం చేయలేదు. పనులన్నీ నేర్పింది. పైగా ఉదయాన్నే లేచి పని చేసుకుంటే ఎంతో ఆరోగ్యం కూడాను. స్వచ్ఛమైన గాలిని పీల్చుకోవచ్చు ప్రకృతిని పలకరించచ్చు మంచుబిందువులతో ఆటలాడుకోవచ్చు" అంది అరుంధతి.

అమ్మకు శాంతి ఏం మాట్లాడినా నచ్చదు. కానీ అరుంధతి మాట్లాడితే ఎంతసేపైనా అలాగే వింటూ ఉండిపోతుంది.

"చూడమ్మాయ్! నేను నీకు వరసకు అత్త గార్నేకదా! చక్కగా అత్తయ్యా అని పిలువు. ఆంటీ అంటే నాకేంటోగా ఉంటోంది" అంది అమ్మ.

"అలాగేనండీ" ఎంతో వినయంగా జవాబిచ్చింది అరుంధతి. మొదటిరోజు కాబట్టి అరుంధతిని తమ్ముడు తీస్కెళ్లి బ్యాంక్‌లో దింపి వచ్చాడు.

మామూలుగా నాలుగు గంటలకల్లా పార్క్‌కు బయలుదేరి వెడతాను. కానీ అరుంధతి ఇంటికి వచ్చాక బయలుదేరదామని కూర్చున్నాను. తను వచ్చేసరికి ఆరు గంటలు దాటింది. ఇక అప్పుడు వెళ్లి ఉపయోగం ఉండదు. పిల్లలతో పార్క్‌కు వచ్చినవారు ఇళ్లకు వెళ్లిపోతారు. అందుకని ఆ రోజుకి వెళ్లడం మానుకున్నాను.

లోపలినుంచి అరుంధతి మొదటిరోజు బ్యాంక్ అనుభవాల గురించి చెప్తున్న మాటలు బయటకు నాకు స్పష్టంగా విన్పిస్తున్నాయి.

ఇక్కడకు వచ్చాక మొదటి నెల జీతం అందుకున్నప్పుడు అరుంధతి ఇంట్లో వాళ్లందరికీ గిఫ్ట్స్ తీసుకొచ్చింది.

నాకు కూడా తెచ్చింది, పెయింటింగ్‌కు సంబంధించిన పుస్తకాలు. అవన్నీ ఇంగ్లిషులో ఉన్నాయి. ఇంగ్లీషు అర్థం కావడం కొంచెం కష్టమే అయినా అవి చదివితే ఎంతో ఉపయోగం ఉంటుంది.

మొత్తంమీద అరుంధతి మాతో బాగా కలిసిపోయింది. అసలు ఇన్ని రోజులుగా ఆ అమ్మాయి లేకుండా ఇంట్లో మేం ఎలా ఉన్నామా అన్న సందేహం మా అందరికీ కలుగుతుంటుంది. నేను మామూలుగానే పార్క్‌కు వెళ్లి ఎప్పుడూ నేను కూర్చునే ప్లేస్‌లో బోర్డ్ పెట్టుకుని కూర్చున్నాను.

ఓ గంట వరకు చాలా బిజీగా ఉన్నాను. ఆపకుండా స్కెచ్‌లు గీస్తూనే ఉన్నాను. తర్వాత కొంచెం రిలాక్స్ అయ్యాను.

యధాలాపంగా చుట్టుపక్కలకి చూస్తుంటే నా కళ్లు ఓ జంట మీద పడ్డాయి.

వారిద్దరూ కూర్చున్న విధానం, ఆ సాన్నిహిత్యం చూస్తుంటే వారు ప్రేమికులన్న సంగతి స్పష్టంగా అర్థమవుతోంది.

చాలాసేపు అలాగే వారిని గమనిస్తూ




ఉన్నాను.

మధ్యలో ఎవరెవరో వస్తుంటే వారి బొమ్మలు గీసి పంపిస్తున్నాను. ఆ జంటలో ఆ అమ్మాయిని చూడాలని నాకు కుతూహలం కలిగింది. కుతూహలం అంటే వేరే అర్థంలో కాదు. దాదాపు అరగంట నుంచి నేను వారిద్దరినీ గమనిస్తున్నాను. ఆ అబ్బాయి ఈ అరగంటలో కనీసం పది పదిహేనుసార్లు అటుఇటూ కదిలాడు. కానీ ఆ అమ్మాయి మాత్రం ఒకే భంగిమలో కొంచెం కూడా కదలకుండా అలాగే నిటారుగా కూర్చుంది. అందుకే ఆ అమ్మాయిని చూడాలని కుతూహలం కలిగింది.

మరో పదిహేను నిమిషాలకు నా నిరీక్షణ ఫలించింది. హఠాత్తుగా ఆ అమ్మాయి వెనక్కి తిరిగింది.

ఆమెను చూడగానే నా శరీరం మొత్తం ఫ్రీజ్ అయిపోయిన భావన కలిగింది. నా హృదయాన్ని ఎవరో బలంగా నొక్కేస్తున్నట్టుగా ఫీలయ్యాను. ఒక్క క్షణకాలంలో నా మనసంతా మొద్దుబారిపోయింది.

ఎందుకంటే... ఆమె ఎవరో కాదు. అరుంధతి. నేను ఆరాధిస్తున్న అరుంధతి. పార్క్‌లో పరాయిమగాడి పక్కన అత్యంత సన్నిహితంగా... ఇక నాకు అక్కడ ఉండ బుద్ధి కాలేదు. గబగబా అన్నీ సర్దేసుకుని అరుంధతి కళ్లబడకుండా పార్క్‌లోంచి బయటకు వచ్చేశాను. ఆమె ఎవరినో ప్రేమిస్తే నువ్వెందుకు బాధపడాలి? అని మీరు నన్ను అడగచ్చు

దానికి నా దగ్గర సమాధానం లేదు. కొన్ని ప్రశ్నలకు సమాధానాలు ఉండవు. ఇది కూడా అలాంటి ప్రశ్నే.

ఒకటి మాత్రం చెప్పగలను. మీరు నా స్థానంలో ఉండి ఆలోచిస్తేనే మీకు నా బాధ అర్థం అవుతుంది. నేను ఇంటికి వచ్చిన తర్వాత మరో అరగంటకి అరుంధతి ఇంటికొచ్చింది. మనిషి ఎందుకో బాగా డల్‌గా కన్పించింది.

నేను బయటే కూర్చుని ఉన్నాను. ఎప్పుడూ అయితే నన్ను పలకరిస్తుంది. ఈ రోజు నన్ను చూసి కూడా చూడనట్టుగా లోపలికి వెళ్లిపోయింది. అమ్మ అరుంధతిని అడుగుతోంది. "ఏంటమ్మా! ఇవ్వాళ ఇంత ఆలస్యమైందేంటి"

అమ్మ ప్రశ్నకు ఏం జవాబు చెప్తుందా అని చెవులు రిక్కించి మరీ వినసాగాను. "బ్యాంక్‌లో కొంచెం వర్క్ ఎక్కువగా ఉందండీ" చెప్పి తన గదిలోకి వెళ్లిపోయింది అరుంధతి.

నాకు విషాదంతో కూడిన నవ్వొచ్చింది. ఆడవాళ్లు ఎంతో అందంగా అబద్ధం చెప్పగలరు.

ఆ రాత్రి భోజనాల దగ్గరకూడా అరుంధతి చాలా డల్‌గా ఉంది. ముఖ్యంగా బాగా పరధ్యానంగా ఎక్కడో ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నట్టుగా కన్పించింది. ఈవిధంగా రెండుమూడు సార్లు అరుంధతిని ఆ వ్యక్తితో పార్క్‌లో చూశాను. నేనిప్పుడేం చేయాలి? ఈ విషయం ఎవరికైనా చెప్పడమా! మానడమా! చెప్తే నా మాటను ఎవరైనా నమ్ముతారా?

అసలు అతను ఎవరు?

అతనికి అరుంధతికి సంబంధం ఏమిటి?

వారిద్దరూ ప్రేమించుకుంటున్నారా?

ఈ విషయం శారదాంటీకి తెలుసా?

ఆంటీ వారి ప్రేమను అంగీకరిస్తుందా?

నా మనసులో సవాలక్ష సందేహాలు, అనంతకోటి అనుమానాలు. ముఖ్యంగా ఎవరికైనా చెప్పాలో, అక్కర్లేదో అన్న విషయాన్ని మాత్రం నేను తేల్చుకోలేకపోయాను. మీ అమ్మాయి ఎవరినో ప్రేమిస్తోంది అని శారదాంటీకి ఎలా చెప్పగలను?

రోజులు గడుస్తూనే ఉన్నాయి. నేను మాత్రం అరుంధతి విషయం ఎవరికైనా చెప్పడమో మానడమో తేల్చుకోలేకపోతున్నాను. ఓరోజు...



నేనెందుకో చాలా డిస్టర్బ్‌గా ఉన్నాను. ఇలాంటప్పుడు అప్పుడప్పుడు స్లీపింగ్ టాబ్లెట్స్ వాడుతుంటాను. ఈ సలహా డాక్టర్ మార్కండేయులు ఇచ్చిందే.

ఆ సమయంలో అమ్మ, చెల్లెలు, మురళి ఇంట్లోలేరు. మావయ్య కూతురి పెళ్లి కావడంతో నాలుగు రోజుల ముందు వెళ్లారు. ఇంట్లో నేను, నాన్న, అరుంధతి, శాంతి మాత్రమే ఉన్నాం.

రోజూకన్నా ముందుగానే నేను నిద్రపోయాను.

నిద్రమాత్ర వేసుకున్నప్పుడు ఉదయాన్నే లేవలేను. కొంచెం ఆలస్యంగా నిద్రలేస్తాను.

కానీ ఆరోజెందుకో నేనింకా నిద్రమత్తులో ఉండగానే ఎవరో దబదబా తలుపులు బాదారు.

నా కళ్లు తెరిపినబడటం లేదు. ఎంత ప్రయత్నించినా మెలకువ రాలేదు.

"ఒరేయ్ కృష్ణా! తలుపు తీయరా" నాన్న గట్టిగా అరుస్తున్నారు.

"రేయ్ పిచ్చోడా! తలుపు తీయరా" తమ్ముడు కేకలు విన్పించాయి.

"కృష్ణా! తలుపు తియ్యి. ఇక్కడ మా గుండెలు మండిపోతుంటే నీకెలా నిద్ర పడుతోందిరా. ముందు తలుపు తియ్యి" అమ్మ అరుస్తోంది.

అమ్మ ఎప్పుడు వచ్చింది? మావయ్య కూతురి పెళ్లి ఈ రోజేకదా! పెళ్లి కాకుండానే తిరిగొచ్చేసిందేంటి? ఒకవేళ అమ్మకు, మావయ్యవాళ్లకు ఏదైనా గొడవ జరిగి ఉంటుందా? ఎంత గొడవైతే మాత్రం కాసేపటిలో పెళ్లనగా మావయ్య తన చెల్లెల్ని ఎలా రానిచ్చాడు?

అసలింతకీ ఇప్పుడు టైమెంత? వీళ్లంతా నన్నెందుకు నిద్ర లేపుతున్నారు? ఇంట్లో ఎవరికైనా ఏదైనా ప్రమాదం జరగలేదు కదా!

నా మనసు పరిపరి విధాలపోతోంది.

అంతలో మళ్లీ తలుపు దబదబా ఎవరోబాదారు. వెంటనే తలుపు తీయక పోతే తలుపు విరగకొడతారేమోనని భయంవేసింది. అతి కష్టంమీద మంచం మీంచి లేచి తూలుతూ వచ్చి తలుపు తీశాను. తలుపు తీసిన వెంటనే నిలబడలేక గుమ్మంలోనే కూలిపోయాను.

"చెప్పరా! ఎందుకు చేశావీపని? " తమ్ముడు నా షర్ట్ కాలర్ పట్టుకుని పైకి లేపబోయాడు.

వాడేం మాట్లాడుతున్నాడో నాకు అర్థం కాలేదు.

"చెప్పరా... ఎందుకు చేశావీపని? " మరోసారి అదే ప్రశ్న అడిగాడు. నేనేం చేశానో నాకు అర్థం కాలేదు.

"కృష్ణా! ఎందుకురా... ఎందుకురా... ఇలాంటి పని చేశావు? నువ్వెంతో మంచివాడివనుకున్నాను. మా పెద్దబ్బాయికి కష్టం సుఖం తెలుసని, ఎవరైనా బాధ పడుతుంటే చూడలేడు అని చెప్పేదాన్ని. అలాంటిది నువ్వా ఇలాంటి పని చేసింది. నీ మూలంగా పరువు పోయిందికదరా! అటు ఏడు తరాలు, ఇటు ఏడు తరాలు తలెత్తకోకుండా చేశావుకదరా" అమ్మ సన్నగా రోదించసాగింది. నేనేం చేశానో వాళ్లంతా ఎందుకలా నా మీద కేకలు వేస్తున్నారో నాకు అర్థం కాలేదు.

నేనింకా నిద్రమత్తుగానే ఉండటం చూసేసరికి నాన్నగారికి కోపం వచ్చినట్టుంది. "రేయ్ శ్రీను! ముందు వెళ్లి ఓ గ్లాసుడు నీళ్లు తెచ్చి వాడి ముఖాన కొట్టు. ఆ నిద్ర మత్తు వదిలితేకానీ వాడు చేసిన వెధవ పనేమిటో వాడికి అర్థం కాదు" కోపంతో పళ్లు కొరికారు నాన్న.

తమ్ముడు అలాగే చేశాడు.

చల్లటినీళ్లు ముఖాన పడటంతో నాకు కొద్దిగా నిద్రమత్తు వదిలిపోయింది.

"చూడరా చూడు! ఈ అమ్మాయిని బాగా చూడు. నువ్వు చేసిన అఘాయిత్యం చూడు" అరుంధతిని ముందుకు

నెట్టింది అమ్మ.

అరుంధతి వాలకం చూడగానే జరగకూడనిదేదో జరిగిందన్పించింది.

ఆమె జుట్టంతా రేగిపోయి ఉంది. చీరచిరిగిపోయి, జాకెట్టు చిరిగిపోయి, బుగ్గల మీద గోళ్లగాట్లు, పెదవి చిట్లి రక్తం కారుతోంది.

అరుంధతి వంక చూడలేక బాధగా తల తిప్పుకున్నాను.

"చెప్పరా... ఎందుకు చేశావా పని? ఆ పిల్ల నీకేం అపకారం చేసింది? నీ మీద ఎంతో అభిమానం చూపేది. నిన్ను ఆప్యాయంగా పలకరించేది. అలాంటి పిల్లమీద అఘాయిత్యం చేయడానికి నీకెలా మనసొప్పిందిరా? బంగారంలాంటి ఆ పిల్ల జీవితం నీ మూలంగా సర్వనాశనం అయిపోయిందికదరా!" అమ్మ నా చెంపలు ఎడాపెడా వాయించింది. "ఇప్పుడు వాళ్ల వాళ్లొచ్చి అడిగితే ఏమని సమాధానం చెప్పాలి? "

ఆ మాటలకు నేను నివ్వెరపోయాను.

ఒక్కసారిగా నా హృదయ స్పందన ఆగిపోయిందా! అన్పించింది.

నా వళ్లంతా చెమటలు పట్టాయి.

నాలుక పిడచకట్టుకుపోయినట్టుగా ఉంది.

నేను నేను అరుంధతిని...

కాదు. కాదు. మీరంతా అబద్ధం చెప్తున్నారు. నేనీపని చేయలేదు. గట్టిగా అరిచాననుకున్నాను. కానీ నాకు మాట రాదే. అందుకే మనసులోనే రోదించాను.

"చెప్పరా మూగవెధవా! నేనిప్పుడు మా అత్తగారు వాళ్లకి ఏమని సమాధానం చెప్పాలి? " నా డొక్కలో తన్నాడు శ్రీను.

"అమ్మా" అనుకుంటూ చేత్తో కడుపు పట్టుకుని కూలబడిపోయాను. బాధతో విలవిల్లాడాను.

"అన్నయ్యా" మురళి శ్రీనును వెనక్కి లాగాడు. "పెద్దా చిన్నా తేడా లేకుండా అన్నయ్యను పట్టుకుని కాలితో తంతావా! నేను నిన్ను అలాగే తంతే ఏం చేస్తావ్? "

"మురళీ" శ్రీను కొట్టడానికి చెయ్యెత్తి మురళి మీదకు వచ్చాడు.

"అవున్రా... ఇందాకటినుంచి చూస్తున్నాను. అన్నయ్యను పట్టుకుని మూగవెధవ! మూగవెధవ అంటున్నావు కృష్ణన్నయ్య నీకన్నా పెద్దవాడు. మాటలు రానంత మాత్రాన పెద్దాచిన్నా తేడాలేకుండా ఇలా నోటికొచ్చి మాట్లాడచ్చా. నేను నిన్ను తంతానని అన్నందుకే నీకంత కోపం వచ్చిందే మరి అన్నయ్యకెంత కోపం రావాలి? "

మురళి కోపం చూసి శ్రీను కొంచెం విస్తుపోయాడు.

"అంటే వాడు చేసిన ఛండాలపు పనిని నువ్వు సమర్థిస్తున్నావా? "

"ఆ విషయం గురించి అమ్మానాన్న కనుక్కుంటారు. అన్నయ్యకన్నా చిన్నవాళ్లమైన మనం అన్నయ్యను నిలదీస్తే బావుండదు. నీకు జరిగిందేమిటో, జరిగినదాంట్లో అన్నయ్యా తప్పుందో లేదో తెలుసుకోవాలని ఉంటే వెళ్లి ఓపక్కన నిలబడు. లేదా నీ గదిలోకి వెళ్లిపో" అన్నాడు మురళి.

"చెప్పరా కృష్ణా! ఇంతటి అప్రతిష్ఠ పని ఎందుకు చేశావురా? " అమ్మ కళ్ల నీళ్లు పెట్టుకుంది.

నేనేమని సమాధానం చెప్పగలను?

నేను... నేను అరుంధతిని పాడు చేశానంటే నాకు నమ్మబుద్ధి కావడంలేదు. ఇదెలా సాధ్యం?

నేను ఆమెని ప్రేమించిన మాట వాస్తవం.

ఆమెని ఓ దేవతగా నా హృదయం మీద ప్రతిష్ఠించుకున్నాను.

అంతేకానీ ఆమెని మరో దృష్టితో నేను ఏనాడూ చూడలేదు. అలాంటిది నేను తనని...

రోజూకన్నా ముందే టాబ్లెట్ వేసుకుని



నిద్రపోయాను. మరి నిద్రమధ్యలో మేల్కొని ఆ మత్తులో ఏదైనా చేశానా?

కానీ నిద్రమధ్యలో మెలకువ వచ్చినట్టుగా గుర్తులేదే.

ఒకవేళ నిజంగా నేను అలాంటిదేదైనా చేసుంటే మాత్రం జీవితంలో నన్ను నేను క్షమించుకోలేను.

ఆ విషయమే సైగ చేసి చెప్పాను. నా మూగ భాష వారికెంత వరకు అర్థమయ్యిందో మరి.

"అమ్మా! వసు, మురళీ... మీరిద్దరు లోపలికి వెళ్లండి" అంది అమ్మ.

చిన్నపిల్లల ఎదుట ఈ విషయం గురించి చర్చించడం ఎందుకని అనుకుని ఉంటుంది.

అమ్మ చెప్పగానే వాళ్లిద్దరు లోపలికి వెళ్లిపోయారు. ఆ తర్వాత నన్ను ఎన్నోసార్లు అడిగారు. కానీ నేను చేయని తప్పును నేనెలా ఒప్పుకునేది? అప్పుడంది అమ్మ "శాంతీ! మీ పిన్నిని వెంటనే రమ్మని చెప్పు. వాళ్లు వచ్చాక ఏం చేయాలో ఆలోచిద్దాం. అలాగే అరుంధతిని నీ గదిలోకి తీసుకువెళ్లు" అని చెప్పి నాన్నగారి వైపు తిరిగి "ఏవండీ మీరూ పదండి" అంది అమ్మ. ఎక్కడి వాళ్లు అక్కడ వెళ్లిపోయారు. నన్ను మాత్రం ఒంటరిగా వదిలేశారు.

నేను అరుంధతిని బలవంతం చేశానా! నిజంగా బలత్కారం జరిగితే ఆ అమ్మాయి ముఖంలో బాధ కన్పించదేం. అలా ఏ ఫీలింగు లేకుండా ఉందేం.

షాక్‌కు తట్టుకోలేక నిర్వికారంగా ఉండిపోయిందా?

నా జీవిత పుస్తకంలో ఇలాంటి పుటలు ఉంటాయని నేను అస్సలు అనుకోలేదు. మాట ఇవ్వకుండా భగవంతుడు నాకు అన్యాయం చేసినా ఎంతో కష్టపడి నా జీవితాన్ని నేను నిర్మించుకున్నాను. ఈమాత్రం ఏదైనా సాధించానంటే అందులో నా స్వయంకృషి, పట్టుదలే ఎక్కువ. ఇప్పుడు నాకు, మా ఇంట్లో వారికి ఏదైతే కళ అన్నం పెడుతోందో అది నాకు నేర్పించిన శారదాంటీ కూతురినా నేను బలాత్కరించింది. నాకు దుఃఖం వస్తోంది.

నా మీద నాకు అసహ్యం వేస్తోంది.

ఒకవేళ అరుంధతి అబద్ధం చెప్తోందా?

అబద్ధం చెప్పాల్సిన అవసరం తనకేముంది? అందునా ఒక వ్యక్తిని ప్రేమిస్తూ.

ఆ రాత్రి మరి నాకిక నిద్రపట్టలేదు.

మర్నాడు మామూలుగానే తెల్లవారింది. వసు, మురళి తప్పితే మిగతా వారెవ్వరూ నాతో మాట్లాడలేదు.

అరుంధతి నాకు కన్పించలేదు. తనని అడగడానికి నాకు ధైర్యం సరిపోలేదు. ఒకవేళ అడిగినా ఏమని అడుగుతాను?

కాఫీ తెచ్చిచ్చిన చెల్లాయ్ చేతికి ఓ కాగితం ఇచ్చాను. చెల్లాయ్ అది చదివి నాతో ఇలా అంది. "అన్నయ్యా! నీ గురించి నాకు తెలీదా! నిజంగా నువ్వు అమాయకుడివి. నువ్వెలాంటి పొరపాటు చెయ్యలేదు. ఈ విషయం ఇప్పుడెవ్వరూ నమ్మకపోవచ్చు కానీ ఏదో ఒకనాడు అందరూ నిన్ను పొరపాటుగా అర్థం చేసుకున్నామని, ఇదంతా అరుంధతి నాటకమని తెలుసుకుంటారు"

చాలు నాకీ సంతృప్తి చాలు. ఒక్కరు... ఒకే ఒక్క వ్యక్తి నన్ను నమ్మితే చాలు. థాంక్సురా అన్నట్టు వసు చెయ్యిపట్టుకుని కళ్లకద్దుకున్నాను.

మురళి కూడా అదే చెప్పాడు. మర్నాడు ఉదయానికి శారదాంటీ, అంకుల్, శాంతీ వాళ్ల అమ్మానాన్న వచ్చారు. ఆవిడ రావడంతోటే శోకాలు మొదలుపెట్టింది. అందరూ శాంతి గదిలో కూర్చుని ఏవో మంతనాలు జరిపారు.

చాలాసేపటి తర్వాత నన్ను పిలిచారు. నేను గదిలోకి వెళ్లగానే మొదట చేసినపని శారదాంటీ కాళ్లమీద పడటమే.

అది చూసి శాంతి తల్లి మూతి తిప్పింది.




"చేసిందంతా చేసి ఇప్పుడు కాళ్లు పట్టుకుంటే ఏం ప్రయోజనం? నాశనమైన మా అమ్మాయి జీవితం బాగు పడుతుందా?" అంది.

"అక్కా ఊరుకో నువ్వు. కృష్ణ నాకు చిన్నతనం నుంచి తెలుసు. అతను ఇలాంటి పని చేశాడంటే నేనెప్పటికీ నమ్మను" అన్నారు ఆంటీ.

గభాల్న చేతులు జోడించాను.

"బాగుందే తల్లీ. అంటే నువ్వనేదేంటి? అరుంధతి అబద్ధం ఆడుతోందా?" నిలదీసిందావిడ.

శారదాంటీ సమాధానం చెప్పలేదు.

ఒక్కరోజుకే నాన్నగారు బాగా కృంగిపోయారు. ఒక్కసారిగా ఇరవై ఏళ్లు పైబడిన వారిలా అయిపోయారు.

అందరూ నన్ను దోషిలా చూస్తుంటే నాకు చాలా బాధగా అన్పించింది. కానీ నా నిజాయితీని ఎలా నిరూపించుకోవాలో నాకు అర్థం కావడంలేదు. మళ్లీ మనసులో ఏదో సందేహం. నిజంగా అరుంధతి మీద నేను అఘాయిత్యం చేశానా.

శాంతీ వాళ్లమ్మగారు నాన్నగారిని నిలదీసింది. "ఇప్పుడేం చేద్దామంటారో చెప్పండి అన్నయ్యగారూ! మా ఆడపిల్ల జీవితం నాశనం చేయకండి"

"వదినగారూ! మీరంత మాట అనకండి. జరిగినదానికి అసలే ఆయన కృంగిపోయి వున్నారు" అంది అమ్మ.

"మేమూ కృంగిపోయే ఉన్నామండీ! కానీ అంతమాత్రాన మా బాధ తీరిపోతుందా చెప్పండి. దానికి ఇక్కడకు ట్రాన్స్‌ఫర్ అయిన రోజే మా శారదకు చెప్పాను. అరుంధతిని అక్కడ ఎవ్వరి ఇంట్లోనూ ఉంచద్దు, దాన్ని ఏ హాస్టల్లోనో ఉంచుదాం అని. కానీ శారదకు చెవికెక్కితేనా? మీరెంతో మంచివారని, అరుంధతిని కడుపులో పెట్టుకుని చూసుకుంటారని చెప్పింది. ఇదేనా చూసుకోవడం? ఏమండీ! మీ అబ్బాయి మగపిల్లాడు. ఏం చేసినా చెల్లుతుంది. కానీ మా అమ్మాయి అలా కాదే. దాని జీవితం ఇలా నాశనం కావాల్సిందేనా?"

ఆవిడ మాటలకు ఎవ్వరూ సమాధానం చెప్పలేకపోయారు.

"సోమయాజులుగారూ! మీరు చాలా మంచివారని, ఎవ్వరికీ అన్యాయం చేయరని అందరూ అంటుంటారు. మీ గొప్పతనం గురించి నాకు బాగా తెలుసు. నేను మిమ్మల్ని అర్థించేది ఒక్కటే. మా అమ్మాయి జీవితాన్ని కాపాడండి"

ఆవిడ మాటలు నాన్నగారి మీద బాగా పనిచేశాయి. అంతవరకు నేను నిజంగా తప్పుచేశానా లేదా అని సందిగ్ధావస్థలో ఉన్న నాన్నగారు ఓ నిర్ణయానికి వచ్చేశారని ఆయన మాటలే చెప్తున్నాయి.

"అమ్మా! మీరు చెప్పింది బాగానే వుంది. కానీ తప్పు నిజంగా కృష్ణ చేశాడా లేదా అనేది సందిగ్ధంగానే వుంది. నిజానికి మా అబ్బాయి అటువంటి మనిషికాదు. అలాగని ఏ అమ్మాయి కూడా ఇలాంటి విషయాల్లో అబద్ధమాడదు. ముఖ్యంగా అరుంధతి లాంటి అమ్మాయి. తనను చిన్నప్పటి నుంచి ఎరుగుదును. అరుంధతి ఎంత మంచి పిల్లో నాకు మరొకరు చెప్పనవసరం లేదు. ఇద్దరూ మంచివాళ్లే. ఇద్దరూ బుద్ధిమంతులే. కానీ పొరపాటు జరిగిపోయింది. ఏంచేద్దామంటారో కూడా ఆలోచించండి" అన్నారు నాన్నగారు.

"ఏమంటారు మరిదిగారూ? మీ ఉద్దేశ్యమేమిటో చెప్పండి" అడిగారు శాంతీ వాళ్ల అమ్మ అరుంధతి నాన్నగారిని.

"మీరు పెద్దవారు. మీరంతా కలిసి నా కూతురి జీవితం నిలబెడితే నాకంతే చాలు" చేతులు జోడించారాయన.

అందరూ ఆలోచనలో పడ్డారు.

ఒక్కొక్కరు ఒక్కో సమాధానం చెప్పారు. నన్ను ఎవ్వరూ అడగలేదు కానీ అరుంధతి

అభిప్రాయం కనుక్కున్నారు. "అరుంధతీ! నీ నిర్ణయం ఏమిటి? " అడిగింది శ్రీను అత్తగారు.

"నేను... నేను కృష్ణను పెళ్లి చేసుకుంటాను" అంది అరుంధతి.

ఆమె చెప్పింది విని అంతా నిర్ఘాంత పోయారు నాతో సహా.

శారదాంటీ కళ్లు ఆనందంతో వెలిగిపోయాయి. అరుంధతి నిర్ణయం విని అమ్మ నాన్నా విస్తుపోయారు.

అసలు పెళ్లే కాదనుకున్న నాకు అరుంధతితో వివాహమనేసరికి అమ్మకి పట్టపగ్గాలు లేకుండా పోయాయి. అమ్మ చాలా ఆనంద పడింది.

ఎవ్వరూ కూడా నా అభిప్రాయం ఏమిటని నన్ను అడగలేదు. ఎందుకు అడుగుతారు? దోషిని నీకెలాంటి శిక్ష వేయమంటావ్? అని అడగరుకదా! నిర్ణయం తీసుకోవడం అయిపోయింది కాబట్టి నేను మౌనంగా నా గదిలోకి వచ్చాను.

వసు కాలేజీనుంచి రాగానే విషయం తెలుసుకున్నట్లుంది సరాసరి నా గదిలోకి వచ్చింది.

"అసలు నువ్వేం తప్పు చేశావని నీకీ శిక్ష? అన్నయ్యా! నిజంగా చెప్తున్నాను. అరుంధతి ఏదో నాటకం ఆడుతోంది. నిన్ను మోసం చేస్తోంది. ఈ పెళ్లికి నువ్వు ఒప్పుకోవద్దు. నిజంగా తనమీద అత్యాచారం జరిగిందో లేదో డాక్టరుతో పరీక్ష చేయిస్తే తేలిపోతుందన్నయ్యా" అంటూ ఏమేమో చెప్పింది.

చెల్లాయిని కన్విన్స్ చేయడానికి నాకు చాలా టైమే పట్టింది.

అది అదే కోపంతో శారదాంటీ దగ్గరకు వెళ్ళింది. "ఆంటీ! మీరంటే మాకెంతో గౌరవం ఉంది. మా అన్నయ్య ఏ తప్పూ చేయలేదు, చెయ్యడు కూడా. అరుంధతే ఏదో నాటకం ఆడుతోంది. తను పెళ్ళి పేరుతో మా అన్నయ్యని మోసం చేద్దామని చూస్తోంది" అని అరిచింది.

శాంతీ వాళ్ళమ్మగారు కూడా గొంతెత్తి అరిచారు. "అవును! ఆ మూగోడిని చూసి వరించి ఎలాగైనా పెళ్ళిచేసుకోవాలని మా అమ్మాయి ఇదిగో ఇలా నాటకం ఆడుతోంది. అదేగా నువ్వనేది... వెళ్ళవమ్మా... చిన్నపిల్లవి చిన్నపిల్లలా ఉండక పెద్దవాళ్ళ విషయాల్లో కల్పించుకోకు. ఏంచేయాలో మాకు తెలుసు"

"చూడండాంటీ! నేను మీతో మాట్లాడటం లేదు. శారదాంటీతో మాట్లాడుతున్నాను. మీరు ఈ విషయంలో కల్పించుకోవద్దు. మా అన్నయ్య మూగవాడే కావచ్చు కానీ వాడంత మంచివాడ్ని చూపించండి. చూద్దాం. అన్నయ్య నోరువిప్పి నిజం చెప్ప లేడుకదా అని మీరంతా కలిసి మీ అమ్మాయి మాటలు నమ్మి మా అన్నయ్యను దోషిని చేస్తున్నారు. మా అన్నయ్య నిరపరాధి. వాడెన్నటికీ అలాంటి పని చేయడు" కోపం, ఆవేశం, దుఃఖంతో వసు గొంతు బొంగురుపోయింది. శారదాంటీ వసుని దగ్గరికి తీసుకుంది. "పోనీ చిన్నపిల్లవైనా నీ మాటే విందాం. ఏం చేద్దాం చెప్పు" అని అడిగారు.

"డాక్టరు దగ్గరికి తీసుకువెడదాం" అని వసు అంటుంటే అరుంధతి కళ్లల్లో భయం స్పష్టంగా కనిపించింది.

శారదాంటీ ఏం సమాధానం చెప్పేవారో కానీ అంతలో నాన్నగారు వచ్చారు.

శారదాంటీ మళ్ళీ అక్కడి విషయమంతా నాన్నగారికి చెప్పారు.

"వసూ! నువ్వు లోపలికి వెళ్ళు" అని అరిచారు నాన్న.

"అదికాదు నాన్నగారు..." వసు ఏదో చెప్పబోయింది.

"నీకన్నా మేం ఇంతమంది పెద్దవాళ్లున్నాం. ఏం చేయాలో మాకు తెలుసు. నువ్వు లోపలికి వెళ్ళు" నాన్నగారు చెల్లాయితో అంత కఠినంగా మాట్లాడటం నేనె

ప్పుడూ చూడలేదు.

"అదికాదు నాన్నగారూ! అరుంధతిని డాక్టరు దగ్గరకు" అని అంటుండగా వసుంధర చెంప పగిలింది.

"వెళ్ళు... నోర్మూసుకుని లోపలకు వెళ్ళు. ఇప్పటికైన అల్లరి చాలలేదా? ఇంకా ఈ విషయం డాక్టరు దాకా వెళ్ళాలా? నలుగురికీ ఈ విషయం తెలిసి అల్లరవ్వాలా? " కేకలేశారు నాన్న.

ఆ తర్వాత ఆ విషయం గురించి ఇంట్లో ఎవ్వరూ చర్చించలేదు. పదిరోజులలో ఏదో పెట్టుడు ముహూర్తం ఉంటే దానికి పెళ్లికానిచ్చేద్దాం అని నిర్ణయించుకున్నారు.

తమ్ముడి పెళ్ళికి జరిగిన ఆర్భాటాలేవీ నా పెళ్ళికి లేవు.

నాన్నగారు వద్దన్నా అమ్మ మాత్రం నాకు పట్టు పంచె, కండువా కొంది. శుభలేఖలు అచ్చువేయించడమదీ ఏంలేదు.

అరుంధతి అసలేమీ జరగనట్టుగా ఉండటానికి ప్రయత్నిస్తోంది. పెళ్ళి ముహూర్తం నిర్ణయమయ్యాక ఆమెలో రిలీఫ్ కన్పించింది.

నాకిప్పటికీ అరుంధతికి, నాకు పెళ్ళి అంటే నమ్మబుద్ధి కావడంలేదు. అసలు ఏమాశించి తను నాతో పెళ్ళికి సిద్ధపడింది?

అరుంధతి ప్రేమించిన అతను ఏమయ్యాడు?

నేను నా ఆలోచనలలో ఉండగానే పెళ్ళి రోజు వచ్చేసింది.

పెద్దగా బంధువులనెవ్వరినీ పిలవకపోయినా శాస్త్రోక్తంగానే మా వివాహం జరిగింది.

ఆవిధంగా నేనో ఇంటివాడినయ్యాను.

అరుంధతికి భర్తనయ్యాను.

నాకు పెళ్ళి చెయ్యాలన్న అమ్మ కోరిక తీరింది.

నాన్నకు ఉద్యోగం చేసే కోడలు లభించింది.

శాంతికి, శాంతివాళ్ళ అమ్మకు మనశ్శాంతిగా ఉంది. తన కూతురికన్నా చక్కదనాల చుక్కైన అరుంధతికి బ్యాంకు ఉద్యోగి అరుంధతికి మొగుడు ఎక్కడినుంచో గుర్రం ఎక్కి ఓ రోజు ఆమెని వరించి వస్తాడని వాళ్ళు ఇంతకాలం మనసులో ఈర్ష్య పడుతుండేవాళ్ళు.

కానీ తను ఆఖరికి నాలాంటి మూగవాడిని కట్టుకోవాల్సి రావడం వాళ్ళకి ఎంతో సంతృప్తినిచ్చింది. పైకి బాధను వ్యక్తం చేస్తున్నా మనసులో వాళ్ళెంత సంతోషంగా ఉన్నారో తెలిసిపోతూనే ఉంది.

మరి నేను...!?

ఈ పెళ్ళివల్ల అరుంధతి సుఖపడ్తుందా?

అరుంధతి సంతోషంగా ఉంటుందా?

ఈ ప్రశ్నలన్నింటికీ కాలమే జవాబు చెప్పాలి.

★ ★ ★

శాస్త్రప్రకారమే మాకు తొలిరాత్రి కూడా ఏర్పాటు చేశారు.

"ఇంకా తొలిరాత్రి ఏమిటి? అదయ్యాకేగా

పెళ్ళి జరిగింది..." అని శాంతి, వాళ్ళమ్మ మూతి తిప్పుకున్నారు.

కానీ అమ్మ, శారదాంటీ అన్నీ పద్ధతి ప్రకారం జరగాలనుకున్నారు కాబట్టి తొలిరాత్రికి ఏర్పాట్లు చేశారు.

తీరా పెళ్లికూతుర్ని గదిలోకి పంపుదామనుకుంటుండగా మా మరదలు వచ్చి చెప్పింది. "సారీ బావగారూ! మా చెల్లెలు మిమ్మల్ని నిరాశపరిచింది" అంది.

నిజంగానే నిరాశగా అన్పించింది. ఎందుకంటే అరుంధతి ఒంటరిగా కనిపిస్తే ఎందుకీ నాటకం ఆడావని అడగాలనుకున్నాను.

తర్వాత ఆమె చెప్పింది. "పాపం ఆ అమ్మాయికి డేట్ అనుకుంటానురా. వెంటనే పెళ్ళి జరిపించేయాలన్న హడావుడిలో మేమెవ్వరమూ ఆ సంగతి గురించే ఆలోచించలేదు"

శారదాంటీ ఇద్దర్నీ వాళ్ళ ఊరు తీసుకువెడదామనుకున్నారట. కానీ అరుంధతి తనకు సెలవు దొరకదనేసింది. దాంతో శారదాంటీ వాళ్ళు వెళ్లిపోయారు. వెళ్ళేటప్పుడు "కృష్ణా! మా అమ్మాయి ఏదైనా పొరపాటు చేస్తే నా ముఖం చూసి క్షమించు" అన్నారు.

★ ★ ★

అరుంధతితో పెళ్ళయ్యాక నా జీవితంలో పెద్దగా మార్పేమీ రాలేదు. కాకపోతే ఉదయం తను బ్యాంక్‌కి వెళ్ళేలోపు నాకు కాఫీ కలిపిచ్చి టిఫిన్ పెట్టి వెడుతుండేది.

ఒకసారి కార్యం విఫలమవటంతో మళ్ళీ అమ్మ ముహూర్తం పెట్టించింది.

మరో వారం రోజులలో ముహూర్తం ఉందని చెప్పి అమ్మ హడావుడి చేసింది. ఈసారి ఎలాంటి అవాంతరమూ రాలేదు. ఆరోజున మాతో దంపతులకు తాంబూలాలు ఇప్పించింది అమ్మ. మా ఇద్దర్నీ గదిలోకి పంపి బయట తలుపు వేశారు.





గదిలోకి వెళ్ళిన తర్వాత అయిదు నిమిషాలపాటు అరుంధతి బానే వుంది. కానీ అంతలో హఠాత్తుగా కడుపునొప్పి అంటూ బాధతో విలవిల్లాడిపోయింది. నాకు కంగారుగా అన్పించింది. అమ్మా వాళ్ళని పిలుస్తానని వెళ్లబోతుంటే వద్దంది. రాత్రంతా మూడంకె వేసినట్టుగా ముడుచుకుపోయి పడుకుంది.

నాకు మాత్రం రాత్రంతా నిద్రలేదు.

తెల్లవారుఝామున అనుకుంటాను అమ్మ వచ్చి నిద్ర లేపినప్పుడు మాత్రం శోభనమైన పెళ్ళికూతురిలా మామధ్య ఏదో జరిగిందన్నట్టుగా బిల్డప్ ఇచ్చింది.

అరుంధతి ఎందుకిలా చేస్తోందో తెలిస్తే కానీ నాకు మనశ్శాంతి ఉండదు. కానీ ఆమెని ఎలా అడగాలో నాకు అర్థం కావడంలేదు. అసలు తను నాకు ఒంటరిగా చిక్కితేకదా!

అందరూ మాకు శోభనం జరిగిందని అనుకుంటున్నారు. అరుంధతి గదిలోకి వచ్చాక మంచంమీద ఓ చివరగా పడుకుంటుంది.

నేను కింద పడుకుంటాను.

మా మధ్య మాటలేమీ ఉండవు.

ఇంతకుముందే బావుంది.

'కృష్ణా కృష్ణా' అంటూ ఎంతో స్నేహంగా ఉండేది.

ఇప్పుడు...

మేము భార్యాభర్తలం. ఒకే గదిలో పడుకుంటున్నా మా మధ్య సఖ్యత, సంతోషం ఏమీలేవు. అందరూ మేం సంతోషంగా కాపురం చేస్తున్నామని అనుకుంటున్నారు. కానీ మా మధ్య ఏమీ జరగలేదన్నది నాకూ, అరుంధతికి తప్ప ఎవ్వరికీ తెలీదు.

★ ★ ★

రోజులు గడుస్తున్నాయి.

నా వివాహం సంగతి తెలిసి ధర్మారావు గారు ఆనందించారు. పెయింటింగ్స్‌కు సంబంధించిన కొన్ని పుస్తకాలు తెప్పించి నాకు పెళ్ళికానుకగా ఇచ్చారు. పెళ్ళికి

ముందు అరుంధతికి, పెళ్ళి తర్వాత అరుంధతికి చాలా తేడా వుంది. ఈ అరుంధతి అనుక్షణం ఉలిక్కిపడుతోంది.

ఏదో కోల్పోయానన్న బాధ కనిపిస్తోంది.

రాత్రిళ్లు ఆమెకు సరిగా నిద్రపట్టదు. ఒక వేళ నిద్రపట్టినా మధ్యమధ్య మెలకువ వచ్చేస్తుంది. ఒక్కత్తీ కూర్చుని ఏదో ఆలోచిస్తూ ఉంటుంది. ఆ ఆలోచన దేని గురించో, ఆమె సమస్య ఏమిటో నాకు అర్థం కావడం లేదు.

ఓరోజు...

మామూలుగానే నేనూ తనతోపాటు నిద్ర లేచాను. మనిషెందుకో తూలిపడబోతే గభాల్న పట్టుకున్నాను.

బాత్రూమ్‌లోకి వెళ్ళి భళ్ళున వాంతి చేసుకుంది. ఆరోజు, మరుసటిరోజు వరుసగా నాలుగైదు రోజులు అలా వాంతులవడం చూసి అమ్మకేదో అనుమానం వచ్చింది. దానికితోడు ఏమీ తినడంలేదు కూడా.

డాక్టరు వద్దకు తీసుకెడితే మూడో నెల అని తేల్చింది. వార్త బాంబులా సోకింది అందర్కీ.

"ఇదేమిటండీ... ఆ డాక్టరుకుగానీ మతి పోలేదుకదా!" అమ్మ నాన్నగారితో అంటోంది.

"ఏమిటోయ్... ఇంతటి సంతోషకర వార్త విని ఆనందించకుండా అలా దిగాలుగా ముఖం పెట్టేవేంటి? " అన్నారు నాన్న.

"చాల్లెండి సంబడం..." విసుక్కుంది అమ్మ.

"ఏమైంది? ఎందుకలా చిరాగ్గా ఉన్నావు? " అని అడిగారు నాన్న.

"ఏం లేదండీ... డాక్టరు చెప్పింది విన్నారుగా! మన కోడలు కడుపుతో ఉందట"

"అవును... అయితే"

"అయితే ఏంటి నా బొంద? అరుంధతికి మూడో నెల అని కూడా డాక్టరు చెప్పింది" అమ్మ మాటల్లో విసుగు స్పష్టంగా వ్యక్తమయ్యింది.

"అంటే ఇంక ఆరునెలల్లో మనవడు రాబోతున్నాడన్నమాట" సంబరపడ్డారు నాన్న.

"మీ సంబరం సంతకెళ్లినట్టుంది. నేనిక్కడ బుర్రపగలకొట్టుకుని ఛస్తుంటే మీకు చీమకుట్టినట్లయినా లేదే"

"ఏమిటి సీతా! ఇప్పుడేమైంది? " నాన్నగారికి అమ్మ ఏం చెప్పాలనుకుంటోందో అర్థం కాలేదనుకుంటాను.

"అదికాదండీ... వాళ్ళ పెళ్ళి అయ్యి మూడునెలలెక్కడయ్యాయి? పోనీ మన వాడు ఆ పిల్లమీద అఘాయిత్యం చేసిన నాటినుంచి లెక్కవేసినా మూడునెలలు కానిదే... పైగా మొదటిసారి శోభనం ఏర్పాటు చేసినప్పుడు బయట ఉన్నానంటూ శోభనం క్యాన్సిల్ చేసింది కూడానూ"

అప్పటికి నాన్నగారికి విషయం పూర్తిగా అర్థం అయ్యింది. "అంటే... అరుంధతి"

"మన కొంప ముంచింది. పాడుపిల్ల. ముంగిలా ఉంటూ ఎంత నాటకమాడింది. మనవాడ్ని, మనలను అమాయకుల్ని చేసి ఆడించింది" కసిగా పళ్ళు కొరికింది అమ్మ.

శాంతిని పిలిచి అమ్మ అసలు విషయం చెప్పింది. ఆ సంగతి విని శాంతి నిజంగానే ఆశ్చర్యపోయింది.

"నాన్నగారూ! నేను ఆరోజే చెప్పాను. అన్నయ్య అలాంటి పన్లు చెయ్యడు, అరుంధతి ఏదో నాటకం ఆడుతోంది అని. మీరెవ్వరూ నా మాటలు వినిపించుకోలేదు. అనవసరంగా అందరూ కలిసి అన్నయ్యను ఆడిపోసుకున్నారు" అంది వసుంధర.

నాన్నగారేమీ మాట్లాడలేకపోయారు.

శాంతి వెళ్ళి అరుంధతిని అడిగినట్లుంది. ఎంతసేపు బతిమాలినా ఏడుస్తోందే తప్ప అరుంధతి అసలు సంగతి చెప్పడంలేదట.

నేను ప్రేక్షకుడిగా మిగిలిపోయాను.

మళ్ళీ అందరూ వచ్చారు.

శారదాంటీలో అంత కోపాన్ని నేనెప్పుడూ

చూడలేదు. వసు శాంతీ వాళ్ళ అమ్మతో "ఆరోజు అందరూ మా అన్నయ్యను ఆడిపోసుకున్నారుగా! ఇప్పుడేమంటారు? ముందు మీరంతా మా అన్నయ్యకు సారీ చెప్పండి..." అంది.

వాళ్ళంతా సిగ్గుతో తల వంచుకున్నారు.

శారదాంటీ కూడా ఎంతోసేపు బతిమాలారు. చాలాసేపటి తర్వాత అరుంధతి నోరు విప్పింది. ఆమె చెప్పిందాని సారాంశమేమంటే...

అరుంధతి కిరణ్‌ను ప్రేమించింది. ఈ సంగతి శారదాంటీకి కూడా తెలుసు. ఆ అబ్బాయి మంచివాడు కాదనీ, అతనితో స్నేహం, ప్రేమలాంటివి వద్దని ఆంటీ నచ్చ చెప్పారట. అప్పటికి ఆంటీకి అలాగేనని ప్రామిస్ చేసిందట. అక్కడైతే కిరణ్‌ను కలవనివ్వరని ఇక్కడకు ట్రాన్స్‌ఫర్ చేయించుకుంది అరుంధతి. కొన్నిరోజులు మామూలుగానే గడిచాయి. ఒకానొక బలహీనక్షణంలో ఇద్దరూ ఒక్కటయ్యారు.

కిరణ్‌ని పెళ్ళి చేసుకోవడం శారదాంటీకి ఇష్టం లేదు. తల్లి ఇష్టానికి వ్యతిరేకంగా పెళ్ళి చేసుకుందామనుకుంటే కిరణ్‌కి ఉద్యోగం లేదు. ఉద్యోగం వస్తేకానీ పెళ్ళి చేసుకోవడం ఇష్టంలేదు. భార్యమీద ఆధారపడి బతకలేడట.

తొందరపడినందుకు ఫలితంగా అరుంధతి నెలతప్పింది. కిరణ్ ఈమధ్య కన్పించడంలేదు. అక్కడికీ కిరణ్ ఇంటికి ఫోన్ చేసిందట. కొడుకు ఉద్యోగం దొరికితే తప్ప ఇంటికి రానన్నాడని చెప్పారట.

రెండు నెలలు గడిచినా కిరణ్ ఆచూకీ తెలీలేదు. ఈ సంగతి తెలిస్తే తల్లి తనకు అబార్షన్ చేయించేస్తుందేమోనని భయం. ఎలాగైనా బిడ్డను కాపాడుకోవాలి. అలా అని ఒంటరిగా బిడ్డను కనే ధైర్యంలేదు. అందుకే ఈ నాటకం ఆడిందట.

ఆరోజు నేను నిద్రమాత్ర వేసుకోవడం గమనించిందట. తనే బుగ్గమీద గీరుకుని, జాకెట్టు చింపుకుని తనమీద రేప్ జరిగినట్టు నమ్మించింది. నన్ను పెళ్ళి చేసుకుంది.

డాక్టర్లు వచ్చి తనకు మూడోనెల అని చెప్పడం, అమ్మకు అనుమానం రావడంతో అసలు విషయం బయటపడింది.

"ఎందుకు చేశావీపని? కృష్ణను ఎందుకు మోసం చేశావు?" అని ఆంటీ కూతుర్ని కేకలేశారు.

"నా బిడ్డను రక్షించుకోవడానికి" అని ఏడ్చిందట.

పెళ్ళి కాకుండా బిడ్డను కంటే నా బిడ్డకు గౌరవం ఉండదు. నేను ఒక్కత్తినీ బతకలేను. ఇంకెవరైనా అయితే నా ఆటలు సాగవు. కృష్ణ మంచివాడు కాబట్టి అతన్ని పెళ్ళి చేసుకుంటే నేనూ, నా బిడ్డ క్షేమంగా ఉంటామని ఈ పని చేశానని చెప్పిందిట.

శారదాంటీ కోపం ఆపుకోలేక కూతుర్ని బాగా కొట్టింది. ఆంటీ కూతుర్ని అలా కొడుతుంటే అందరూ ప్రేక్షకులే అయ్యారు.

"ఏమైతేనేం మా అబ్బాయి జీవితాన్ని నాశనం చేశావు" అంది అమ్మ కోపంగా.

"లేదండీ! నేను మీ అబ్బాయి జీవితాన్ని నాశనం చేయాలనుకోవడంలేదు. నా బిడ్డను కనేవరకు నాకు ఆశ్రయం ఇస్తే చాలు. ఆ తర్వాత మీ అబ్బాయికి విడాకులు ఇచ్చేస్తాను. ఈలోగా కిరణ్ వచ్చేస్తాడు. ఒకవేళ రాకపోయినా నా బిడ్డను నేను పెంచుకుంటాను. పెళ్ళికాకుండా బిడ్డ పుడితే గౌరవం ఉండదు. అదే మొగుడు వదిలేసిన ఆడదాని బిడ్డ అంటే సంఘం జాలి చూపుతుంది" అని రోదించింది.

"ఇప్పుడేం చేయాలి?" అదో పెద్ద భూతంలాగా కళ్ళముందు నిల్చింది. అరుంధతి ఏడుస్తుంటే నేను భరించలేకపోయాను. తను నన్ను మోసంచేసే పెళ్ళి చేసుకుని ఉండచ్చు. అయినా కూడా ధర్మేచ, అర్థేచ అంటూ నేను ప్రతిజ్ఞ చేశాను. జీవితాంతం తనను కాపాడతానని




అగ్నిసాక్షిగా ప్రమాణం చేశాను. ఆమెకి అండగా నిలవడం నా బాధ్యత. అందుకే వాళ్ళ దగ్గరకు వెళ్ళి అరుంధతికి నా చెయ్యి అందించాను. నా చర్యకు అందరూ విస్తుపోయారు.

నేను రాసిన కాగితం నాన్నగారి చేతికిచ్చాను. "అరుంధతి నా భార్య. తను నన్ను మోసం చేసే పెళ్ళి చేసుకుని ఉండచ్చు కానీ నాకు అది మోసం అనిపించడంలేదు. తన మాతృత్వాన్ని కాపాడుకునేందుకు ఏ స్త్రీ చేయలేని త్యాగం తను చేసిందనిపిస్తోంది. అందుకే అరుంధతి నాకు బరితెగించినదానిలా కన్పించడంలేదు. ఆమెలో ఓ మాతృమూర్తే నాకు కన్పిస్తోంది. తను ఏం ఆశించి నన్ను పెళ్ళి చేసుకుందో ఆ లక్ష్యం నెరవేరేవరకూ నేను తనకు అండగా ఉంటాను. ఆ తర్వాత ఏం చేయాలనేది అప్పుడు ఆలోచిస్తాను. ఇక ఈ విషయం గురించి ఇంట్లో చర్చించద్దు" అని ఉంది ఆ కాగితంలో.

నా నిర్ణయానికి అందరూ విస్తుపోయారు.

అరుంధతి కృతజ్ఞతా సూచకంగా నా కాళ్ళమీద పడిపోయింది.

"వీల్లేదురా... అది ఈ ఇంట్లో ఉండటానికి నేనొప్పుకోను" అన్నారు నాన్న.

అమ్మ, శ్రీనివాసు ఆఖరుకు వరసకు అక్క అయిన శాంతి కూడా ఇదే అభిప్రాయం వెలిబుచ్చారు.

నేను నా నిర్ణయాన్ని మార్చుకోకపోయేసరికి, "భార్య కావాలనుకుంటే ఇంట్లోంచి నువ్వు కూడా వెళ్ళిపోవచ్చు" అని తన నిర్ణయం చెప్పేశారు నాన్న.

నాన్నగారి నిర్ణయాన్ని మిగిలినవారు బలపరిచారు.

శారదాంటీ బాధపడింది.

"మా అమ్మాయికోసం కన్నవాళ్ళని బాధపెట్టకు కృష్ణా" అని చెప్పారు.

నేను మాత్రం వినలేదు. అరుంధతికి అండగా నిలవాలనుకున్నాను. అందుకే రెండురోజులు టైమ్ ఇస్తే ఇల్లు చూసుకుంటానని చెప్పాను. ఆ రాత్రికి ఎక్కడవారక్కడ వెళ్ళిపోయారు.

రెండురోజులపాటు కాళ్ళ చెప్పులు అరిగేదాకా తిరిగాను. రెండోరోజుకి ఇల్లు దొరికింది. ఇంటిగలావిడ పేరు జానకమ్మ.

మేమిద్దరం ఇంట్లోంచి వచ్చేస్తుంటే అమ్మ చాలా బాధపడింది. "కృష్ణా! నిన్న వచ్చిన భార్యకోసం మమ్మల్ని వదిలి వెళ్ళిపోతావురా" అని ఏడ్చింది.

"చెల్లెలి చదువుకు నేనే డబ్బు ఖర్చు చేస్తాను. ఎప్పటిలా నెలనెలా అయిదారు వేలు ఇంటి ఖర్చులకు ఇస్తాను" అని రాసి చూపాను.

ఆ మాట విన్నాక అమ్మావాళ్ళ బాధ కొంచెం తగ్గిందనిపించింది నాకు.

అటు ఆర్థికంగా ఆదుకుంటానన్నందుకే కాదు, కొడుకు తనకి మానసికంగా దగ్గరగా వున్నాడన్న తృప్తి అమ్మ ముఖంలో కనిపించింది నాకు.

"అమ్మా! నేనూ, అరుంధతీ ఇక్కడవుంటే మీకే కాదు. మాకూ మనశ్శాంతి వుండదు. ఈ పెళ్ళి దైవనిర్ణయం. మానవత్వంతో ఆ మాతృమూర్తిని ఆదుకోవాలనే నేను నిర్ణయించుకున్నాను. ఈ మాత్రం ధైర్యాన్ని, స్థైర్యాన్ని ఇచ్చింది కూడా ఆమె తల్లే. ఆవిడా నా దృష్టిలో మాతృమూర్తే. ఈవిధంగా నేను జీవితంలో నా కాళ్లమీద నేను నిలబడేలా చేసిన శారదాంటీ ఋణాన్ని ఇలా తీర్చుకోవాలని నిర్ణయించుకున్నాను. అలా అని నన్ను కన్నతల్లిని, కుటుంబాన్ని నిర్లక్ష్యం చెయ్యను" అని కూడా రాసిచ్చాను.

మేమిద్దరం ఆవిధంగా కొత్త కాపురం పెట్టాం.

అరుంధతి ఏదో లోన్ పెట్టి ఇంట్లోకి కావాల్సిన వస్తువులన్నీ కొంది. నా దినచర్యలో ఏవిధమైన మార్పు లేదు.




కాకపోతే ఉదయమంతా ఖాళీగా ఉండ టమే విసుగ్గా ఉంటోంది. ఓరోజు అరుంధతి మాటల మధ్యలో జానకమ్మగారికి నేను చీరెలమీద చక్కగా పెయింట్ చేస్తానని, పిల్లలకు పెయింటింగ్ నేర్పుతానని చెప్పింది.

అంతే రెండోరోజుకల్లా నలుగురు పిల్లలు పెయింటింగ్ నేర్చుకుంటామంటూ వచ్చారు. ఓ పది చీరలదాకా పెయింట్ చేయమని ఇచ్చి వెళ్ళారు.

నా అదృష్టం ఏమంటే నా చుట్టూ కొందరు మంచివాళ్ళు ఉంటున్నారు. వాళ్ళంతా నాకు సహాయం చేస్తున్నారు. ముఖ్యంగా నాకు చేతినిండా పని దొరుకుతోంది.

నిజానికి ఇంతకుముందుకన్నా ఇప్పుడు ఎక్కువ సంపాదించాలి. ఎందుకంటే అటు అమ్మావాళ్ళకూ ఇవ్వాలి, ఇటు నా సంసారానికి ఖర్చు పెట్టాలి.

మేము కొత్తింటికి రాగానే అరుంధతిని డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళాను, డాక్టరు చెప్పిన మందులు కొన్నాను.

ఇంటికి రాగానే చెప్పాను (అంటే కాగితం మీద రాశాను) నాకు తనమీద ఎలాంటి కోపమూ లేదని, మనసులో మరో ఆలోచన పెట్టుకోకుండా వేళకి తింటూ, మందులు వేసుకుంటూ పండంటి బిడ్డను కనమని చెప్పాను.

అరుంధతికి నెలలు నిండుతున్నాయి.

జానకమ్మగారు తొమ్మిదో నెల వచ్చాక సీమంతం జరిపించారు. నా తప్పు లేకుండా అమ్మావాళ్ళని పిలిచాను కానీ వాళ్ళెవ్వరూ రాలేదు. చెల్లెలు వద్దామనే అనుకుందట. ఆ ఇంటిగడప తొక్కితే మళ్ళీ ఇంట్లోకి అడుగు పెట్టడానికి వీల్లేదని నాన్న అన్నారట. అందుకే రాలేదురా అంది. పార్క్‌లో కలిసి కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

వసు అన్నట్టు నా డబ్బు పనికి వచ్చింది కానీ కొడుకు ఇంతటివాడు కావడానికి శారదాంటీ కారణంకదా! ఆవిడ కూతురికి కష్టం వస్తే ఆదుకుని రుణం తీర్చుకుంటున్నాడు అని వాళ్ళు సర్దుకోలేకపోయారు.

అరుంధతికి ఏ క్షణానైనా కాన్పు రావచ్చని జానకమ్మగారు అన్నారు. అందుకే వీలైనంతవరకూ నేను బయటకు వెళ్ళడం లేదు.

తొమ్మిదో నెల నిండిన పదిరోజులకను కుంటాను అరుంధతి డెలివరీ అయ్యింది. రూమ్‌లోకి వెళ్ళేముందు తను చేసిన మోసానికి క్షమాపణ చెప్పింది. జాగ్రత్తలు చెప్పింది. ఒకవేళ తనకేదైనా అయితే తన బిడ్డను అన్యాయం చేయద్దని వేడుకుంది.

ఆరోజు కూడా మాకు సహాయానికి ఎవ్వరూ రాలేదు.

జానకమ్మగారొక్కరే మాకు అండగా నిలబడ్డారు. జరిగినదంతా అరుంధతి ఆవిడకు చెప్పింది. అయినా కూడా ఎప్పటిలానే చూసేవారు తప్ప నన్నుకానీ, అరుంధతిని కానీ కించపరిచినట్టుగా మాట్లాడేవారు కాదు. నిజంగా ఆవిడ సంస్కారానికి చేతులెత్తి మొక్కాలనిపించేది నాకు.

అరుంధతికి మగపిల్లాడు పుట్టాడు.

ఆమెకు మెలకువ వచ్చాక బిడ్డను చూసుకుని ఎంతో సంబరపడింది. ఇన్నాళ్లుగా తను పడిన కష్టం అంతా మర్చిపోయింది.

నేనూ, అరుంధతీ పీటలమీద కూర్చుని బాలసారె చేశాం. ప్రతీసారీ నేను అమ్మావాళ్ళని పిలుస్తూనే ఉన్నాను. కానీ వాళ్ళకు నామీద కోపం. శారదాంటీకి నన్ను మోసం చేసిందని కూతురంటే కోపం. ఆవిధంగా ఆమె పుట్టింటివాళ్ళు నా పుట్టింటివాళ్ళు కూడా మాకు దూరమయ్యారు.

చందన్ పుట్టిన అయిదు నెలలకు అనుకుంటాను. ఓరోజు కిరణ్ ఇంటికి వచ్చాడు. అరుంధతికోసం బ్యాంక్‌కి వెడితే అతనికి ఇక్కడి అడ్రస్ ఇచ్చారట.

కిరణ్‌ని చూడగానే అరుంధతి ముఖంలో

ఒక్కసారిగా వెలుగొచ్చింది. గబగబా చందన్‌ని తీసుకొచ్చి చూపబోయింది.

కిరణ్ బాబుని చూడటంపట్ల పెద్ద ఆసక్తి చూపలేదు. వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటారని నేను బాబుని తీసుకుని బెడ్‌రూమ్‌లోకి వెళ్ళిపోయాను.

"నన్నిలా మోసం చేస్తావనుకోలేదు అరుంధతీ" అంటున్నాడతను.

ఆ బిడ్డ తమ ఇద్దరికీ పుట్టిందనీ, ఏ పరిస్థితుల్లో నన్ను పెళ్ళి చేసుకోవాల్సి వచ్చిందో వివరించి చెప్పింది. సిగ్గువిడిచి మా మధ్య ఎలాంటి శారీరక సంబంధం కూడా లేదని చెప్పింది అరుంధతి.

అతను పెద్దగా స్పందించలేదు.

"కిరణ్! కృష్ణ చాలా మంచివాడు. ఇక అతన్ని బాధపెట్టడం నాకు ఇష్టంలేదు. అతనికి విడాకులు ఇచ్చేస్తాను. మనిద్దరం పెళ్ళి చేసుకుందాం" అంది అరుంధతి.

అతనేం జవాబు చెప్తాడా అని నేనూ చెవులు రిక్కించి విన్నాను.

"చూద్దాంలే. నేను మళ్ళీ కలుస్తాను" అని చెప్పి అతను వెళ్ళిపోయాడు.

సరేనంటాడని ఊహించిన అరుంధతి అతనలా పెళ్ళి విషయం దాటేసేసరికి హతాశురాలైంది. ఆ తర్వాత చాలారోజుల వరకు మనిషి డల్‌గానే ఉంది.

వాళ్ళు కిరణ్‌తో వెళ్ళిపోతే నేనేం చేయాలి? ఒంటరిగా ఉండాలా! లేక తిరిగి అమ్మావాళ్ల దగ్గరకు వెళ్ళిపోవాలా? ఒకవేళ అమ్మావాళ్ల దగ్గరకు వెడితే వాళ్లు రానిస్తారా?

అసలు చందన్‌ని వదిలి నేనుండగలనా?

ఇలా ఎన్నో రకాలుగా ఆలోచించేవాడిని.

ఏది ఏమైనా అరుంధతి కోరుకున్న జీవితం తనకు దక్కితే చాలనుకునేవాడ్ని.

చందన్ జానకమ్మగారికి కూడా బాగా అలవాటయ్యాడు. నేను, వాళ్ళమ్మ బయటకు వెళ్లేప్పుడు చందన్‌ని జానకమ్మగారి దగ్గర వదిలివెడుతుంటాం. పైగా నేను పార్క్‌కు నాలుగు గంటలకల్లా బయలుదేరి వెడతాను. అరుంధతి ఇంటికి వచ్చేసరికి సాయంత్రం ఆరుగంటలవుతుంది. ఈ రెండు గంటలు చందన్ జానకమ్మగారి దగ్గరే ఉంటాడు.

ఈమధ్య కొన్ని పత్రికలవాళ్లని కలిశాను. వాళ్లు కథలు, సీరియల్స్ ఇస్తే వాటికి సరిపోయే బొమ్మలు వేసిస్తున్నాను. ఈ సలహా ఇచ్చింది అరుంధతే.

కిరణ్ ఏమన్నాడో అడుగుదామనిపిస్తుంది. కాని ఆమె చెప్పినప్పుడే విందాం లెమ్మని ఊర్కుంటున్నాను.

అరుంధతి ఇంట్లో ఫోను పెట్టించింది. అప్పుడప్పుడు వాళ్ల అమ్మకు ఫోన్ చేస్తుంటుంది. "అమ్మకు నిన్ను నేను మోసం చేసి పెళ్ళిచేసుకున్నానని కోపం కృష్ణా! నాతో సరిగా మాట్లాడటమే లేదు" అని బాధపడేది.

అరుంధతికి తెలియకుండా ఓసారి ఆంటీకి ఉత్తరం రాశాను. 'మేమిద్దరం చాలా ఆనందంగా ఉన్నాం. మీరింకా జరిగిపోయినవి మనసులో పెట్టుకుని అరుంధతితో మాట్లాడటం మానేయద్దు. మీ అమ్మాయి చాలా బాధపడుతోంది. తనను నాకోసం క్షమించండి' అని రాశాను.

ఆ తర్వాతనుంచి ఆంటీ కొంచెం మాట్లాడేవారు. అంతేకానీ అరుంధతిని పూర్తిగా క్షమించలేకపోయారు.

కిరణ్ మరుసటిరోజు వచ్చి తన నిర్ణయం చెప్తానన్నాడని అరుంధతి నాతో అంది.

ఆ నిర్ణయం ఎలాంటిదై ఉంటుందోనని మేమిద్దరం టెన్షన్‌గానే గడిపాం.

కిరణ్ ఏం నిర్ణయం తీసుకుంటాడు? ఏమో... అతనొస్తే కానీ తెలీదు.

★ ★ ★

సాయంత్రం ఏడు గంటలవుతుండగా కిరణ్ వచ్చాడు. మనిషి చాలా ముభావంగా ఉన్నాడు.

కిరణ్ సమాధానం కోసం అరుంధతితో పాటు నేను కూడా ఎదురుచూస్తున్నాను. అయిదు నిమిషాలపాటు మా ఇంట్లో మౌనందే రాజ్యమయ్యింది.

"సారీ అరుంధతీ! నేనెంత ప్రయత్నించినా అమ్మావాళ్లు మన పెళ్ళికి ఒప్పుకోవడం లేదు. నేను వాళ్లకి ఒక్కడ్నే కొడుకుని. వాళ్లని బాధపెట్టడం నాకు ఇష్టం లేదు. జరిగిందంతా మర్చిపోదాం" ఒక్కో అక్షరాన్ని కూడదీసుకుంటున్నట్టుగా చెప్పాడు.

"మర్చిపోదామా... ఎంత తేలిగ్గా చెప్పావు కిరణ్" వేదాంతిలా నవ్వింది అరుంధతి. "నువ్వు మంచివాడవు కాదని, నిన్ను నమ్మొద్దని అమ్మ ఎంతగానో చెప్పింది. కానీ నేనే... నేనే యవ్వన మైకంలో ఏం చేస్తున్నానో తెలీక కన్నవాళ్ల మాటలు పెడచెవిన పెట్టాను. చివరకు అమ్మ మాటే నిజమైంది చూశావా!"

"తప్పంతా నాదేనన్నట్టు మాట్లాడతావేం... నాకోసం ఆగకుండా పెళ్ళి చేసుకుంది నువ్వు! ఈ పిచ్చాడితో సంసారం పెట్టింది నువ్వు"

"అవును... పెళ్ళిచేసుకున్నాను" గట్టిగా అరిచింది అరుంధతి." కానీ ఆ పెళ్ళి చేసుకున్నది ఎవరికోసం? మన బిడ్డకోసం కాదా! కడుపు చేసి నువ్వు కనిపించకుండా పోతే పెళ్ళికాకుండా బిడ్డను కంటే గౌరవం కాదన్పించి మన బిడ్డను రక్షించుకోవడం కోసం పెళ్ళి చేసుకున్నాను. ఈ మంచి మనిషికి ద్రోహం చేశాను" రోదించసాగింది అరుంధతి.

కిరణ్ మాట్లాడలేదు.

"చెప్పు కిరణ్! నామీద నీకు నమ్మకం లేదా?"

"చూడు అరుంధతీ! నీమీద నాకు నమ్మకం ఉంది. కానీ ఓ ఆడ, మగ ఒకే ఇంట్లో కలిసుంటే ఏదో ఒకరోజు వారి వయసు వారిని తొందరపెడుతుంది అని నాకు తెలుసు. అందులోను మీ ఇద్దరికీ పెళ్ళయ్యింది. భార్యాభర్తల మధ్య దాంపత్య జీవితం లేకుండా..." అంటూ ఆగిపోయాడు.

"ఆగిపోయావేం. చెప్పు" భద్రకాళిలా అరిచింది అరుంధతి.

"ఇన్నాళ్లుగా ఇతడితో సంసారం చేస్తున్న నిన్ను నేను పెళ్ళిచేసుకోలేను. అది మా పేరెంట్స్ కూడా ఒప్పుకోరు"

కిరణ్ మాటలు పూర్తికాకముందే అరుంధతి అతని చెంపలు వాయించింది. "ఇంకొక్క మాట మాట్లాడినా నిన్ను చంపేస్తాను. ఛీ సిగ్గులేని కుక్క. నన్ను... నన్ను అనుమానిస్తావా! పోరా... ముందు నా కళ్లెదుటనుంచి పో. ఇన్నాళ్లు నిన్ను పెళ్ళిచేసుకోలేకపోయానని బాధపడేదాన్ని. ఇకనుంచి బాధపడను. నీలాంటివాడిని పెళ్ళిచేసుకోవడంకన్నా ఈ మంచి మనిషికి సేవకురాలిగా ఉన్నా నా జన్మ ధన్యం అయిపోతుంది. వెళ్లరా... జీవితంలో నీ ముఖం నాకు చూపించకు" కిరణ్‌ని ఇంట్లోంచి నెట్టేసి తలుపు వేసేసింది అరుంధతి.

ఆ రాత్రి అంతా కుళ్ళికుళ్ళి ఏడుస్తూనే ఉంది. తననెలా ఓదార్చాలో నాకు అర్థంకావడం లేదు.

ఆ మర్నాటికి బాగా జ్వరం వచ్చేసింది. మామూలు జ్వరమనుకున్నాను కానీ ఆస్పత్రిలో చేర్చాల్సివచ్చింది.

వెంటనే జానకమ్మగారితో శారదాంటీకి ఫోన్ చేయించాను. ఆవిడ ఆవేశంతో ఊగిపోయింది. "ఆ ముదనష్టపుదాని గురించి నాకెప్పుడూ ఫోన్ చేయద్దని చెప్పిందట. ఒకసారి కృష్ణను మోసంచేసి పెళ్ళిచేసుకున్నది కాక తిరిగి వాడితో వెళ్ళిపోదామనుకుందా! వాడు దాన్ని తిరస్కరించాడా. ఛీ... వింటుంటేనే కంపరంగా ఉంది. అది పుట్టగానే దాని నోట్లో ఓ వడ్లగింజ వేసి చంపేసినా బాగుండేది. అదే నేను చేసిన పొరపాటు. ఇప్పటికైనా కృష్ణను దానిని

వదిలేయమనండి. నామీద గౌరవంతో అరుంధతిని భరిస్తూ వాడి జీవితాన్ని నాశనం చేసుకోవద్దని చెప్పండి" అన్నారట.

అమ్మావాళ్లు కూడా అదే అభిప్రాయం వెలిబుచ్చారు.

చెల్లెలైతే "అరుంధతిని వదిలేయకపోతే ఇక జీవితంలో నీ ముఖం చూడనురా అన్నయ్యా" అంది.

మురళికి కూడా కోపం వచ్చింది.

ఎవరేం చెప్పినా నేను అరుంధతిని వదులుకోలేను. తను నా భార్య. ఇదే తప్పు నావల్ల జరిగితే అరుంధతికి నన్ను వదిలేయమని చెప్తారా? లేదు కదా! మగాడన్నాక ఏవో జరుగుతుంటాయి. మనమే ఓర్పు వహించాలి. సర్దుకు పోవాలి అని చెప్తారు.

ఆడవాళ్లకి ఒక న్యాయం మగవారికి ఒక న్యాయం ఎందుకు? కష్టమో సుఖమో ఆ దేవుడు మమ్మల్ని భార్యాభర్తల్ని చేశాడు. జీవితాంతం నేను ఆమెకు అండగానే ఉంటాను తప్ప ఆమెని వదిలేసే ప్రసక్తి లేదు.

వారంరోజుల తర్వాత అరుంధతిని ఆస్పత్రినుంచి డిశ్చార్జ్ చేశారు. ఇంటికి వచ్చాక కూడా మనిషెప్పుడూ ఏదో కోల్పోయినట్టుగా శూన్యంలోకి చూస్తూ ఉండేది. చందన్‌ను అసలు దగ్గరకు తీసేదికాదు.

అరుంధతి స్నేహితురాలు వనజ వచ్చింది. ఆవిడ కూడా అరుంధతి పని చేసే బ్యాంక్‌లోనే పనిచేస్తోంది. వనజ వచ్చి అరుంధతిని ఎంతగానో ఓదార్చేది. ఆవిడ సలహామీదే అరుంధతి ఓ నెలరోజులపాటు బ్యాంక్‌కి సెలవుపెట్టింది.

నేను కూడా పనులన్నీ మానేసి ఇంట్లోనే ఉంటున్నాను. వీలైనంత వరకు అరుంధతికి ధైర్యం చెప్తూనే ఉన్నాను.

ఓరోజు అరుంధతి నా దగ్గరకు వచ్చింది. "మీతో కొంచెం మాట్లాడాలి" అంది.

చెప్పమన్నట్లు చూశాను.

"నావల్ల మీరు అందరికీ దూరమయ్యారు. ఇంకా మిమ్మల్ని బాధపెట్టడం భావ్యం కాదు. మనం విడాకులు తీసుకుందాం" అంది.

"విడాకులు తీసుకుని ఏం చేస్తావ్. ఎక్కడుంటావ్?" అని కాగితం మీద రాశాను.

"తెలీదు. దిక్కులేనివాడికి దేముడే దిక్కని. ఎక్కడో అక్కడ ఉంటాను" దుఃఖం రాకుండా పంటిబిగువున బాధను దాచిపెట్టి చెప్పింది.

"పోనీ మళ్ళీ పెళ్ళిచేసుకుంటావా!"

"లేదు... లేదు" తల అడ్డంగా తిప్పింది.

"నేనొక మాట చెప్తాను వింటావా?"

ఏమిటన్నట్టు చూసింది.

"నాకూ ఎవ్వరూ లేరు. నీకూ ఎవ్వరూ లేరు. ఒకరకంగా ఇద్దరం అనాథలమే. ఇప్పుడు నేను విడాకులిచ్చినంత మాత్రాన మా అమ్మావాళ్లు నాకు మెచ్చి మేక తోలేమీ కప్పరు. అంటే నన్నేమీ అందలం ఎక్కించరు. మహా అయితే నువ్వు వెళ్లిపోయాక ఈ ఇల్లు ఖాళీ చేసి తిరిగి మా ఇంటికి వెళ్ళిపోతాను అంతే! నేనెక్కడున్నా అమ్మావాళ్లకు నెలానెలా డబ్బు పంపిస్తూనే ఉన్నాను కాబట్టి వాళ్ళని బాధపెట్టిందేమీలేదు. వాళ్లకు కావాల్సింది కూడా నా సంపాదనే తప్ప నా సంతోషంకాదు. నిజంగా వాళ్లు నా సంతోషాన్నే కోరుకుంటే నా సంతోషం నీతో ముడిపడి ఉందని నేను చెప్పినప్పుడు నాకోసమైనా నిన్ను క్షమించాలి కదా! అలా చేయలేదు.

చూడు అరుంధతీ! ఆ భగవంతుడు మనిద్దర్నీ భార్యాభర్తలుగా బతకమని ముడేశాడు. అలా బతకలేకపోతే ఒకే ఇంట్లో ఇద్దరం కనీసం మంచి స్నేహితులుగా ఉందాం. ఎవరికి వారం అనాథల్లా ఒంటరిగా బతికే బదులు ఒకరికొకరుగా ఒక ఇంట్లో బతుకుదాం. ఇదేదో నీ పరిస్థితికి జాలిపడి చెప్తున్నది కాదు. నువ్వు కోరుకున్నట్టుగా చందన్ తండ్రిలేనివాడుగా

కాకుండా వాడికి నేనే తండ్రినవుతాను. ఒక్క మాట... నా మనసులో మాట చెప్తాను. మీరిద్దరూ నాకు కావాలి. మిమ్మ ల్నిద్దరినీ నేను వదులుకోలేను ఆ తర్వాత నీ ఇష్టం" అని రాసిచ్చాను.

ఆరోజు తర్వాత మా ఇద్దరి మధ్య మరో సారి ఈ ప్రసక్తిరాలేదు. ఓరోజు కిరణ్ పెళ్ళి శుభలేఖ పోస్ట్‌లో వస్తే దాన్ని అరుం ధతికి కన్పించకుండా దాచేశాను.

ఆ తర్వాత మా మధ్య ఎలాంటి అభిప్రా యబేధాలు రాలేదు.

మా జీవితం సజావుగానే గడుస్తోంది.

ఓసారెప్పుడో అరుంధతి హఠాత్తుగా అడి గింది. "మీరు వేసిన పెయింటింగ్స్ మీ దగ్గర ఎన్ని ఉన్నాయి? " అని.

"ఓ యాభైదాకా ఉంటాయని" చెప్పాను. పెయింటింగ్ వేయగానే దాన్ని అందంగా ఫ్రేమ్ చేయించడం నాకు అలవాటు.

ఆ తర్వాత ఆ టాపిక్ గురించి అరుం ధతి ఏమీ మాట్లాడలేదుగానీ ఓరోజు సాయంత్రం ఆర్ట్ ఎగ్జిబిషన్ జరుగుతోం దంటూ మమ్మల్ని బయలుదేరతీసింది.

ఒక్కో స్టాల్ చూసుకుంటూ వెళ్లాం. ఓ చోట అన్నీ నా పెయింటింగ్స్ కన్పించాయి.

అరుంధతి వంక అపనమ్మకంగా చూశాను. "స్టాల్‌కి ఎమౌంట్ కట్టి తీసుకు న్నాను" అంది తను.

'ఎంత కట్టావు? ' అని సైగచేశాను.

"పదిహేను వేలు" చెప్పింది అరుంధతి.

అమ్మో! అంత డబ్బా అనిపించింది.

కానీ అందరితోపాటు అక్కడ నా పెయిం టింగ్స్ ఉండటం నాకెంతో సంతృప్తిని ఇచ్చింది. 'థాంక్స్' అని నా కళ్లతోనే చెప్పాను.

అరుంధతి సంతృప్తిగా నవ్వింది.

నా పెయింటింగ్స్ బాగా సేల్ అయ్యాయి. వాటిని అమ్మేయడం బాధగా అనిపించినా ఆ బాధను పక్కన పెట్టాను. నేను ఊహించనంత ఎమౌంట్ వచ్చింది.

ఈ విధంగా అడపాదడపా ఎగ్జిబిషన్స్ నిర్వహిస్తూ బానే సంపాదిస్తున్నాను. రెండు సంవత్సరాలు గడిచాయి.

అయినా మేమిద్దరం నేటికీ స్నేహితులు గానే మసులుకుంటున్నాం. మా ఇంటికి ఎవ్వరూ రారు! మేము ఎవ్వరింటికీ వెళ్ళం. నేను, అరుంధతి, చందన్ మా ముగ్గురిదీ ఓ ప్రపంచం.

నాకీ జీవితం ఎంతో సంతృప్తిగా ఉంది.

★ ★ ★

అరుంధతి అప్పుడే జానకమ్మగారింటికి వెళ్ళింది తనకు ఫోన్ వచ్చింది. అవతలి వాళ్లు ఫోన్ ఎత్తి 'అరుంధతి ఉందా? ' అని అడిగారు. అలాంటప్పుడు తను ఇంట్లో ఉంటే ఫోన్ పక్కనపెడతాను. లేదా ఫోన్ పెట్టేస్తాను. నాకు మాట్లాడటం రాదని అరుంధతికి తెల్సినవారందరికీ తెలుసు. అందుకే అర్థంచేసుకుంటారు.

అరుంధతిని పిలుచుకు రావడానికి జాన కమ్మగారింటికి వెళ్లాను. వాళ్ళిద్దరి మాటల్లో నా ప్రస్తావన వచ్చింది.

"చూడమ్మా! నీకన్నా పెద్దదాన్ని. తల్లి లాంటిదాన్ని. నీ మంచి కోరే చెప్తున్నాను. కృష్ణకేం తక్కువ? అంత మంచి వ్యక్తిని మనం చూడగలమా? నువ్వు చేసిన పనికి నీ కన్న తల్లితండ్రులే నిన్ను అసహ్యించుకు న్నారు. బంధువులు నిన్ను రానివ్వలేదు. ఆఖరకు నిన్ను ప్రేమించిన వ్యక్తి కూడా నిన్ను మోసం చేసి వెళ్ళిపోయాడు. కానీ కృష్ణ... నిన్ను పెళ్ళి చేసుకున్నందుకు నీకోసం అందరినీ వదులుకున్నాడు. నీకోసం ఎంతో త్యాగం చేశాడు. అలాంటి ఆతనికి నువ్వు ఇంకా ద్రోహం చేయవచ్చా" అని అడుగుతున్నారు.

"నిజమే... కృష్ణ లేకపోతే నా జీవితం ఏమయ్యేదో తల్చుకుంటేనే నాకు ఎంతో భయం వేస్తుంది. కృష్ణ మనిషి కాదు దేవుడు. ఎన్ని జన్మలెత్తినా నేను ఆయన రుణం తీర్చుకోలేను"

"అవును కదా! మరి అలాంటప్పుడు కృష్ణని దూరంగా ఎందుకు ఉంచుతున్నావ్? " జానకమ్మగారి ప్రశ్నకు అరుంధతి దగ్గర సమాధానం లేదు.

"అరుంధతీ! నా మాట వింటావు కదూ!" బతిమాలుతున్నట్లుగా అడిగారు జానకమ్మ.

"చెప్పండమ్మా!"

"ఏం లేదు. పంతులుగారిని పిలిపిస్తాను"

అరుంధతి సమాధానమేమీ నాకు వినిపించలేదు.

అప్పుడే వచ్చిన వాడిలా బెల్ కొట్టాను.

"ఎవరూ!? " ముందుగా జానకమ్మగారి గొంతు ఆ తర్వాత తలుపు తీయడం జరిగాయి.

నన్ను చూడగానే "ఏంటి కృష్ణా!" అన్నారు.

అరుంధతికి ఫోన్ వచ్చిందని సైగచేసి చెప్పాను

"అమ్మాయ్! మీ ఆయన వచ్చాడు. నీకు ఫోన్ వచ్చిందట" కేకవేశారావిడ.

అరుంధతి గబగబా మా వాటాలోకి వెళ్ళింది. నేను వెళ్ళబోతుంటే "బాబూ! కృష్ణా! ఒక్కనిమిషం ఇలారా" అన్నారావిడ.

నేను లోపలికి వెళ్లాను.

ఇంతకుముందు అరుంధతికి చెప్పిన మాటలే నాకూ చెప్పారు. నేనేం సమాధానం చెప్పగలను?

మరో నాలుగు రోజుల తర్వాత అనుకుంటాను ఆరోజు అరుంధతి బ్యాంక్‌కు సెలవు పెట్టింది. ఆ రాత్రికి జానకమ్మగారు "ఈరోజు చందన్ నా దగ్గర పడుకుంటాడు" అని తీసుకువెళ్లారు.

అప్పటిదాకా బెడ్‌రూమ్ వైపుకే అడుగు పెట్టనీయలేదు జానకమ్మగారు.

బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి చూశాను.

అసలు సంగతి నాకు అర్థం అయ్యింది. ముహూర్తం టైమ్‌కి అరుంధతిని గదిలోకి పంపారు.

చాలాసేపు మా మధ్య మౌనందే రాజ్యం అయ్యింది.

"అరుంధతీ! నువ్వు దీనికి మనస్ఫూర్తిగా అంగీకరిస్తున్నావా? " సైగచేసి అడిగాను.

అరుంధతి సిగ్గుతో తల వంచుకుంది.

ఆ తర్వాత మేము పూర్తిగా ఒకటయ్యాం. ఆరోగ్యకరమైన శృంగారం మనిషిని ఎంతగానో సేదతీరుస్తుందని తర్వాతర్వాత నాకు బాగా అర్థమైంది. మరో సంగతేంటంటే దాంపత్య బంధం మమ్మల్ని మరింత దగ్గర చేసింది.

ఒకపక్క ఆర్ట్ ఎగ్జిబిషన్స్.

మరోపక్క పెయింటింగ్ స్కూలు.

ఇంకోపక్క శారీ యూనిట్ అన్నీ బాగానే నడుస్తున్నాయి.

★ ★ ★

కాలగర్భంలో మరో రెండేళ్లు గడిచాయి. చందన్‌ను స్కూల్లో చేరిపించాను. పిల్లల మధ్య గ్యాప్ ఉండాలని జాగ్రత్తలు తీసుకున్న మేము చందన్ స్కూల్లో చేరాడు కాబట్టి మరో బిడ్డ కావాలనుకున్నాం.

అరుంధతి నెల తప్పిన రోజు నా ఆనందానికి అంతులేదు. ఆమెను పసిపాపలా, కంటికి రెప్పలా చూసుకుంటున్నాను.

ఈ సందర్భంలో కిరణ్ వచ్చాడు.

కిరణ్ మూలంగా ఇప్పుడు అరుంధతి చావుబతుకులమధ్య కొట్టుమిట్టాడుతోంది.

చందన్ ఏమయ్యాడో అర్థంకావడం లేదు.

టైం ఎంతయ్యిందో తెలీలేదు. తెలుసుకోవాలని కూడా అనిపించలేదు. అంతలో డాక్టరుగారు థియేటర్‌లోంచి బయటకు వచ్చారు. ఆయన్ని చూడగానే జానకమ్మగారు కూర్చున్నచోటునుంచి లేచి గబగబ ఆయన దగ్గరకు వెళ్లారు.

"డాక్టరుగారూ! అమ్మాయికి ఎలా వుంది? తల్లీ బిడ్డ క్షేమమే కదా!" అని అడిగారు.

"మీరేమవుతారు" అడిగాడు డాక్టరు.

"నేను... అరుంధతి తల్లిని" అన్నారు జానకమ్మ.

డాక్టరుకు తెలుగు సీరియల్స్ చూసే అలవాటున్నట్టుంది "అలాగా! అయితే మీరు అమ్మమ్మ అయ్యారు. ఆడపిల్ల పుట్టింది. తల్లి, బిడ్డా క్షేమంగా ఉన్నారు" అని వెళ్ళిపోయారు.

ఆ మాట విన్నాక అంతదాకా పడుతున్న నా టెన్షన్ అంతా చేత్తో తీసేసినట్టుగా మాయమైంది. 'హమ్మయ్య!' అనుకున్నాను.

జానకమ్మగారు నా దగ్గిరికి వచ్చి ఆనందంగా చెప్పారు. "బాబూ! ఆడపిల్ల పుట్టిందట. అంటే మీ ఇంట్లో లక్ష్మీదేవి పుట్టిందన్నమాట. ఆ దేవుడు మన మొరను ఆలకించాడు. అరుంధతీ, పాప క్షేమంగా ఉన్నారట" అంతలో నర్స్ వచ్చి పాపను చూడవచ్చని చెప్పింది.

అలాగేనన్నట్లు తలాడించాను.

ఇద్దరం పాపను చూడటానికి గదిలోకి వెళ్ళబోతుంటే హఠాత్తుగా ఏదో గుర్తుకువచ్చినట్టుగా జానకమ్మగారు "కృష్ణా అరుంధతికి చందన్ విషయం చెప్పకు. తను తట్టుకోలేదు. బాబు గురించి అడిగితే నేను ఏదో ఒకటి సర్దిచెప్తానులే" అన్నారు.

అలాగేనన్నట్లు నేను తలాడించాను.

ఇప్పుడు నాకు చందన్ గురించి కూడా దిగులులేదు. ఎందుకంటే చందన్ తప్పకుండా కిరణ్ దగ్గరే ఉండి ఉంటాడు.

కిరణ్ ఎక్కడున్నాడో తెలుసుకోవడం పెద్ద కష్టంకాదు.

ధర్మారావుగారింటికి వెడితే చిక్కుముడి వీడిపోతుంది.

నేను, జానకమ్మగారు అరుంధతి ఉన్న గదిలోకి వెళ్ళాం. అరుంధతికి ఇంకా మెలకువ రాలేదు.

మొదట పాపను జానకమ్మగారు ఎత్తుకున్నారు. "అబ్బాయి! పాపది అచ్చం నీ పోలికే... చూడు చూడు... ఆడపిల్లకి తండ్రి పోలిక వస్తే చాలా అదృష్టమంటారు. చూస్తుండు మీ అమ్మాయి చాలా గొప్పదవుతుంది. ఏంట్రా చిట్టితల్లి. అమ్మమ్మని చూడు... చూడు... చూడు" పాపాయిని చాలాసేపు ముద్దులాడాక నా చేతికిచ్చారు.

చందన్‌ను కూడా పసివాడుగా ఉన్నప్పుడు ఎత్తుకున్నాను. కానీ నిజాయితీగా చెప్పాలంటే పాపను చేతిలోకి తీసుకోగానే నాలో ఏదో తెలీని పులకింత. నా హృదయం ఉప్పొంగింది. నేను ఓ ప్రాణానికి రూపమిచ్చాను అన్న ఆనందం... ముఖ్యంగా నేను తండ్రినయ్యానన్న ఆనందం, అన్నీ ఒకదానితో ఒకటి పోటీపడ్డాయి.

పాపాయిని నెమ్మదిగా ఉయ్యాలలో పడుకోబెట్టాను.

మరో గంటకి అరుంధతికి మెలకువ వచ్చింది. పాపను చూసుకుని సంబరపడిపోయింది. ఆ తర్వాత ఆమెకు అనుమానం వచ్చింది. "అవును! మీరిద్దరూ ఇక్కడే ఉంటే చందన్ ఒక్కడూ ఇంట్లో వున్నాడా! వాడు ఆస్పత్రికి రాలేదా? వాడ్ని ఒక్కడ్ని ఇంట్లో ఎలా వదిలేసొచ్చారు? " ప్రశ్నల వర్షం కురిపించేసింది.

"అమ్మాయ్... నేనూ బిడ్డల్ని కన్నతల్లినే... ఆ మాత్రం జాగ్రత్త నాకూ తెలుసు..." అని నవ్వారు జానకమ్మగారు.

"అయ్యో... ఎంత మాటమ్మా! మీకు తెలీదని కాదు. ఏదో ఉండబట్టలేక అలా మాట్లాడాను. ఏమీ అనుకోకండి" నొచ్చుకుంది అరుంధతి.

"తల్లి ప్రేమ, ఆరాటం నాకుమాత్రం తెలియనివా! చందన్‌ను ధర్మారావుగారు వచ్చి తీసుకువెళ్ళారు. వాడింతసేపు ఆస్పత్రిలో ఎందుకు? మా ఇంట్లో ఇవ్వాల్టికి ఉంటాడులే అని అన్నారు. సరే అన్నాను. నీకు తెలుసుగా ఆయనకు మన చందన్ అంటే వల్లమాలిన అభిమానం కూడా"

అరుంధతికన్నా ముందు నేను రిలీఫ్‌గా ఫీలయ్యాను.

"కృష్ణా! పొద్దున్నే వెళ్ళి చందన్‌ను తీసుకొచ్చేయ్... మనల్ని వదిలి వాడు అస్సలు ఉండలేడు" ఖంగారుపడింది అరుంధతి.

"అబ్బాయ్! ఇక నువ్విక్కడ చేసేదేముంది? ఇంటికి వెళ్ళిపో... పొద్దున్నే వద్దువుగానిలే... వెళ్లు వెళ్ళి రెస్ట్ తీసుకో" అన్నారు జానకమ్మగారు.

"అవునండి. వెళ్లండి. పాపం మిమ్మల్నందరినీ బాగా టెన్షన్ పెట్టేసినట్టున్నాను" అంది అరుంధతి.

సరేలెమ్మని బయటకు వచ్చాను. ఇంటికి వెళ్లకుండా సరాసరి ధర్మారావుగారింటికి బయలుదేరాను.

నిజానికి నా అనుమానం గురించి పోలీసులకు చెప్తే అసలు విషయం వాళ్లే చూసుకుంటారు. కానీ ధర్మారావుగారింటిమీదకు పోలీసుల్ని పంపటం నాకు ఇష్టంలేకపోయింది.

నేను ధర్మారావుగారింటికి వెళ్లేసరికి తెల్లవారుఝామున మూడు గంటలయ్యింది.

ఆ సమయంలో నన్ను చూసి ఆయనే చాలా ఖంగారుపడ్డారు. "కృష్ణా! అరుంధతి ఎలా ఉంది? తనకేం కాలేదుకదా!" అని అడిగారు.

లేదన్నట్టు తలాడించాను.

అరుంధతి క్షేమంగానే ఉందని, ఆడపిల్ల పుట్టిందని చెప్పాను.

"పోన్లే... బిడ్డ ఎలా బతికి బయటపడుతుందో అని చాలా ఖంగారుపడ్డాను" అని "అది సరే నువ్వేంటి ఈవేళ...?" అని అర్థోక్తిగా ఆగిపోయారు. అంతలోనే ఏదో గుర్తుకువచ్చినవారిలా "అయ్యో! నిన్ను బయటే నిలబెట్టి మాట్లాడేస్తున్నాను. ముందు లోపలికి రా" అన్నారు.

అంతలో ధర్మారావుగారి భార్య లేచివచ్చారు.

"వసంతా! ఈ సంగతి విన్నావా? మన కృష్ణకు ఆడపిల్ల పుట్టిందట. ఆ సంగతి చెబ్దామని వచ్చాడు" అన్నారాయన.

"చాలా సంతోషం బాబు! తల్లి, బిడ్డ క్షేమమేకదా!" అని అడిగారు.

ధర్మారావుగారే కాదు ఆయన భార్య కూడా ఎంతో మంచివారు. తనకు చేతనైనంతవరకు ఇతరులకు సాయంచేద్దామని అనుకుంటారు.

"చెప్పు కృష్ణా! నాతో ఏదైనా పని ఉందా?" ఆయన భార్య లోపలికి వెళ్ళాక అడిగారు.

అవునన్నట్లు తలాడించాను. కానీ అసలు విషయం ఎలా చెప్పాలో ఎక్కడ్నించి మొదలుపెట్టాలో నాకు అర్థంకాలేదు. కానీ ఎక్కడో అక్కడ అసలంటూ మొదలుపెట్టాలికదా!

అందుకే కాగితం మీద "చందన్ కనిపించడంలేదు" అని రాసిచ్చాను.

ధర్మారావుగారు షాకయ్యారు.

"ఎప్పట్నించి కనిపించడంలేదు" అని అడిగారు.

"సాయంత్రం స్కూలునుంచి ఇంటికి రాలేదు" అది నా సమాధానం.

"స్కూల్లో కనుక్కున్నావా?"

తలాడించాను.



"వాళ్ల (ఫ్రెండ్స్) ఇళ్లల్లో కనుక్కోలేకపోయావా? "

కనుక్కున్నానని తలాడించాను.

"ఆటో అతను రోజూ తీసుకువెళ్లేవాడేగా"

అవునని తలాడించాను.

"ఒకసారి. అతన్ని అడిగి చూడాల్సింది"

అడిగానని చెప్పాను.

"ఏమిటిది కృష్ణా! పిల్లాడు కన్పించకపోతే వెంటనే వచ్చి చెప్పద్దా? పోలీస్ రిపోర్ట్ ఇచ్చేవాళ్లంకదా" అన్నారు.

"పోలీస్ రిపోర్ట్ ఇచ్చానండీ!" అని చెప్పాను.

"నీకు ఎవరి మీదనైనా అనుమానంగా ఉందా? " అని అడిగితే అవునని తలాడించాను.

"ఎవరు కృష్ణా! అతని పేరు చెప్పు. ఇప్పుడే ఐ. జికి ఫోన్ చేసి చెప్తాను. ఐ. జి నా క్లాస్‌మేట్. మా ఇద్దరికీ మంచి స్నేహం ఉంది. మనవాడ్ని ఎత్తుకెళ్లిన వాడెక్కడున్నా కనిపెట్టి తీసుకొచ్చి మక్కెలిరగతన్ని మరీ నిజం కక్కిస్తారు. చెప్పు... ఎవరి మీద నీ అనుమానం? "

ధర్మారావుగారి ప్రశ్నకు జవాబు చెప్పేంత ధైర్యాన్ని నాకు ఇమ్మని ఆ భగవంతుని ప్రార్థించాను.

"చెప్పు... నీకెవరిమీద అనుమానమో చెప్పు. సందేహించకు. వాడెంత గొప్పవాడైనా, వాడికెంత పలుకుబడి ఉన్నా వాడ్ని విడిచిపెట్టేదిలేదు" అంతలో ధర్మారావుగారి భార్య కాఫీ తీసుకొచ్చారు.

"వసంతా! మన చందన్ కన్పించడంలేదట" ధర్మారావుగారి గొంతు సన్నగా కంపించింది.

"ఏంటండీ మీరనేది" ఆవిడ కూడా ఖంగారుపడ్డారు.

"అవును వసంతా! సాయంత్రం స్కూలు నుంచి ఇంటికి రాలేదట"

"అన్ని చోట్లా విచారించావా బాబూ" తన సొంత మనవడు కన్పించకపోతే ఎంత తల్లడిల్లిపోతారో అంతగా తల్లడిల్లిపోయారావిడ.

"అందరినీ అడిగాడట. అన్ని చోట్లా విచారించాడట. ఎక్కడా కన్పించకపోయేసరికి పోలీసు రిపోర్ట్ కూడా ఇచ్చాడట"

"ఎవరు చేసుంటారీ పని. నీకెవరి మీదైనా అనుమానం ఉందా? " ఆవిడ కూడా ధర్మారావుగారు అడిగిన ప్రశ్నే అడిగారు.

చెప్పేయాలి. అవును చెప్పాలి. ఇప్పుడు కూడా ఈ విషయాన్ని దాచి పెడితే చందన్‌ను కోల్పోవాల్సి వస్తుంది.

ఎలాగో అలా ధైర్యం తెచ్చుకుని కాగితం మీద రాశాను. మీ తమ్ముడిగారి పెద్ద అల్లుడు మీదనే నాకు అనుమానం.

అది చదివి ఆయన మరింత షాకయ్యారు.

ఆయన చేతిలోంచి కాగితం తీసుకుని చదివిన ఆవిడ పరిస్థితీ అంతే. ఇద్దరిలోకి ముందుగా ఆవిడే తేరుకున్నారు. "కృష్ణా! నువ్వు చెప్పేది నిజమా! అసలు మా మరిదిగారి అల్లుడ్ని నువ్వు ఎన్నడూ చూసిందే లేదు కదా!"

"వసంతా! కృష్ణ గురించి మనకు తెలీదా? తను ఎవ్వరి గురించి చెడుగా మాట్లాడడు. ఎవ్వరి జోలికి వెళ్లడు. అలాంటిది మా తమ్ముడి అల్లుడీ పని చేశాడని చెప్తున్నాడంటే అందుకు తప్పకుండా ఏదో ఆధారం ఉండే ఉంటుంది" అన్నారు.

"కృష్ణా! అసలు... అసలు అతనెందుకీ పని చేస్తాడు? నీమీద అతనికేం కక్ష? "

అన్ని విషయాలు తర్వాత వివరంగా చెప్తాను. ముందు కిరణ్ ఇంటికి వెడదాం. చందన్‌ను తీసుకు వద్దాం అని రాసి చూపించాను.

"సరే పద" అని లేచారాయన. "వసంతా! ఈ సంగతులేవీ నువ్వు ఎవ్వరితోను అనకు. ఈ సమయంలో ఎవ్వరికీ ఫోన్లు చెయ్యకు. నేను తిరిగి వచ్చాక ఏం





చేయాలో ఆలోచిద్దాం" అని చెప్పి నాతో బయలుదేరారు.

మేము కిరణ్ ఇంటికి వెళ్లేసరికి తెల్లవారు ఝామున నాలుగు గంటలయ్యింది. చాలా సేపు బెల్లుకొట్టాక కానీ ఎవ్వరూ. తలుపు తీయలేదు.

"పెదనాన్న! ఈ వేళప్పుడు వచ్చారేంటి? ఏమైంది? అంతా బావున్నారుకదా" కొంచెం ఖంగారు పడింది ఆ అమ్మాయి.

"అందరూ బావున్నారమ్మా. నువ్వేం వర్రీ కాకు" అని "అమ్మా నందిని! మీ ఆయన ఎక్కడ? " అన్నారు.

"లోపల ఉన్నారు పెదనాన్నా! ఎందుకడి గారు? " ఆ అమ్మాయికి ఆ వేళప్పుడు మేము రావడం చాలా కన్‌ఫ్యూజింగ్‌గా ఉంది.

ధర్మారావుగారు బెడ్‌రూమ్‌లోకి వెళ్లారు. అక్కడ కిరణ్ ఒక్కడే హాయిగా నిద్రపోతు న్నాడు.

"అమ్మా నందినీ! మీ ఆయన ఎవరైనా పిల్లాడ్ని తీసుకొచ్చాడా!" అడిగారు ఆయన.

"పిల్లాడ్ని... ఆ తీసుకొచ్చారు పెదనా న్నా. ఏం? ఎందుకలా అడిగారు? ఆయనే మైనా? "

"లేదు... లేదు... ఊరికే అడిగానంతే"

అసలు విషయాన్ని దాచి పెట్టారు ధర్మా రావుగారు.

"ఏడి? ఎక్కడున్నాడు? " నా గొంతులో ఆదుర్దా ధర్మారావుగారి స్వరంలో ధ్వనిం చింది.

"పైన నా గదిలో ఉన్నాడు పెదనాన్నా" అంటూ మమ్మల్ని పైకి తీసుకువెళ్లింది.

మేడమెట్లు ఎక్కుతున్నంతసేపు భగవం తుడా! వాడు మా చందన్ కావాలి. అని దణ్ణం పెట్టుకుంటూనే ఉన్నాను.

ముగ్గురం గదిలోకి వెళ్లాం.

"చందన్" గట్టిగా కేకవేశాననుకున్నాను. కానీ నా నోట్లోంచి కేక రాదుకదా!

గభాల్న వాడ్ని దగ్గరకు తీసుకున్నాను. "అంకుల్! నేను మీతో రాను. నన్ను అమ్మ దగ్గరకి తీసుకువెళ్లండి" నిద్రలో వాడు కల వరిస్తున్నాడు.

మమ్మల్ని చూసేసరికి ధర్మారావుగారికి దుఃఖం ఆగిందికాదు. నందినికి మాత్రం ఇదంతా అయోమయంగా ఉంది.

"ఏమిటిది పెదనాన్నా! ఈ బాబు ఎవరు? ఈయన ఎవరు? మీరింత పొద్దున్నే రావడం ఏమిటి? నాకసలు ఏమీ అర్థం కావడంలేదు. పిచ్చెక్కుతుందేమోనని పిస్తోంది"

"మీ ఆయన బాబుని ఎక్కడ్నించి తీసు కొచ్చానని చెప్పాడు? "

"ఎక్కడో రోడ్డుమీద ఏడుస్తూ కూర్చుంటే తీసుకొచ్చానని, పోలీసు రిపోర్ట్ ఇచ్చానని, బాబుకోసం ఎవరైనా వస్తే తనను కాంటాక్ట్ చేయమని చెప్పానని చెప్పారు. అయితే ఈ బాబు వాళ్ల బాబా" అని నా వైపు తిరిగి "ఏంటండీ ఇది. పిల్లల్ని కన గానే సరా! కొంచెమైనా బాధ్యత ఉండ క్కర్లా. ఏదో సమయానికి దేవుడిలా మా ఆయన రాబట్టి సరిపోయింది కానీ లేక పోతే ఏమయ్యేది? " నందిని నన్ను కేకలే సింది.

"నందినీ వెళ్లి కిరణ్‌ని నిద్రలేపి తీసుకురా" అన్నారు ధర్మారావుగారు.

"పెదనాన్నా ఏమైందసలు? " ఆ అమ్మాయి ముఖంలో ఖంగారు, భయం అన్నీ వ్యక్తం అయ్యాయి.

"ఏం కాలేదమ్మా! వెళ్లుముందు నేను చెప్పిన పని చెయ్యి" అన్నారాయన. అయిదు నిమిషాల తర్వాత కిరణ్ వచ్చాడు.

నన్ను చూసి ఖంగుతిన్నాడు.

"పెదమావయ్యా! మీరు ఈ సమయంలో ఇక్కడ" కిరణ్ మాట తడబడింది. అంతే ధర్మారావుగారు అతన్ని లాగి పెట్టి కొట్టారు.

"పెదనాన్నా! ఆయనేం తప్పు చేశారని" భర్తను కొట్టేసరికి నందిని ప్రాణం విలవిల్లా

డింది.

"నీ మొగుడేం చేశాడో తెలుసా! వీళ్లబ్బాయిని ఎత్తుకొచ్చేశాడు"

"అబద్ధం. ఆ అబ్బాయి రోడ్డుమీద కనిపిస్తే తీసుకొచ్చారు. పొద్దున్నే పోలీసులకు అప్పగించేద్దామని కూడా అనుకున్నాం"

"చెప్తాడమ్మా! వినేవాళ్లుంటే మీ ఆయన ఎన్ని అబద్ధాలైనా చెప్తాడు" అని "చెప్పరా ఈ అబ్బాయి నీకెక్కడ కన్పించాడు? "

"రోడ్డు మీ..." అంతే కిరణ్ చెప్పేది పూర్తి కాకుండానే మరోసారి అతని చెంప ఛెళ్లుమంది.

"చూడు కిరణ్! నాకు అంతా తెలుసు. మర్యాదగా నిజం చెప్పు. లేదా పోలీసుల్ని పిలవాల్సి ఉంటుంది"

ధర్మారావుగారి ముఖంలో అంత కోపం నేనింతవరకు ఎప్పుడూ చూడలేదు.

"అవును వాడ్ని నేనే ఎత్తుకొచ్చాను" ఒక విధమైన తెగింపుతో అన్నాడు కిరణ్.

"ఏమండీ" నందిని బిత్తరపోయింది.

"ఆ పిల్లాడితో నీకేం పని" హుంకరించారు ఆయన. కిరణ్ మాట్లాడలేదు.

"చెప్పరా! వాడితో నీకేం పని"

అప్పటికీ మౌనమే అతని సమాదానం అయింది.

"నువ్వు చెప్తావా! నన్ను చెప్పమంటావా? "

"వాడ్ని పెంచుకుందామని తీసుకొచ్చాను" చెప్పాడు కిరణ్.

"ఏం వాడినే ఎందుకు పెంచుకోవాలి? పైగా వాడేమైనా పసిపిల్లాడా! వాడికి నాలుగేళ్లున్నాయి. ఊహ వచ్చింది. అమ్మనాన్నా ఉన్నారు. ఇప్పుడు వాడు మిమ్మల్ని అమ్మా నాన్నా అంటాడా! మీ దగ్గరుంటాడా"

"ఉంటాడు. ఉండాలి" అదో రకమైన తెగింపు కిరణ్‌లో చోటు చేసుకుంది.

"ఎందుకుండాలి? " ధర్మారావుగారు కిరణ్‌తో నిజం చెప్పించాలని వాదించసాగారు.




"ఎందుకుండాలంటే వాడు నా కొడుకు కాబట్టి" అన్నాడు కిరణ్.

నందిని నిర్ఘాంతపోయింది.

ధర్మారావుగారు కూడా వెంటనే మాట్లాడలేకపోయారు.

"అవును, వాడు నా కొడుకు! నా రక్త సంబంధం కాబట్టే నా దగ్గరకు తెచ్చుకున్నాను" అంటూ గభాల్న నా చేతిలోంచి చందన్‌ను లాక్కున్నాడు. ఈ గలాభాలో వాడు నిద్ర లేచాడు. నా దగ్గర కాకుండా ఎవరో దగ్గర ఉండటం చూసి డాడీ అంటూ ఏడుపు అందుకున్నాడు.

"డాడీ! నన్ను మీతో తీసుకు వెళ్లండి. ఈ అంకుల్ బ్యాడ్. నన్ను కొట్టాడు"

అంతే నాకంత బలం ఎక్కడ్నించి వచ్చిందో తెలీలేదు. కిరణ్ చేతిలోంచి బాబుని లాక్కుని గుండెలకు హత్తుకున్నాను.

కిరణ్ నా మీదకు లంఘించబోతుంటే ధర్మారావుగారు ఆపారు. "నా కొడుకుని నా దగ్గరకు ఎలా రప్పించుకోవాలో నాకు తెలుసు" అని ఛాలెంజి చేస్తూ లోపలికి వెళ్లిపోయాడతను.

"పెదనాన్నా! ఏమిటదంతా" బేలగా అడిగింది నందిని.

ఆ అమ్మాయిని చూస్తే జాలేసింది.

భర్తే దైవమని నమ్ముతూ పూజిస్తూ ఆరాధిస్తున్న ఓ సగటు అమ్మాయికి భర్త ఎవరో పిల్లాడిని తెచ్చి నా కొడుకు అంటే ఎలా తట్టుకోగలదు.

"అమ్మడూ ఇలారా ఇలా వచ్చి కూర్చో" అక్కడున్న సోఫాలో ఆమెని కూర్చోబెట్టారాయన.

"తల్లీ ఏ ఆడపిల్లకు రాని కష్టం నీకొచ్చింది. తట్టుకుని నిలబడతానని ఎలాంటి అఘాయిత్యం చెయ్యనని నాకు మాట ఇవ్వగలవా" కుడిచెయ్యి ముందుకు చాచి అడిగారు ధర్మారావుగారు.

"పెదనాన్నా"

"అవున్రా... నాకు ప్రామిస్ చెయ్యి"

నందిని ఆయన చేతిలో చెయ్యివేసింది.

"అమ్మా! నందిని! నీ భర్తకు పుట్టిన కొడుకేనమ్మా వీడు. ఇతను కృష్ణ. నాకు చాలా కాలంగా తెలుసు. నీ భర్త నీతో పెళ్లికి ముందే అరుంధతి అనే అమ్మాయిని ప్రేమించాడు. ఆమెని పెళ్లి చేసుకుంటానన్నాడు. అప్పట్లో అతనికి ఉద్యోగంలేదు. ప్రేమించడానికి అడ్డురాని నిరుద్యోగం పెళ్లి చేసుకోవడానికి అడ్డొచ్చింది. తన కోరిక కూడా తీర్చుకున్నాక అరుంధతికి కన్పించకుండా పారిపోయాడు. అప్పటికే ఆ పిల్ల గర్భిణి. తన మాతృత్వాన్ని చంపుకోలేక ఇతన్ని పెళ్లాడింది. కిరణ్ వస్తాడని అప్పుడు ఇతనికి విడాకులిచ్చి అతనితో వెళ్లి పోవాలని ఆ అమ్మాయి అనుకుంది. కానీ నీ మొగుడు ఏమన్నాడో తెలుసా! నువ్వసలు మంచిదానివే కాదన్నాడు. ఈ పిల్లాడు నా కొడుకేనని నమ్మకమేమిటన్నాడు. మీరిద్దరూ పెళ్లి చేసుకుని సంసారం చేయకుండా ఉన్నారంటే నమ్మేదెలా అన్నాడు. ఆ అమ్మాయిని నొప్పించాడు. ఆ పిల్ల ఆ షాక్ తట్టుకోలేక ప్రాణం మీదకు తెచ్చుకుని ఆస్పత్రి పాలయ్యింది. ఈమధ్యనే వాళ్లిద్దరూ కాస్త ఆనందంగా ఉంటున్నారు. ఆ ఆనందాన్ని నాశనం చేయడానికి శనిలా దాపరించాడు నీ మొగుడు" ఆయాసం వచ్చి ఒక్కక్షణం ఊపిరి పీల్చుకునేందుకు ఆగారాయన. "వాళ్లింటికి వెళ్లి తనకు పిల్లలు పుట్టరని, తన బిడ్డను తనకు ఇమ్మని అడిగాడట. అరుంధతి ఇవ్వననడంతో ఇదిగో ఇలా ఎత్తుకొచ్చాడు"

అంతా విని నందిని చాలా గంభీరంగా ఉండిపోయింది.

"ఈ విషయాలన్నీ నాకు ఇప్పుడే తెలిశాయమ్మా! నీ పెళ్లి సమయంలో అరుంధతికి ఒంట్లో బావుండక పోవడంవలన కృష్ణ పెళ్లికి రాలేదు. లేదంటే అప్పుడే మనకు కిరణ్ గురించి తెలిసేది. ఇప్పుడిక మనమెవ్వరం చేయగలిగింది ఏమీలేదు" అంటూ ధర్మారావుగారు కళ్లొత్తుకున్నారు.

తర్వాత ముగ్గురం కలిసి ఆస్పత్రికి వచ్చాం. చెల్లిని చూసి చందన్ ఎంతో సరదాపడ్డాడు. నాకన్నాముందు తనే జరిగినదంతా తల్లికి చెప్పాడు. బాబుని ఎవరు ఎత్తుకెళ్లారో అరుంధతికి అర్థం కాలేదు. ముందు ఈ సంగతులేవి తనకు తెలీకూడదనుకున్నాను కానీ ఇప్పుడిక జరిగింది చెప్పక తప్పలేదు. ఆ తర్వాత అరుంధతిని ఓదార్చేసరికి నా తాతలు దిగివచ్చారు.

ఏడో రోజున తనను డిశ్చార్జ్ చేశారు. చందన్ పుట్టినప్పుడు రాని అమ్మానాన్న, తమ్ముళ్లు, చెల్లాయ్ పాప పుట్టినప్పుడు వచ్చారు.

శారదాంటీ, అంకుల్ కూడా వచ్చారు. ఇన్నాళ్లుగా మాకెవ్వరూ లేరని అనుకున్న మాకు శాపవిమోచనం అయినట్టుగా ఉంది.

పాపకు వసంతలక్ష్మి అని పేరుపెట్టుకున్నాం.

★ ★ ★

నిజానికి ఈ కథ ఇంతటితో అయిపోవాలి. కిరణ్ మా జీవితాలలోకి రాకపోతే అయిపోయేదే. కాని కిరణ్ కోర్టుకు వెళ్లాడు.

చందన్ తన కొడుకని, అరుంధతి మరో వివాహం చేసుకుని పిల్లల్ని కన్నది కాబట్టి వారు చందన్‌ని సరిగా చూడరని, తన కొడుకును తనకు ఇప్పించాలని అతని అభియోగం.

అరుంధతి బాగా కృంగిపోయింది. చందన్‌కోసం నేను పోరాడదల్చుకున్నాను. ధర్మారావుగారు, ఆయన తమ్ముడు కిరణ్‌కు ఎంతగానో నచ్చచెప్పారు.

ధర్మారావుగారైతే మరీను. "ఆ రోజు ఆ పిల్లని తన ఖర్మానికి తనను వదిలేసిన వాడివి ఈ రోజు నీ బిడ్డ నీకు కావాలనడంలో ఏదైనా అర్థం ఉందా? ఇకనైనా నీ పద్ధతిని మార్చుకో. జరిగినదంతా మర్చిపోదాం. అరుంధతి కేసు వాపసు తీసుకుంటుంది. ఓ అనాథ ఆశ్రమంకి వెళ్లి నంది

నికి, నీకు నచ్చిన బాబునో, పాపనో తెచ్చి పెంచుకుందురుగానీ" అన్నారు.

ధర్మారావుగారి తమ్ముడు కూడా అదే అభిప్రాయం వ్యక్తం చేశారు.

"చూడు బాబూ! నీ గురించి తెలీక మా అమ్మాయిని నీకిచ్చి పెళ్లి చేసి నేను చాలా పెద్ద పొరపాటు చేశాను. దయచేసి ఈ వయసులో మమ్మల్ని క్షోభ పెట్టకు. జరిగినదేదో జరిగిపోయింది. అందరం మర్చిపోదాం. ఈ గొడవని ఇంతటితో విడిచిపెట్టేయ్"

"వీల్లేదు" గట్టిగా అరిచాడు కిరణ్ "వాడు నా బిడ్డ! నా కొడుకు నాకు కావాలి. అందుకోసం నేను ఎవర్నైనా వదులు కోవడానికి సిద్ధంగా ఉన్నాను"

కిరణ్ ఎందుకంత పట్టుదలకు పోతున్నాడో మాకెవ్వరికీ అర్థం కాలేదు. తను అనుకున్నది అనుకున్నట్టుగా జరగాలని తను అనుకున్నది సాధించటం కోసం అతనేమైనా చేస్తాడని అరుంధతి చెప్పింది.

మనిషి ఎంతో మొండివాడు. మూర్ఖుడు. ఇలాంటి వాడిని నేనెలా ప్రేమించానో నాకిప్పటికీ అర్థం కావడం లేదు అని తను అంటుంటుంది.

బహుశా ఇక జీవితంలో తను తండ్రి కాలేడు కాబట్టి ఇలా ప్రవర్తిస్తున్నాడేమో.

ఈ మొత్తం వ్యవహారంలో చందన్ బాగా నలిగిపోతున్నాడు.

"ఏమండీ" బేలగా పిల్చింది నందిని. కిరణ్ మాట్లాడలేదు.

"ఏమండీ! ఈ విషయాలన్నీ నాకెంత బాధ కల్గిస్తున్నాయో తెలుసా! ఒక్కసారి నా స్థానంలో నిలబడి ఆలోచించండి. ఇదంతా మనకు అవసరమా! ఈ బిడ్డకోసం అరుంధతి ఎంత త్యాగం చేసిందో మీకు తెలుసా! కృష్ణగారు తనను బలవంతం చేశారని నాటకమాడి ఆయనను పెళ్లి చేసుకుంది. ఎందుకో తెలుసా! మీవలన పుట్టబోయే బిడ్డను అందరూ నానా పేర్లతో పిలవకూడదు. తన బిడ్డను తాను రక్షించుకోవాలని. ఇలాంటి పని చేసింది. కృష్ణగారు అర్థం చేసుకున్నారు కాబట్టి సరిపోయింది. లేదంటే అందరూ ఉండి కూడా ఎవ్వరూ లేని అనాథగా చేతిలో చంటిబిడ్డతో ఒంటరిగా బతకాల్సి వచ్చేది. అసలా అమ్మాయి ఆ గర్భాన్నే తీయించుకునుంటే మీరేం చేసేవారు. పోనీ ఆ తర్వాతనైనా మీరు ఆమెను అర్థం చేసుకున్నారా! లేదే... కృష్ణగారిని పెళ్లి చేసుకున్నాక కూడా దాదాపు సంవత్సరం పాటు ఆవిడ మీ కోసం ఎదురు చూశారు. కానీ మీరు ఆవిడ్ని నానా మాటలన్నారు. ఈ బిడ్డ మీకు, తనకు పుట్టిందే కాదన్నారు. ఇప్పుడు వాడు మీ బిడ్డెలా అవుతాడు? మీరెప్పుడైతే ఆవిడ్ని వదిలేశారో, ఎప్పుడైతే కృష్ణగారు ఆవిడ్ని వివాహం చేసుకున్నారో ఆనాటినుంచి ఆ బిడ్డకు తండ్రి కృష్ణగారే. ఇప్పుడు మీరు వెళ్లి నా బిడ్డ నాకు కావాలంటే వాళ్లెలా ఇస్తారు? మనం ఆడుకునే బొమ్మనే ఎవరైనా అడిగితే ఇవ్వలేమే. అలాంటిది ప్రాణం వున్న బిడ్డ అండీ... అందరినీ ఎదిరించి తన జీవితాన్ని, భవిష్యత్తును పణంగా పెట్టి మరీ కన్న బిడ్డ. ఆవిడ ఎలా ఇస్తుంది? ఇప్పటికైనా మీ మొండితనం విడిచిపెట్టండి. మీరు ఈ కోర్టుకే కాదు ఎక్కడికి వెళ్లినా చందన్‌ను మీకు అప్పగించరు. అది తెలుసుకోండి"

"వీల్లేదు..., వీల్లేదు. చందన్ నా బిడ్డ. అరుంధతి గురించి నాకు బాగా తెలుసు. వాడు నా బిడ్డ. నా బిడ్డ నాకు కావాలి. ఎలాగైనా నేను వాడిని పొంది తీరతాను" గబగబా బయటకు వెళ్లిపోయాడు కిరణ్.

అక్కడున్న మేమంతా హతాశులమయ్యాం. కిరణ్ రాను రాను ఉన్మాదిలా తయారవుతున్నాడు. చిన్న సమస్య అనుకున్నది రానురాను మా మనశ్శాంతిని నాశనం చేస్తోంది.

ఈ గొడవల మూలంగా చీమచిటుక్కు





మంటే చాలు అరుంధతి భయపడిపోతోంది. చందన్‌ను భయపెడుతోంది. ఈ కోర్టులు, కేసులు తేలేదాకా స్కూలు బంద్. ఫ్రెండ్స్‌తో ఆడుకోవడం బంద్... బయటకు వెళ్లడం బంద్, ఆఖరుకు జానకమ్మ గారింటికి వెళ్లటం కూడా బంద్. హౌస్ అరెస్ట్ అన్నమాట.

ఇదంతా వాడికి చాలా చికాగ్గా ఉంది. ఎంతసేపని కార్టూన్ నెట్ వర్క్ చూస్తాడు? ఎంతసేపని వీడియోగేమ్స్ ఆడుకుంటాడు. లక్ష్మి ఉంది కాబట్టి చెల్లాయ్‌తో బానే కాలక్షేపం అవుతోంది కానీ ఇలాగే కొన్నాళ్ల పాటు జరిగితే వాడికి విసుగు రావడం ఖాయం.

హాయిగా ఎగిరే సీతాకోకచిలుకను బంధిస్తే ఎలా వుంటుందో అలా వుంది చందన్ పరిస్థితి.

అక్కడికీ నేనెంతగానో చెప్పి చూశాను. కేసు కోర్టులో ఉంది కాబట్టి మరోసారి చందన్‌ను ఎత్తుకు వెళ్లే సాహసం కిరణ్ చెయ్యడు. మనం వాడ్ని ఇలా బంధించనక్కర్లేదు. వాడ్ని స్కూలుకు మామూలుగా పంపచ్చు అని.

అరుంధతి వినలేదు.

"డాడీ నేను స్కూలుకు వెడతాను" అని చందన్ గొడవ చేసేవాడు. రానురాను కనీసం బయటకు కూడా పంపకపోవడం వాడికి చిరాగ్గా ఉంటోంది.

దానికితోడు మా లాయరు 'పిల్లాడ్ని కొంచెం ట్రైనప్ చెయ్యండి' అని చెప్పాడు.

కోర్టులో కిరణ్‌ను చూపించి అడిగితే "ఆయనెవరో నాకు తెలీదు. నేనెప్పుడూ చూడలేదు. ఈయనే మా డాడీ ఆవిడే మా మమ్మీ నేను వాళ్లతోనే ఉంటాను" అని చెప్పాలట.

రోజూ ఓ పదిపదిహేను సార్లు ఒక్కోసారి అంతకన్నా ఎక్కువసార్లే అరుంధతి చందన్‌ను ట్రైనప్ చేసేది. "అసలెందుకు మమ్మీ అలా చెప్పాలి. ఈయనేగా మా డాడీ! ఆ అంకుల్ అస్సలు మంచివాడే కాదు. నన్ను ఎత్తుకుపోయి కొట్టాడు. తిట్టాడు. నువ్వు ఇకనుంచి నా దగ్గరే ఉండాలి. లేకపోతే మీ డాడీని, మమ్మిని చంపేస్తాను అన్నాడు. ఎవరు మమ్మీ ఆ అంకుల్. చాలా బ్యాడ్ అంకుల్ కదూ" అని చందన్ అడుగుతుంటే అరుంధతి కన్నీళ్లే సమాధానమయ్యాయి.

ఏమని చెప్తుంది? కిరణ్ తన జీవితానికి పట్టిన పీడ అని చెప్తుందా! లేక గతంలో తను వేసిన తప్పటడుగు తాలూకు ఫలం అని చెప్తుందా! ఈ గొడవలన్నీ చూస్తూ అమ్మావాళ్లు కూడా ఆందోళన పడేవారు. ఎవరేం చేసినా చెప్పానుగా కిరణ్ ఓ ఉన్మాదిలా తయారయ్యాడు. కోర్టు తీర్పు అతని ఆగడాలకు ఆనకట్ట వేయాలి తప్ప ఎవ్వరూ అతన్ని మార్చలేరు.

★ ★ ★

ఈ నేపథ్యంలో అనుకోకుండా మరో సమస్య వచ్చిపడింది.

ఇన్నాళ్లుగా జానకమ్మగారి గురించి పట్టించుకోనివారు హఠాత్తుగా వాళ్ల పిల్లలు ఫోన్లు చేయడం, ఉత్తరాలు రాయడం,

బహుమతులు పంపడం వంటివి చేయడం మొదలుపెట్టారు.

జానకమ్మగారి ఆనందానికి అంతులేకుండా పోయింది.

ఆవిడ ముఖంలో అంత సంతోషం నేనెన్నడూ చూడలేదు.

ప్రతిరోజూ ఆవిడ వచ్చి కనీసం గంటా రెండు గంటలు వాళ్ల పిల్లల్ని గురించి చెప్పేవారు. మనవలు, మనవరాళ్ల ఫోటోలు చూస్తూ వాళ్లనే చూసినంతగా సంబరపడిపోయేవారు. ఓ రోజు హఠాత్తుగా జానకమ్మగారి పిల్లలంతా దిగారు.

ఇక చూడాలి ఆవిడ సంబరం, సంతోషం. మమ్మల్ని తీసుకువెళ్లి పిల్లలకు పరిచయం చేశారు. ఎందువల్లనో వాళ్లు ముక్తసరిగా మాట్లాడారే తప్ప మా పట్ల పెద్దగా అటెన్షన్ పే చేయలేదు. అయినా మా మధ్య పెద్దగా పరిచయం ఎక్కడుంది? పైగా ఎంతో దూరం ప్రయాణం చేసి వచ్చారు. ప్రయాణ బడలిక ఉంటుందికదా!

పిల్లలు వచ్చిన నాలుగు రోజుల తర్వాత జానకమ్మగారి అబ్బాయిలిద్దరూ మా ఇంటికి వచ్చారు.

మామూలుగానే మర్యాదలు చేశాం. వాళ్లని చూస్తే వారేదో ముఖ్యమైన పని మీదే మా ఇంటికి వచ్చారనిపించింది.

కాసేపు అవీఇవీ మాట్లాడాక జానకమ్మగారి పెద్దబ్బాయి అన్నాడు "మీరు ఓ వారం రోజులలోపున ఈ ఇల్లు ఖాళీ చేయాలి" అన్నాడు.

ఊహించని ఈ హఠాత్ పరిణామానికి మేమంతా విస్తుపోయాం. వాళ్లు అంత హఠాత్తుగా ఇక్కడకు రావడానికి, నా ఊహకు ఎక్కడో పోలిక కనిపిస్తోంది.
"అదేంట్రా... నీకేమైనా మతిపోయిందా! కృష్ణ ఆర్టిస్ట్ అని చెప్పగానే ఓసారి మాట్లాడాలని నువ్వంటే ఇంకేం మాట్లాడతావో




అనుకున్నా కానీ ఇదేంటి? ఇప్పుడు వాళ్లెందుకు ఖాళీ చేయాలి? " కోపంగా

అన్నారు జానకమ్మ.

"అవునమ్మా! నేను బాగా ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చాను. ఇలాంటివాళ్లు మనింట్లో ఉండటానికి వీల్లేదు" ఈ విషయం గురించి ఎక్కువగా మాట్లాడటం కూడా అతనికి ఇష్టంలేనట్టుంది.

"ఒరేయ్! నీకెవరో వీళ్ల గురించి చెడుగా చెప్పారు. వీళ్లు చాలా మంచివాళ్లురా" జానకమ్మగారు సర్ది చెప్పబోయారు.

"వాళ్లెంత మంచివాళ్లో నాకు తెలుసమ్మా! ఇక ఈ విషయంలో వాదనలు అనవసరం" అన్నాడతను.

"ఏంట్రా...? నువ్వు మాట్లాడేది. వాళ్లు చాలా మంచివాళ్లు. ఇన్నాళ్ళుగా నేను చచ్చానో, బతికానో లెక్కలేకుండా మీరెక్కడో అమెరికాలో ఉంటే నా కష్టం సుఖం చూసుకుంది వీళ్లేరా. వాళ్లు ఎక్కడికీ వెళ్లరు" అన్నారావిడ.

"ఏంటమ్మా ఇదంతా. నువ్వేమో ఒక్కత్తివి వుంటావు. వీళ్ల గొడవల మూలంగా మనింటికి పోలీసులు రావడం, కోర్టులు, కేసులు ఏమిటిదంతా... ఎవరో పిల్లాడిని వీళ్లు దగ్గరపెట్టుకుంటే వాళ్లని ఇంట్లోంచి పంపించనంటావేంటి? " విసుక్కున్నాడతను.

నా ఊహ నిజమే అయ్యింది.

"అవునమ్మా! ఈ ఇంటిని కూడా అమ్మేయాలనుకుంటున్నాం. మేమా ఇండియా వచ్చే ఉద్దేశ్యంలేదు. ఇక్కడ మాకు ఇల్లెందుకు? " అన్నాడు ఆవిడ రెండో కొడుకు.

"బావుందిరా... చాలా బావుంది. మీరింత హఠాత్తుగా ఇక్కడికి వచ్చి నామీద ప్రేమాభిమానాలు చూపిస్తుంటే నా పిల్లల్లో మార్పు వచ్చిందని అనుకున్నానే కాని దాని వెనుకనున్న అసలు కారణం ఇదని తెలుసుకోలేకపోయాన్రా. నిజమే. మీరు ఇండియా రావాల్సిన అవసరం ఏముంది? ఇక్కడున్న ఇల్లు కూడా అమ్మేసుకుని వెళ్ళిపోతే ఇక దేశంతో మీకేం సంబంధం ఉంది? మీ

కన్నతల్లి బతికున్నా, చచ్చిపోయినా మీకనవసరం. అంతేగా" ఆవిడ కళ్లల్లో నీళ్లు నిండాయి.

"అమ్మా! మీరు బాధపడకండి. మాకోసం మీ అబ్బాయిలతో మీరు గొడవపడకండి. వాళ్ళన్నట్లు మేము తప్పకుండా ఇల్లు ఖాళీ చేస్తాం" అంది అరుంధతి.

"మీరు కూడా నన్ను అనాథను చేసి వెళ్ళిపోతారా"

బేలగా అడుగుతున్న ఆవిడ్ని చూస్తుంటే నా గుండె పిండినట్లయ్యింది.

"అమ్మా! పరాయివాళ్ళముందు మమ్మల్ని అవమానం చేస్తున్నావు. మేమేమైనా నిన్ను అమెరికా తీసుకువెళ్ళమన్నామా! నిన్ను మాతో రావద్దని చెప్పామా! నీకే అక్కడకు రావడం ఇష్టంలేదు" అన్నాడు ఆవిడ పెద్ద కొడుకు.

"అవున్రా... తప్పంతా నాదే. మీరు నన్ను అమెరికా రావద్దని చెప్పరు కానీ రమ్మని కూడా తీసుకువెళ్ళరు. ఈ వయసులో తల్లి దేశంకాని దేశంలో ఏం ఉండగలదు? అని ఆలోచించరు. ఎక్కడో మనకు దూరంగా తల్లి ఒంటరిగా ఉంటోంది. అప్పుడప్పుడు కనీసం ఫోన్ చేసైనా తల్లి ఎలా వుందో కనుక్కుందాం అని అనుకోలేకపోయారు. ఈ రోజున ఎవడో వెధవ మన ఇంట్లో అద్దెకున్న వాళ్ళ గురించి చెప్తే ఎక్కడ ఈ ఇల్లు నేను వాళ్లకు రాసేస్తానో అన్న భయంతో మీరింత హఠాత్తుగా బయలుదేరి వచ్చారని నేను ఊహించలేకపోయాన్రా. వద్దురా... వద్దు నాకు మీ అభిమానాలు, ప్రేమలూ వద్దు. నేను కన్నపిల్లలు నా దగ్గర అభిమానం నటిస్తుంటే నేను చూడలేను. ఆ బాధ నేను భరించలేను. వెళ్ళిపోండి. మీరు వచ్చినచోటుకే వెళ్ళిపోండి. నా తదనంతరం ఈ ఇల్లు మీకే వస్తుంది. నా దగ్గర మంచిగా ఉన్నట్టు నటిస్తూ ఈ ఇల్లును సొంతం చేసుకోవాల్సిన అవసరం వాళ్లకు లేదు. కృష్ణబాబు తల్చుకుంటే ఇలాంటివి రెండిళ్లు కొనగలడు"

"అమ్మా..." ఆవిడ వాక్ప్రవాహానికి అడ్డు వేయాలన్నట్టుగా అరిచాడు వాళ్ళ పెద్దబ్బాయి.

"అవున్రా అమ్మనే చెప్తున్నాను. మిమ్మల్ని కన్నతల్లినే చెప్తున్నాను. ఈ అరుంధతినేగా ఎవరో కొడుకుని తెచ్చుకుంది అని అంటున్నది. తన కన్నబిడ్డ దుర్మార్గుడి పాలిన పడకూడదనే ఆ తల్లి ఆరాటపడుతోంది. పోరాడుతోంది. వాళ్లనా మీరు తప్పుగా అర్థంచేసుకుంటున్నది. వెళ్ళిపోండిరా... వీలైతే ఇప్పుడే ఈ క్షణమే మీరు వెళ్ళిపోండి" జానకమ్మగారు ఏడుస్తూ తమ వాటావైపుకు వెళ్ళిపోయారు.

ఆ రాత్రి అరుంధతి వెళ్ళి ఆవిడ్ని ఎంతో ఓదార్చింది. ఆవిడకు నచ్చచెప్పింది కానీ ఆవిడ వినిపించుకోలేదు. తనను ఈ వయసులో వదిలి వెళ్లద్దని తనకు అన్యాయం చేయద్దని ఏడ్చిందట.

అక్కడినుంచి వచ్చాక అరుంధతి నాతో అంది.

"ఏమిటో కృష్ణా! మనం వీడికోసం ఇంత కష్టపడుతున్నాం. రేపు వాడు మనల్ని ఎలా చూస్తాడో. అసలు చూస్తాడో చూడడో"

★ ★ ★

మరుసటిరోజు జానకమ్మగారి పిల్లలు వెళ్ళిపోయారు.

ఓరోజు కిరణ్ సరాసరి మా ఇంటికి వచ్చేశాడు.

నేను వీల్లేదని తలుపు వేయబోతుంటే నన్ను పక్కకు తోసేశాడు. ఇంట్లో నేను, చందన్, లక్ష్మి మాత్రమే ఉన్నాం.

కిరణ్ సరాసరి చందన్ దగ్గరికి వెళ్లాడు. అప్పటికే చందన్ భయపడిపోయి నా వెనుక వచ్చి దాక్కున్నాడు.

"భయపడకు చందన్! నేను నిన్నేమీ చేయను" అన్నాడు కిరణ్.



"నువ్వు బ్యాడ్ అంకుల్‌వి... నేను నీతో మాట్లాడను" అన్నాడు వాడు.

"లేదమ్మా! నేను బ్యాడ్ అంకుల్‌ని కాదు. చాలా మంచివాడిని. అయినా నీకు నేను డాడీని, అంకుల్‌ని కాదు. రామ్మా! నా దగ్గ రికి రా... ఇంక కొన్ని రోజులే. ఆ తర్వాత నువ్వు నా దగ్గరికి వచ్చేస్తావు. మనం ఈ ఊరినుంచే వెళ్ళిపోదాం. నీకేం కావాలంటే అవి కొనిస్తాను. చాక్లెట్లు, బిస్కెట్లు, బొమ్మలు ఏవి కావాలంటే అవి"

"ఊహు... వద్దు... నువ్వు మా డాడీవి కాదు. నువ్వు చాలా బ్యాడ్. నేను నీ దగ్గ రికి రాను" వాడు పరిగెత్తి వెళ్ళి బెడ్‌రూమ్ తలుపు వేసేశాడు.

"ఫర్వాలేదు బానే ట్రైనింగ్ ఇచ్చారు" ఓ విషపు నవ్వు నవ్వాడు కిరణ్. బయటకు వెళ్ళమని సైగచేశాను.

"అసలు ఈ సమస్యలన్నింటికి కారణం నువ్వే"

నేను మౌనంగా వింటున్నాను.

"నువ్వు అరుంధతిని పెళ్ళిచేసుకోకుండా ఉండుంటే కనీసం అరుంధతి నన్ను మోసం చేసిందని తెలిశాక తనను వదిలివేసుంటే ఈ రోజు ఈ పరిస్థితి వచ్చేదికాదు. చచ్చి నట్టు నా దయదాక్షిణ్యాలకోసం పడుండేది. నేనేం చెప్తే అది చేసేది. నాకు రెండోపె ళ్ళాంగా కాదు ఉంపుడుకత్తెగా కూడా"

కిరణ్ మాటలు పూర్తికాకముందే నా చెయ్యి అతని చెంపను తాకింది. నాకు పిచ్చిబలం వచ్చేసింది. కిరణ్‌ను బయటవ రకూ కొట్టుకుంటూ వెళ్ళాను.

"రేయ్! ఇంతకింత అనుభవిస్తావు. నా కొడుకును నాకు అప్పగించనినాడు నీ కూతురినీ చంపేస్తాను. మిమ్మల్ని సుఖంగా బతకనివ్వను. నామీదే చెయ్యి చేసుకుం టావా! నువ్వెంత? నీ బతుకెంత? నేను ఎంగిలిచేసి వదిలేసినదాన్ని కట్టుకున్న నీ బతుకు..." అంటూ ఇంకా ఏమేమో అన్నాడు.

ఈ సంగతులేవీ అరుంధతికి తెలియకూ డదనుకున్నాను. ఆమె అడిగినా కూడా ఇంటికి ఎవ్వరూ రాలేదనే చెప్పాను. కానీ చందన్ మాత్రం చెప్పేశాడు.

"మమ్మీ ఈరోజు ఆ బ్యాడ్ అంకుల్ ఇంటికి వచ్చాడు"

"నిజమా!" అని నావైపు తిరిగి "కృష్ణా! నిజమేనా" అని అడిగింది.

అవునని తల ఆడించాను.

"అవును మమ్మీ! డాడీని కూడా బాగా తిట్టాడు. మీ డాడీని నేనే, నా దగ్గరకు వస్తే బోల్డుబొమ్మలు, చాక్లెట్లు అన్నీ కొనిస్తాను అన్నాడు. నాకు చాలా భయంవేసింది మమ్మీ. మన బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి తలుపే సుకున్నాను. తర్వాత ఆ అంకుల్ డాడీని బాగా తిట్టాడు మమ్మీ"

అరుంధతి కళ్ళు కోపంతో ఎరుపెక్కాయి.

"కృష్ణా! పద వెడదాం" అంది అరుంధతి.

"ఎక్కడికి? " అని సైగచేశాను.

"రా కృష్ణా! చెప్తాను" అంది.

లక్ష్మిని జానకమ్మగారి దగ్గర వదిలి మేము ముగ్గురం బయలుదేరాం. ఆటో కిరణ్ ఇంటిముందు ఆగేదాకా వాళ్ళింటికని నాకు తెలియదు. ఆటో దిగి పరిగెత్తినట్టే లోపలికి వెళ్ళింది అరుంధతి. నేను, చందన్ తన వెనుక పరిగెత్తాం.

కాలింగ్‌బెల్ కొట్టి ఆగలేదు. తలుపు తీసేవరకు బెల్ కొడుతూనే ఉంది.

కిరణ్ డోర్ తీయగానే అతనిమీదకు ఆడ పులిలా లంఘించింది "మా ఇంటికి వచ్చి నన్ను, నా భర్తను అవమానిస్తావా! నా కొడుకును భయపెడతావా? ఇప్పుడు అనరా ఆ మాటలన్నీ... నీకు ధైర్యం ఉంటే ఇప్పుడను" అంటూ అతని గొంతు పట్టు కుంది.

"నిన్ను ఆనాడే చంపేసి ఉంటే ఈ గొడవ ఇంతదూరం వచ్చేది కాదు. నిన్ను చంపేస్తే కానీ నాకూ, నా కుటుంబానికి మనశ్శాంతి ఉండదు. నువ్వు చచ్చిపోవాలి.

అది కూడా నా చేతుల్లోనే"

కిరణ్ గుడ్లు తేలేశాడు.

ఓ పక్కనుంచి నేను, మరోపక్కనుంచి నందిని శాయశక్తులా ప్రయత్నిస్తున్నాం. కానీ అరుంధతి పట్టుమాత్రం సడలలేదు. అతికష్టంమీద విడిపించగలిగాం. ఒక్కక్షణం ఆలస్యమైఉంటే కిరణ్ ఊపిరి ఆగిపోయేదే.

అరుంధతిని చూస్తుంటే నాకే భయంవేసింది. కిరణ్ అయితే బాగా బెదిరిపోయాడు. భయంతో తెల్లబోయి చూస్తుండిపోయాడు.

"ఇప్పుడు తప్పించుకున్నావు కదా అని ఎప్పుడూ ఇలాగే జరుగుతుందనుకోకు. ఈసారి నా జోలికి వస్తే నిజంగా చంపేస్తాను. నేను జైలుకి వెళ్ళాల్సివచ్చినా సరే" ఒక్క నిమిషం అలుపు తీర్చుకోవడానికి ఆగింది.

"రా కృష్ణ! వెడదాం" అని చందన్ చెయ్యి పట్టుకుని బయటకు దారితీసింది. నాకూ, నందినికీ ఎలా రియాక్ట్ కావాలో అర్థంకావడంలేదు.

ఇంటికి వచ్చాక జానకమ్మగారు కేకలేశారు. "అతను మూర్ఖుడు, ఏదో వాగి వెళ్ళాడు. అతనేదో అన్నాడని నువ్వు పోట్లాటకు వెళ్లడమేమిటి? నిజంగా నీ చేతిలో వాడు చచ్చుంటే వాళ్ళ పరిస్థితి ఏమయ్యేది? "

"ఏమోనమ్మా! ఆరోజు వచ్చి కృష్ణని నానా మాటలన్నాడని వినేసరికి నాకు బాగా కోపం వచ్చేసింది. నేను అంతదూరం ఆలోచించలేకపోయాను" అంది.

మొత్తంమీద కోర్టు హియరింగ్ డేట్ దగ్గరపడింది.

మొదటి వాయిదాలో జడ్జి ఇరుపక్షాల లాయర్లు చెప్పేది విన్నాడు. కిరణ్, అరుంధతి, చందన్‌లకు రక్తపరీక్షలు, జన్యు పరీక్షలు జరగాలని ఆదేశించారు.

నిజానికి పరీక్షల అవసరం ఏముంది?

కిరణ్‌కు అరుంధతికి పుట్టినవాడే చందన్ అన్న సంగతి అందరికీ తెలిసిందే. రక్తపరీక్షలు, జన్యుపరీక్షలు మరోసారి నిర్ధారించాయి.

కిరణ్ తన వాదనను నిరూపించాడు.

అరుంధతి, కృష్ణలకు పిల్లలున్నారు కాబట్టి తన బిడ్డను సరిగా చూడరని, అందుకని తన బిడ్డను తనకు ఇప్పించాలని కిరణ్ వాదన.

అరుంధతి చాలా ధైర్యంగా జరిగినదంతా చెప్పింది.

ఆ తర్వాత చందన్ అభిప్రాయమూ కనుక్కున్నారు. "ఆ అంకుల్ చాలా బ్యాడ్! నన్ను ఒకసారి తీసుకెళ్ళి బాగా కొట్టాడు. అమ్మ కావాలి అని ఏడిస్తే తిట్టాడు. మీ మమ్మీ, డాడీలను చంపేస్తానన్నాడు. మాడాడీ, మమ్మీ అంటేనే నాకు ఇష్టం. ఆ అంకుల్ అంటే నాకు ఇష్టంలేదు. ఒకసారి మా ఇంటికి వచ్చి మా చెల్లెల్ని కూడా చంపేస్తానన్నాడు" అని చందన్ చెప్తుంటే జడ్జిలో ఆలోచన కనిపించింది.

★ ★ ★

కేసును వచ్చే నెలకు వాయిదా వేశారు.

కేసు తేలేదాకా కిరణ్ మా ఇంటివైపు రాకూడదని, ఎలాంటి అఘాయిత్యాలు చేయకూడదని కూడా జడ్జి వార్నింగ్ ఇచ్చారు.

ఇప్పుడు అరుంధతిలో కొంత భయం తగ్గింది.

శారదాంటీ, అంకుల్ కేసు తేలేదాకా ఇక్కడే ఉంటామంటూ వచ్చారు. ఆ రాత్రి చందన్, లక్ష్మిలు పడుకున్నాక మేము మాట్లాడుకుంటూ కూర్చున్నాం.

"కృష్ణా! ఒకవేళ మనం ఈ కేసు ఓడిపోతే చందన్‌ను కిరణ్‌కు అప్పగించాలంటావా!? " బేలగా అడుగుతున్న అరుంధతిని చూస్తుంటే చాలా జాలి కలిగింది.

"అలా ఎన్నటికీ జరగదు! ఈ కేసు మనమే గెలుస్తాం" ఊరడించారు శారదాంటీ.

"లేదమ్మా! ఆ కిరణ్ సామాన్యుడుకాడు. తను అనుకున్నది సాధించేదాకా నిద్రపోడు. ఒకవేళ అదే జరిగితే నేను చందన్‌ను వదిలి ఉండలేనమ్మా. వాడికోసం నేను ఎన్నోకష్టాలు ఓర్చుకున్నాను. అయిన వాళ్లందరికీ దూరమయ్యాను. నాకు వ్యతిరేకంగా కోర్టు తీర్పు వస్తే నేను తట్టుకోలేనమ్మా" తల్లి గుండెల్లో ఒదిగిపోయి భోరుమంది అరుంధతి.

"అరుంధతీ! ఇన్నాళ్లు ధైర్యంగా ఉన్నావ్! ఇంకొన్ని రోజులేగా! ఈ లోపల డీలాపడిపోతే ఎలా? మనం ఈ కేసు తప్పకుండా గెలుస్తాం. చందన్ మీ దగ్గర ఉంటాడు. వాడ్ని మీనుంచి ఎవ్వరూ వేరుచేయలేరు"

తల్లి మాటలకు అరుంధతి ఎంతవరకు సమాధానపడిందో కానీ మళ్ళీ ఈ సంగతి మా దగ్గర ఎత్తలేదు.

కేసు కోర్టుకు వెళ్ళాక అరుంధతికి కొంచెం ధైర్యం వచ్చింది. ఇంతవరకు కిరణ్‌కి భయపడి చందన్‌ని స్కూలు మాన్పించిన అరుంధతి ఇప్పుడు మళ్ళీ వాడ్ని స్కూలుకు పంపుతోంది. స్కూల్లో కూడా నేను, తను, ఆంటీ, అంకుల్ తప్పితే మరెవ్వరు వచ్చినా చందన్‌ను వారితో పంపవద్దని చెప్పింది. చందన్‌ను స్కూల్లో దింపడం, తీసుకురావడం పూర్తిగా నా బాధ్యత.

ఈమధ్య నా యాక్టివిటీలన్నీ పక్కన పెట్టేశాను.

ఆరోజు మామూలుగానే స్కూలుకి వెళ్ళాను.

మళ్ళీ స్కూలునుంచి చందన్ మాయం.

ఈసారి వెంటనే ఇంటికి వచ్చి ఆంటీతో ఈ సంగతి చెప్పాను.

శారదాంటీ విషయం వినగానే అరుంధతి బ్యాంక్‌కు ఫోన్‌చేసింది.

అరుంధతి వెంటనే ఇంటికి వచ్చింది.

ముందు ఇద్దరం కలిసి స్కూలుకు వెళ్లాం.



అక్కడ అరుంధతి అరిచిన అరుపులు, తిట్టిన తిట్లు అన్నీఇన్నీ కావు. పిల్లల్ని జాగ్రత్తగా చూసుకోవాల్సిన బాధ్యత వాళ్లది. అక్కడకీ మా అబ్బాయి పరిస్థితి గురించి మేము చెప్పాక కూడా ఇలా జరిగేసరికి అరుంధతి తట్టుకోలేకపోయింది.

అందుకే ప్రిన్స్‌పల్‌ను పట్టుకుని మీకు బాధ్యతలేదందిమీకు డబ్బు తప్పితే పిల్లలు ముఖ్యంకాదంది.

పిల్లాడు కనిపించడంలేదన్న సంగతి మేము వచ్చి చెప్పేదాకా మీకు తెలియడంలేదంటే మీరెంత బాధ్యతగా ఉంటున్నారో అర్థం అవుతోంది అంది. ఆఖరుకు "మా అబ్బాయికిగానీ ఏమైనా అయ్యిందో మిమ్మల్నెవ్వరినీ విడిచిపెట్టను" అంది.

మళ్లీ మొదలు...

పోలీసు కంప్లైంట్ ఇవ్వడం.

ధర్మారావుగారింటికి వెళ్ళడం.

అక్కడ్నించి కిరణ్ ఇంటికి వెళ్లడం.

కానీ ఈసారి కిరణ్‌ని చూస్తే అతని తప్పేంలేదనిపించింది. అతనికి రెండురోజులనుంచి జ్వరంగా ఉందని, అసలు బయటకు రాలేదని నందిని చెప్పింది.

కిరణ్ అమ్మగారు కూడా అదే అన్నారు. "బాబూ మావాడు క్రిమినల్‌కాదు. వాడికి ఇంతకుముందు నేరచరిత్రలేదు. ఏవో బలహీన క్షణంలో అరుంధతిని వదులుకున్నాడు. తనకు పిల్లలు పుట్టే అవకాశంలేదు కాబట్టి తన బిడ్డను తను కావాలనుకుంటున్నాడు. అది తప్పే... తాను చేసింది, చేస్తున్నది తప్పని వాడు తెలుసుకునే రోజు తప్పకుండా వస్తుంది. ఇప్పుడు మాత్రం నేను నా బిడ్డమీద ప్రమాణం చేసి చెప్తున్నాను. మీ అబ్బాయి కన్పించకుండా పోవడానికి మాకు ఏ సంబంధం లేదు"

"అరుంధతీ! చందన్‌ను నేను ఎత్తుకెళ్ళలేదు. నేను నిజమే చెప్తున్నాను, నన్ను నమ్ము" కిరణ్ ఆవిధంగా మాట్లాడటం నాకు ఆశ్చర్యంగా అనిపించింది.

మేమంతా వాళ్లింట్లోంచి బయటకు

వచ్చాం.

మరి చందన్ ఏమయ్యాడు?

ఎక్కడికి వెళ్లాడు?

ఎవరు తీసుకువెళ్లుంటారు?

ఆలోచనలతో నా బుర్ర వేడెక్కిపోతున్న సమయంలో హఠాత్తుగా నాకు ఫ్లాష్ అయ్యింది.

అవును! అలా ఎందుకు జరిగి వుండకూడదు?

శారదాంటీని, మిగతా వారిని అందరినీ ఇంటికి వెళ్ళిపోమన్నాను. అరుంధతి మాత్రం నా మాట వినిపించుకోలేదు.

'భగవంతుడా! చందన్‌ని ఏమి చెయ్యకు. వాడు క్షేమంగా ఉండాలి' మనసులో దేవుడ్ని ప్రార్థిస్తున్నాను.

నేను తనను ఎక్కడికి తీసుకువెడుతున్నానో అరుంధతికి అర్థంకాలేదు. రైల్వే ప్లాట్‌ఫాం టిక్కెట్లు కొంటుంటే అరుంధతి విస్తుబోయి చూసింది.

ఫస్ట్, సెకండ్, థర్డ్, ఫోర్త్...

ఒక్కో ప్లాట్‌ఫాం ఎక్కడం దిగడం. నాకు, అరుంధతికి అలుపు వచ్చేస్తోంది.

క్షణక్షణానికి టెన్షన్ పెరిగిపోతోంది.

ఒకవేళ చందన్ ఇక్కడ కూడా లేక పోతే!?

అయిదో నెంబర్ ప్లాట్‌ఫాం ఎక్కాం...

అణువణువూ నిశితంగా పరిశీలిస్తున్నాను.

ఓ చోట.

గబగబా పరిగెత్తుకుంటూ దగ్గరికి వెళ్లాను.

బెంచిమీద ముణగతీసుకుని కూర్చుని ఉన్నాడో కుర్రాడు. తలవంచి మోకాళ్లమధ్య పెట్టుకున్నాడు.

ఉద్వేగం, ఆనందంతో నాకు నోటమాట రాలేదు.

గభాల్న వాడ్ని దగ్గరికి తీసుకున్నాను.

ముందు కొంచెం ఖంగారుపడినా "డాడీ!" అంటూ నన్ను బలంగా హత్తుకుపోయాడు. అప్పటిదాకా కంట్రోలుచేసుకున్న బాధ వాడిలో కట్టలు తెంచుకుంది.

నెమ్మదిగా వాడి వెన్ను నిమురుతూ ఉండిపోయాను.

అంతలో అక్కడికి వచ్చిన అరుంధతి చందన్‌నుచూసి తనూ నిస్త్రాణగా బెంచి మీద కూర్చుండిపోయింది.

ఇంటికి వచ్చేంతవరకు మేమెవ్వరం మాట్లాడలేదు. ఆటో దిగాక నేను డబ్బులిచ్చేలోపే చందన్, అరుంధతి లోపలికి వెళ్లారు. నేను ఆటో అతన్ని పంపి లోపలికి వెడుతుండగా ఒక్కసారిగా ఏడుపు వినిపించింది. "చెప్పరా! ఈ పాడుబుద్ధి నీకే పుట్టిందా? లేక ఎవరైనా చెప్పారా! నీకోసం ఎక్కడని వెదికేది? చెప్పు... ఎందుకు చేశావా పని"

గభాల్న అరుంధతి రెక్కపుచ్చుకుని ఇవతలికి లాగాను.

"ఏమిటే అది పిల్లాడ్ని అలా గొడ్డును బాదినట్టు బాదుతున్నావు" అంటూ శారదంటీ చందన్‌ను దగ్గరకు తీసుకుంది.

"నీకు తెలీయదమ్మా! వాడు ఈరోజు కనిపించకపోతే నా ప్రాణంపోయేది. నా పిల్లలు అన్యాయం అయిపోయేవారు. ఇదంతా... ఇంత టెన్షన్ నేను తట్టుకోలేక పోతున్నాను. నిజంగా నావల్ల కావడంలేదు" బరస్ట్ అయ్యింది అరుంధతి.

ఆంటీతో చందన్‌ను లోపలికి తీసుకువెళ్ళమని చెప్పాను. అంకుల్ ధర్మారావుగారికి ఫోన్‌చేసి చందన్ దొరికాడని చెప్పారు. అంతలో కిరణ్ ఫోన్ చేశాడు. "ఆ దొరికాడు" అని అంకుల్ ఫోన్ పెట్టేశాడు. అలాగే పోలీసులకు కూడా ఫోన్‌చేసి చెప్పాం.

'నిజానికి ఇందులో చందన్ తప్పేమీ లేదు అని మాకు తర్వాత తెలిసింది. ముందురోజు రాత్రి మేము మాట్లాడుకున్న మాటలన్నీ చందన్ విన్నాడు. ఆ సంగతి మాకు ఎవ్వరికీ తెలీలేదు. మిగతాదంతా

అర్థంకాకపోయినా తను కిరణ్ దగ్గరకు వెళ్లాలి అన్న సంగతి వాడి చిన్న బుర్రలో పడిపోయింది. కేసు మనం ఓడిపోతే అన్న సంగతి వాడికి తెలియలేదు. వాళ్ళమ్మను, నన్ను వదిలి కిరణ్ దగ్గర ఉండటం వాడికి ఇష్టంలేదు. పైగా అదేదో మేమే వాడ్ని కిర ణ్‌దగ్గరకు పంపుతున్నామని వాడి ఫీలింగ్. దాంతో మామీద కోపం వచ్చింది. ఇదివర కెప్పుడో ఓసారి అరుంధతి నా గురించి వాడికి చెప్తూ 'మీ డాడీకి ఇంట్లో వాళ్ళమీద కోపంవస్తే ఏ బస్‌స్టాండ్‌కో, రైల్వేస్టేషన్‌కో వెళ్ళిపోయేవారు' అని చెప్పింది. ఆ మాటలు మేము మర్చిపోయాం. కానీ వాడికి గుర్తుంది. దాంతో ఇంటర్వెల్లో ఎలా గో అలా స్కూల్లోంచి బయటకు వచ్చి ఆటో ఎక్కి రైల్వేస్టేషన్‌కి అని చెప్పాడట. తీరా అక్కడికి వెళ్ళాక ఆటోవాడు డబ్బులు అడి గితే నా దగ్గర లేవంటూ స్టేషన్‌లోకి జనం మధ్యలోకి పారిపోయాడట.

ప్లాట్‌ఫాంలన్నీ కాసేపు తిరిగాడు. వాడి లంచ్‌బాక్స్ ఖాళీచేశాడు. అక్కడంతా వాడికి కొత్తగా అనిపించింది. ఆ రైళ్లు, ఆ జనం అంతా సరదాగానే ఉంది. కానీ టైమ్ గడి చేకొద్దీ భయం మొదలైంది. ఇంటికి ఎలా వెళ్లాలో అర్థంకాలేదు.

ఇదీ జరిగింది.

ఆటో అతను అంత చిన్నపిల్లాడు ఒక్కడూ ఆటో ఎక్కాడు కదా అని ఇంకే దైనా చేసుంటే.

స్టేషన్‌లో వాడ్ని ఒక్కడ్నీ చూసి ఎవ రైనా దుర్మార్గంగా ఆలోచించివుంటే. అంత కన్నా ఆలోచించలేకపోయాను.

ఆ రాత్రంతా కూర్చుని నేనో ఉత్తరం రాశాను.

ఆ ఉత్తరం మరెవరికో కాదు, కిరణ్‌కి.

ఈ సంగతి నేను అరుంధతికి కూడా చెప్పలేదు. తను బ్యాంక్‌కి వెళ్ళాక నేను బయలుదేరి కిరణ్ ఇంటికి వెళ్లాను.

ఇంట్లో అతనొక్కడే ఉన్నాడు.

మరీ మంచిది. ఫ్రీగా మాట్లాడవచ్చు లేదా గొడవపడచ్చు

"రండి కృష్ణా! కూర్చోండి. నందినీవాళ్ళు గుడికి వెళ్లారు. ఇప్పుడే వచ్చేస్తారు" అన్నాడు.

కిరణ్‌లో అంత సౌమ్యత నేనెన్నడూ చూడలేదు.

అతికష్టంమీద సోఫాలోంచి లేచాడు. అతను నిలబడుతుంటే ఒక్కసారిగా ఒళ్లు తూలింది. అతను పడబోతుంటే గభాల్న పట్టుకున్నాను.

"థాంక్స్" చిన్నగా నవ్వాడు కిరణ్. "మీకు కనీసం మంచినీళ్లైనా ఇద్దామని"

"ఫర్వాలేదు. అవసరమైతే నేనే తీసుకుం టాను" అని సైగ చేశాను.

నేను తెచ్చిన లెటర్ కిరణ్ చేతికి ఇచ్చాను.

అతను ఓ పక్క ఆశ్చర్యపోతూనే లెటర్ అందుకున్నాడు. అందులో ఇలా ఉంది.

"కిరణ్‌గారూ!

మంచో, చెడో... మీ స్థానంలోకి నేను వచ్చాను. కానీ మీకు తెలుసో లేదో అరుం ధతి నా చిన్ననాటి నేస్తం. నేను మూగవా డిని. నాకు మాటలు రాకపోవడంతో నా చుట్టూ ఉన్న పిల్లలంతా నన్ను మూగోడు అని, పిచ్చోడు అని గేలిచేసేవారు. ఆ సమ యంలో మా పక్క వాటాలోకి అద్దెకు దిగారు అరుంధతీ వాళ్లు.

శారదాంటీ చాలా మంచావిడ. నాలో ఉన్న లోపాన్ని మర్చిపోయేలా చేసింది. నాకు బొమ్మలు వేయడం నేర్పించారు. అరుంధతి కూడా నాతో ఎంతో స్నేహంగా ఉండేది. మిగతా పిల్లలంతా నన్ను ఏడిపి స్తుంటే తను మాత్రం 'కృష్ణా' ఆడుకుం దాంరా అంటూ

ఆప్యాయంగా పిలిచేది. అప్పట్లో మేం బొమ్మల పెళ్ళిళ్లు కూడా చేసేవాళ్ళం. నేను నాన్న, అరుంధతి అమ్మ. ఇద్దరం కలిసి పెళ్ళిచేసేవాళ్ళం. ఒక ఆట అని ఏముంది?

 

# పరిమళ ముత్యాలు

✷ చేతిలోని దీపం మార్గాన్ని వెలుగుతో నింపుతుంది. చదువు దారి తప్పిన మనసును కాంతివంతం చేస్తుంది.

– మదర్

✷ ఎక్కువ చదవడంవల్ల కాదు వివేకంతో చదవడం వల్లనే పరిపక్వత లభిస్తుంది.

– రాజాజీ

✷ జ్ఞానార్జనకంటే అజ్ఞానాన్ని కప్పిపుచ్చుకోవడమే కష్టం.

– హెన్రీఫోర్డ్

✷ ఆనందాన్ని విభజించడమే దాన్ని హెచ్చించే ఏకైక మార్గం.

– సిడ్నీస్మిత్

✷ ఏ ఆకర్షణకు ఏమాత్రం లొంగని అచంచల ఆత్మబలం ఉన్న వ్యక్తులు ప్రకృతి రహస్యాలను శోధించి ఛేదించగలుగుతారు.

– వివేకానంద

✷ మీ పిల్లలను సద్వర్తనులుగా చేయటమే విద్యాభ్యాసానికి ప్రారంభం.

–రస్కిన్

✷ చెడు వినకూడదనే వాడుంటే చెడు చెప్పే వాడుండడు.

– మీరావలీబాబా

✷ ప్రస్తుతపు గడియను సంతోషంగా అనుభవించండి. గతానికి ధన్యవాదాలు తెలపండి.

– మార్షియల్

✷ వజ్రాన్ని సానబెడుతున్నప్పుడు రాపిడి ఎలా తప్పదో మనిషికి పరీక్షలు తప్పవు.

– స్మిత్

✷ అధికారం సమానతను అంగీకరించదు. పొగడ్త కోసం స్నేహాన్ని కూడా తోసివేస్తుంది.

– ఎడ్వర్డ్‌మూర్

✷ వరుసగా మనం చేసే మంచి పనుల కారణంగా ఏదో ఒక మంచి పని వలన మంచి స్నేహం ఏర్పడుతుంది.

– శామ్యూల్ జాన్సన్

సేకరణ: పి.వి. రమణ కుమార్

ఎన్నో రకాల ఆటలు ఆడుకునేవాళ్ళం. అరుంధతి వాళ్ళకు ట్రాన్స్‌ఫర్ అయి వెళ్ళి పోయేటప్పుడు తను నన్ను పట్టుకుని ఎంతగా ఏడ్చిందో నాకు గుర్తుంది. ఇదంతా ఆమె మర్చిపోయి ఉండచ్చు కానీ ఆరోజు లన్నీ మధుర జ్ఞాపకాలుగా నా గుండెల్లో పదిలంగా ఉన్నాయి.

అరుంధతిని నా జీవితంలో చూడలేనేమో అనుకున్నాను. కానీ మా మరదలికి పిన్ని కూతురుగా మరోసారి నా జీవితంలోకి వచ్చింది. తనకు ఉద్యోగం ట్రాన్స్‌ఫర్ అయి ఇక్కడకు వచ్చింది. మా ఇంట్లోనే ఉండేది. అరుంధతి నా కళ్ళముందు ఉంటే నాకెంతో ప్రశాంతంగా ఉండేది. ధైర్యంగా ఉండేది. కానీ అప్పుడప్పుడు పార్క్‌లో తను మిమ్మల్ని కలుస్తుంటే నాకు చాలా బాధ కలిగేది. అంతలోనే వివేకం మేల్కొనేది. నేను అరుంధతిని ఆశించడం తప్పు అనిపించేది.

ఇలా ఉండగా ఓరోజు రాత్రి నిద్రమాత్రలు వేసుకుని పడుకున్న నన్ను ఇంట్లో వాళ్ళంతా బలవంతంగా నిద్రలేపారు. అరుంధతి మీద బలాత్కారం చేశానన్నారు. నాకేమీ అర్థం కాలేదు. మెదడులో నరాలు చిట్లిపోతాయేమోనన్పించింది. నేనిలాంటి పాడుపని ఎలా చేశాను? అందరూ కలిసి తలా ఓ పరిష్కారం చెప్పారు. అరుంధతి మాత్రం 'నేను కృష్ణను పెళ్ళిచేసుకుంటాను' అని చెప్పింది.

ఆవిధంగా మాకు వివాహమైంది.

వివాహమైతే అయ్యిందికానీ మా మధ్య ఎలాంటి సంబంధమూ ఉండేది కాదు. ఓసారి అరుంధతి గర్భిణి అనీ తెల్సింది. కానీ అమ్మ అనుమానంతో కూపీ లాగేసరికి తను చేసిన మోసం బయటపడింది.

అందరూ అరుంధతిని తిట్టారు.

అబార్షన్ చేయించుకోమన్నారు.

కానీ తను వినలేదు.

ఈ బిడ్డ నాకు కావాలి. నా బిడ్డను రక్షించుకోవడం కోసమే నేనీపని చేశానంది.

పెళ్ళికాకుండా బిడ్డను కనడంకన్నా మొగుడు వదిలేసిన ఆడదానిగా బిడ్డను కంటే ఆ బిడ్డకు గౌరవం ఉంటుందనే ఈ పని చేశానంది.

కృష్ణకు విడాకులిచ్చేస్తాను అంది.

అరుంధతి బాధను నేను చూడలేకపోయాను. ఆమె కన్నతల్లి కూడా మా అమ్మాయి చేసింది తప్పే, నిన్ను దారుణంగా మోసం చేసింది. దాని ఖర్మకు దాన్ని వదిలేయ్... నీకేం తక్కువ? చక్కగా లక్షణంగా ఉన్న మరో అమ్మాయిని పెళ్ళి చేసుకో అన్నారు.

అరుంధతే కావాలనుకుంటే నాకు ఈ ఇంట్లో స్థానం లేదని నాన్న అన్నారు.

కానీ అరుంధతిని ఎలా వదిలేయగలను?

ఈనాటిదా ఆ అనుబంధం?

నా చిన్ననాటి నేస్తం...

అందరూ నన్ను గేలిచేస్తుంటే 'రా కృష్ణా!' ఆడుకుందాం అంటూ నా చెయ్యి పట్టుకున్న నేస్తం...

ఎన్నో సంవత్సరాలుగా నా గుండెల్లో ఉండిపోయి నాకు విశ్వాసాన్ని, ధైర్యాన్ని ఇచ్చిన నేస్తం.

తిరిగి నా జీవితంలోకి అడుగుపెట్టి నాలో ప్రేమభావనలు కలిగించిన నా నెచ్చెలి.

ఎలా కిరణ్? అరుంధతిని ఎలా వదిలేయను?

అరుంధతి నన్ను మోసం చేసిందంటున్నారు. మరో కోణంలోంచి ఆలోచిస్తే తన బిడ్డను కాపాడుకోవడానికి ఓ తల్లిపడే తపన కన్పించడంలేదా?

భార్యగా నన్ను మోసం చేసుండచ్చు

కానీ తనలో ప్రాణం పోసుకున్న పిండాన్ని చిదిమేయకుండా, కన్నాక ఏ చెత్త కుప్పలోనో విసిరేయకుండా నా బిడ్డ నాకు కావాలి అంది. అందుకోసం తన తల్లీ, తండ్రి, కుటుంబం, పరువు అన్నీ వదులుకో




వడానికి సిద్ధపడింది.

అందుకే అరుంధతితో జీవించడానికే నేను ఇష్టపడ్డాను.

అలా మేమిద్దరం ఇంట్లోంచి బయటకు వచ్చేశాం.

జానకమ్మగారికి మా గురించి అంతా తెలుసు. ఆవిడ మమ్మల్ని సానుభూతితో అర్థం చేసుకున్నారు.

అరుంధతిలో మునుపటి ఉత్సాహం ఉండేది కాదు. ఎప్పుడూ దిగులుగా ఉండేది. డాక్టరు ప్రతినెలా కేకలేసేది. వెయిట్ పెరగడం లేదు. సరిగా తినడంలేదని తిట్టేది.

అరుంధతిని చూస్తుంటే ఎక్కడున్నా మిమ్మల్ని వెతికి తీసుకొచ్చి తన ముందు నిలబెట్టాలన్పించేది.

అరుంధతికి బాబు పుట్టాక కొంత మారింది.

మీరు వచ్చి ఎప్పుడైతే తనను చులకన చేసి వెళ్ళారో అప్పుడు తనకు బాగా సీరియస్ అయ్యింది. తను మాకు దక్కదనే అనుకున్నాం.

అరుంధతికి ఏదైనా అయినా తప్పకుండా మిమ్మల్ని చంపి నేను జైలుకి వెళ్ళేవాడిని.

కిరణ్ చదువుతూ చదువుతూ ఒకసారి తల పైకెత్తి చూశాడు. అరుంధతి నాకు దక్కింది.

అప్పట్నించీ తనను ఉత్సాహంగా ఉంచడానికి, జరిగినవన్నీ మర్చిపోయేలా చేయడానికి నేను ఎంతో కష్టపడాల్సివచ్చింది.

ఆ సమయంలో ధర్మారావుగారు నందిని పెళ్ళికి రమ్మన్నారు. పెళ్ళికి వచ్చుంటే ఆరోజే ఆయనకు జరిగినదంతా చెప్పేవాడినేమో. భగవంతుని సాక్షిగా చెప్తున్నాను. అప్పటివరకూ అరుంధతికి నాకు మధ్య ఎలాంటి సంబంధమూ ఉండేదికాదు. మేం మంచి ఫ్రెండ్స్‌లా ఉండేవాళ్ళం.

ఆ తర్వాత మేం భార్యాభర్తలమయ్యాం. లక్ష్మి పుట్టింది.

కిరణ్! నీ బాధ, ఆవేదన నేను అర్థం చేసుకోగలను. కానీ చందన్‌ను బలవంతంగా నువ్వు పొందగలిగినా వాడితో నాన్నా అని అనిపించుకోగలవా? వాడి ప్రేమను పొందగలవా?

కేసు ఓడిపోతే చందన్ కిరణ్ దగ్గరకు వెళ్ళాల్సివస్తుందేమో అన్న తల్లి మాటలు విని వాడు ఇంట్లోంచి పారిపోయాడు. అలాంటిది నీ దగ్గర వుంటాడా? ఇక్కడ్నించి పారిపోయి ఎక్కడకు వెడతాడు? అలా చేస్తే వాడు నీకు, మాకు కూడా దక్కకుండా పోతాడు.

కిరణ్! నేను నిన్ను అర్థించేది ఒక్కటే. దయచేసి కేసు వాపసు తీసుకో. నీ మనసులో ఉన్న దుర్మార్గమైన ఆలోచనలన్నీ విడిచిపెట్టు. చందన్ నీ కొడుకే.

నీ కొడుకు ప్రేమను పొందడానికి ఇది పద్ధతి కాదు. వాడితో స్నేహం చెయ్యి. వాడితో మంచిగా ఉండు. నువ్వు మంచివాడివని వాడు నమ్మాలి. అందుకు ఓర్పుతో ఉండు.

వాడు పెద్దవాడు అయ్యేకొద్దీ వాడికీ విచక్షణ వస్తుంది. తప్పొప్పులు, మానవ బలహీనతలు అర్థం చేసుకునే వయసు వస్తుంది. వాడు నీకు దగ్గరవుతాడు. నీ తండ్రి స్థానాన్ని గౌరవిస్తాడు.

అలా కాకుండా కోర్టులు, కేసులు, నువ్వు వాడ్ని బలవంతంగా ఎత్తుకువెళ్ళడం అవన్నీ వాడి బాల్యాన్ని వ్యధాపూరితం చేస్తాయి.

వాడు, వాళ్ళమ్మ కూడా ప్రశాంతంగా బతకలేరు.

వాడు చదవలేడు. ఉత్సాహంగా ఉండలేడు.

ఎప్పుడు నువ్వొచ్చి వాడ్ని మానుంచి దూరం చేస్తావా? అని భయం భయంగా బతుకుతాడు.

ఎంతో తెలివైన వాడి భవిష్యత్తు నాశనం అయిపోతుంది.



ఆలోచించు కిరణ్.

కేసు నువ్వు ఓడిపోతే అరుంధతి నిన్ను ఆ ఛాయలకు కూడా రానివ్వదు. నువ్వు శాశ్వతంగా చందన్‌ను కోల్పోతావు.

నువ్వు కేసు గెలిస్తే...

చందన్ నీకూ, మాకూ కూడా కాకుండా పోతాడు.

కేసు ఓడిపోతామన్న భయంతో నేను నీకు ఇదంతా చెప్పడంలేదు. అర్థం చేసుకుంటావుకదూ!

★ ★ ★

పదిహేనేళ్ళ తర్వాత.

సమయం ఉదయం 7 గంటలవుతోంది.

కారు ఇంటిముందు ఆగింది.

కార్లోంచి మేం ముగ్గురం దిగాం.

"బై డాడీ! సీయూ టుమారో..." అన్నాడు చందన్ చెయ్యి ఊపుతూ.

"బై సన్" తనూ చెయ్యి ఊపాడు కిరణ్.

"నాన్నా! నాకు లేటవుతోంది. కాలేజి టైమ్ అవుతోంది. మీరు డాడీతో మాట్లాడి రండి" అంటూ చందన్ లోపలికి వెళ్ళిపోయాడు.

అలాగేనన్నట్టు తలాడించాను.

"వస్తాను కృష్ణా! ఆరోజు నువ్వు నాకు ఆ ఉత్తరం ఇవ్వకపోతే ఈరోజు మన జీవితాలు ఎలా ఉండేవో తల్చుకుంటేనే భయం వేస్తోంది" రోజుకు కనీసం ఒకసారైనా ఆ మాట అంటాడు కిరణ్. ఓదార్పుగా భుజం మీద చెయ్యి వేశాను.

అంతలో అరుంధతి బయటకు వచ్చింది.

"కిరణ్! ఇప్పుడే నందిని ఫోన్ చేసింది. మీ అమ్మాయి నిద్ర లేచిందట. వెంటనే నిన్ను చూడాలని గొడవ చేస్తోందట"

ఆ మాట వినగానే "వస్తాను కృష్ణా" అంటూ హడావుడిగా కారెక్కాడు కిరణ్.

అతని ఖంగారు, హడావిడి చూస్తుంటే ఒకప్పటి కిరణ్‌నేనా నేను చూస్తున్నది అన్పిస్తుంది.

"కూతురంటే ఎంత ప్రేమో..." నవ్వింది అరుంధతి.

అవునన్నట్టు తలాడించాను.



ఇద్దరం లోపలికి నడిచాం.

అప్పటికే వసంతలక్ష్మి కాఫీ కప్పుతో రెడీగా వుంది.

ప్రతిరోజూ ఉదయం అయిదింటికల్లా వచ్చేస్తాడు కిరణ్.

నేను, మా పెద్దబ్బాయి చందన్, కిరణ్ ముగ్గురం గ్రౌండ్స్‌కి వెడతాం. కాసేపు టెన్నిస్ ప్రాక్టీసు చేస్తాం.

దారిలో మమ్మల్ని దింపి తను వెళ్ళిపోతాడు.

పావుతక్కువ ఏడుకు మా ఇంటి దగ్గర బయలుదేరి సరిగ్గా ఏడింటికల్లా వాళ్ళ ఇంటి దగ్గర ఉంటాడు.

కిరణ్ కూతురు చంద్రిక నిద్రలేవగానే ముందు వాళ్ళ డాడీని చూస్తుంది. లేదంటే కళ్ళు తెరవదు. అందుకే కిరణ్ హడావుడిగా పరిగెత్తాడు.

"డాడీ! కాఫీ చల్లారిపోతుంది" అంది లక్ష్మి.

నవ్వుతూ అందుకున్నాను.

ఇంకా నా కనిష్ఠ పుత్రరత్నం నిద్రలేచి

నట్టు లేదు. లక్ష్మి తర్వాత రెండేళ్ళకి పుట్టాడు వాడు.

వీడి పేరు కార్తీక్.

చందన్, కార్తీక్ ఇద్దరు ఎంతో బాగా పెయింట్ చేస్తారు.

లక్ష్మి ల్యాండ్‌స్కేప్స్, అబ్‌స్ట్రాక్ట్ బాగా వేస్తుంది.

ఇంతకీ కిరణ్‌కు కూతురేంటి?

మీ అనుబంధం ఇంత సఖ్యంగా ఉందేమిటి? అని అడిగితే ఈ అనుమానాలన్నీ తీర్చాల్సిన బాధ్యత నాకు ఉంది.

ఆరోజు సుమారు పదిహేనేళ్ళక్రితం నేను కిరణ్‌కి ఉత్తరం ఇచ్చి వచ్చేశాను.

ఆ మర్నాడనుకుంటాను. మా లాయరు నాకు ఫోన్ చేశాడు కిరణ్ కేసు వాపసు తీసుకున్నాడని.

అది విని అరుంధతి ఆనందానికి అంతు లేకుండా పోయింది. వెంటనే చందన్ దగ్గరకు వెళ్ళి "నువ్వెక్కడికీ వెళ్ళక్కర్లేదు. నువ్వు మాతోనే ఉంటావు. ఇంకెప్పుడూ ఇల్లు వదిలి పారిపోకూడదు" అంది. వాడికి ఆ మాటలు బాగా అర్థం అయ్యాయి.

"ఇదంతా ఎలా సాధ్యం కృష్ణా!" అంటే నేను నవ్వి వూరుకున్నాను. కేసు వాపసు తీసుకున్నాక కూడా అరుంధతి కొన్నిరోజుల పాటు చందన్‌ను కిడ్నాప్ చేస్తాడేమో అని కిరణ్ గురించి భయపడుతూనే ఉండేది.

అలాంటిదేం జరగదని ధైర్యం చెప్పేవాడిని.

అప్పుడప్పుడు నందిని మా ఇంటికి వస్తుండేది. తనతో చందన్, అరుంధతిలు బాగానే మాట్లాడేవారు.

కానీ కిరణ్ వస్తేనే ఇద్దరూ లోపలికి వెళ్ళిపోయేవారు.

అతనికీ అర్థం అయ్యింది. వాళ్ళను తను ఎంతగా బాధపెట్టి ఉండకపోతే తనమీద అంత అసహ్యం పెంచుకుంటారు? ఆ మాటే నాతో అనేవాడు.

క్రమంగా ముందు అరుంధతిలో మార్పు వచ్చింది.

వయసు వచ్చేకొద్దీ చందన్‌లోనూ మార్పు వచ్చింది.

లక్ష్మి పుట్టిన రెండేళ్ళకి అరుంధతి కవల పిల్లల్ని కంది. అబ్బాయి, అమ్మాయి...

అమ్మాయిని తనకిస్తే పెంచుకుంటానని నందిని అడిగింది.

ముందు అరుంధతి ఒప్పుకోలేదు. నేనెంతో నచ్చచెప్పాక అంగీకరించింది.

చంద్రిక రాకతో కిరణ్ పూర్తిగా మారిపోయాడు. పిల్లలు, అనుబంధం అతనికి తెలిసివచ్చింది. ఆరోజు తను చేసిన తప్పులకు తనను క్షమించమని అరుంధతిని ఎన్నోసార్లు అడిగాడతను.

చంద్రిక, కిరణ్‌లను చూస్తే నాకు ఆశ్చర్యంగా ఉంటుంది. ఆ తండ్రీ కూతుళ్ళది ఓ ప్రత్యేక ప్రపంచం.

కూతురు నేలమీద కాలుపెడితే కందిపోతుందేమోనన్నంత గారాబం చేస్తాడు. చంద్రిక ఏది అడిగినా కాదనడు.

ఒక్కోసారి చంద్రిక నా కూతురన్న సంగతి నేనే మర్చిపోతుంటాను.

ఇదీ నా కథ.

చందన్‌కు జరిగినదంతా తెలుసు.

మిగతావారికి తెలీదు. తెలియాలని కూడా నేను కోరుకోవడంలేదు. చందన్ సాఫ్ట్‌వేర్ ఇంజనీరయ్యాడు. త్వరలో అమెరికా వెళ్ళిపోతున్నాడు.

నేనీరోజు గొప్ప చిత్రకారుడిగా, ముగ్గురి బిడ్డల తండ్రిగా ప్రశాంతంగా, ఆనందంగా జీవిస్తున్నానంటే అందుకు కారణం శారదాంటీ, తరువాత అరుంధతి. ఆమె నా తోడుంటే అనంత ప్రదేశాల ఆవలితీరాలు సైతం వెతుక్కుంటూ అడుగులు వేస్తాను. జీవితపు చిక్కుముడులన్నీ విప్పేందుకు ప్రయత్నిస్తాను.

అదే ఆమె నాకు దూరమైతే.

శూన్యంగా మిగిలిపోతాను.



# ఏరినముత్యాలు

* చెప్పడానికి ఏమీ లేదని వాస్తవానికి మాటల తోడుగు తొడగకుండా గైర్‌హాజర్ కాగల వ్యక్తే నిజంగా ధన్యుడు.

— జార్జి ఎలియట్

* నాలోని లోటుపాట్లకు భగవంతుడికి ధన్యవాదాలు. వాటిద్వారానే నన్ను, నా పనినీ నా దేవుడినీ తెలుసుకోగలను.

— హెలెన్ ఆడమ్స్‌కెల్లర్

* ఏదో ఒక దాన్ని కోరుకుంటున్నంతవరకూ మనిషి ముసలివాడుకాదు.

— జీన్‌రోస్టాండ్

* సహవాసాలద్వారా అవినీతికి పాల్పడే అవకాశం ఉన్నట్టే పుస్తకాలద్వారా కూడా వుంది.

— హెన్రీ ఫీల్డింగ్

* చెడు పుస్తకానికి మించిన చెడ్డదోపిడీదారుడు మరొకడు లేడు.

— ఇటాలియన్ సామెత

* పూర్వాపరాలు ఆలోచించి నిర్ణయాలు తీసుకోబడాలి. కానీ ఒకసారి నిర్ణయం తీసుకున్న తరువాత కార్యాచరణలో ఎలాంటి సంకోచాన్ని కనబరచకూడదు.

— తిరువళ్ళువర్

* ఓటమిని గురించి భయపడకండి. ఒక మంచి కారణం కోసం ఓడిపోవడం అన్నది గెలుపుకు మరింత చేరువలో ఉండడం అవుతుంది.

— హెచ్. డబ్ల్యు. బీచర్

* మీ శత్రువు కోసం మీరు రాజేసిన నిప్పు మీ శత్రువుకంటే మిమ్మల్నే ఎక్కువగా కాలుస్తుంది.

— ఫ్రాన్సిస్‌బేకన్

* బాగా ప్రార్థన చేయగలగడం తెలిసినవాడే బాగా జీవించడం తెలిసినవాడౌతాడు.

— సెయింట్ అగస్టీన్

* ఆశావాదికి ఆపదలో కూడా ఆశ వికసిస్తుంది. నిరాశావాదికి వచ్చే ప్రతి అవకాశంలోనూ ఆపద కన్పిస్తుంది.

— కాబెల్

* రాబోయే తరం మిమ్మల్ని గమనిస్తున్నట్లు జీవించండి. వ్యవహరించండి.

— నిఖైల్ స్వటిలోవ్

* ఎల్లప్పుడూ సంతోషంగా నవ్వుతూ ఉండడం ద్వారా మనం ప్రార్థనకంటే కూడా త్వరగా దేవుడికి చేరువ అవుతాము.

— స్వామి వివేకానంద

సేకరణ: **దాసరి వెంకట రమణారావు**

# చతుర ప్రపంచం

## కొత్త పరికరాలు

గత పాతికేళ్లలో మనిషికి మరిన్ని సౌకర్యాలను అందచేస్తూ ఎన్నో ఆధునిక పరికరాలు వచ్చాయి. వి.సి.ఆర్, సి.డి. ప్లేయర్, కంప్యూటర్, ఇ-మెయిల్... ఒకటేమిటి...?. ఫ్యూచరిస్ట్ అనే పత్రికలో ఈ విషయం వెల్లడైంది.

కెమేరా ఫిల్మ్ త్వరలోనే కనుమరుగవబోతోంది. ఫిల్మ్ బదులు కెమేరాలో వుండే ఓ కంప్యూటర్ చిప్‌లో అన్ని దృశ్యాలూ నమోదవుతాయి. దాన్ని కంప్యూటర్‌కి కనెక్ట్‌చేసి చూసుకుని అవసరమైన




అమెరికాలోని శాస్త్రజ్ఞులు మరిన్ని అధునాతన పరికరాలని కనిపెడుతున్నారు. ప్రతీ పెద్ద అమెరికన్ కంపెనీకి రిసెర్చి డివిజన్ వుండబట్టి ఇది సాధ్యమవుతోంది.

ఫలితంగా రాబోయే ఇరవై ముప్పై ఏళ్లలోనే నేడు మనం ఉపయోగించే ఎన్నో పరికరాలు పోయి, వాటిస్థానంలో కొత్తవి చోటు చేసుకుంటాయట. అమెరికాలోని ఫొటోలనే ప్రింటర్ ద్వారా ప్రింట్ చేసుకుంటారు.

తాళం కప్ప, చెవి కూడా అదృశ్యమవుతాయి. ఇల్లు, కారులాంటి వాటన్నిటికీ మనిషి కంఠధ్వని లేదా చేతి(వ్రా)లు తాళం

చెవిగా పనిచేస్తాయి.

కళ్లద్దాలు కూడా మాయం అవుతాయి. తేలికైన మైక్రోసర్జరీ ద్వారా కంటిలోని లోపాలు సరిచేయబడతాయి. లేదా శాశ్వతంగా అద్దాలు ఆపరేషన్ ద్వారా కళ్లలోనే ఇన్‌ప్లాంట్ చేయబడతాయి.

చెక్ బుక్స్ కూడా మాయం అయి ఎలక్ట్రానిక్ చిప్ గల కార్డు ద్వారా అన్ని చెల్లింపులూ జరుగుతాయి. (ఇప్పటికే క్రెడిట్ కార్డు చెల్లింపులు జరుగుతున్నాయి)

వి.సి.ఆర్. టేప్ మాయం అయి సీడీల్లోకొచ్చినట్టు కొంత కాలానికి సీడీలు మాయం అయి ఎలక్ట్రానిక్ చిప్స్‌గల అంగుళంలో నాలుగోవంతు పరిమాణంగల కొత్త పరికరాల ద్వారా సినిమాల్లాంటివి చూసుకోవచ్చు.

ఇంట్లో కరెంట్ స్విచ్చిలుండవు. బదులుగా మనిషి పలికే కోడ్ వర్డ్స్ ద్వారా దీపాలు వెలిగి, ఆరుతూ వుంటాయి. అలాగే మిగిలిన అన్ని ఎలక్ట్రిక్ పరికరాలూ పనిచేస్తాయి.

ఇంకా ఇలా ఎన్నో మనం ఈనాడు నిత్యజీవితంలో ఉపయోగించే పరికరాలు పోయి వాటిస్థానంలో మరింత సౌకర్యంతో వుండే కొత్త పరికరాలు వస్తాయి. ఈ సాంకేతికాభివృద్ధి పెరిగి పెరిగి చివరికి మనిషి మనుగడను ఎటు తిప్పుతుందో వేచిచూడాల్సిందే.

---

## చంపడం అతని వృత్తి

**జో** ఫెరెట్టీ వయసు డెబ్బైతొమ్మిది. అయినప్పటికీ అతనింకా అమెరికన్ ప్రభుత్వ ఉద్యోగిగానే వున్నాడు. అందరిలా 60 ఏళ్లకి రిటైర్ కాలేదు. అతను రిటైర్ అవుతానన్నా అధికారులు వద్దని బతిమాలుతున్నారు.

అతను సాన్‌కెన్‌టిన్ అనే జైల్లో డెత్‌వాచ్ ఆఫీసరుగా పనిచేస్తున్నాడు. అతని 29 ఏళ్ల ఉద్యోగజీవితంలో మొత్తం 126 మందికి విజయవంతంగా మరణశిక్ష అమలుపరచడంలో బాధ్యత వహించాడు. తన 50వ ఏటదాకా అతను ఆ జైల్లో మెయిన్ గేట్ ఆఫీసర్‌గా పనిచేసేవాడు. పైపోస్ట్ ఖాళీ అవడంతో అందులో చేరదామనుకున్నాడు. దానికి అతని భార్య కూడా ఏమీ అభ్యంతరం చెప్పలేదు. నిజానికి ఆ ఉద్యోగంలో చేరడానికి ఎక్కువమంది ముందుకురారు. ఎందుకంటే నేరస్థుడికి మరణశిక్ష సక్రమంగా అమలు జరిపేలా చేయడం డెత్‌వాచ్ ఆఫీసర్ ప్రధాన బాధ్యత.

అమెరికాలో ఎలక్ట్రిక్ ఛెయిర్‌లో కూర్చోబెట్టి మరణశిక్షను అమలుపరుస్తారు తప్ప ఉరి తీయరు. (ప్రస్తుతం విషం ఇంజెక్షన్ ఇచ్చి చంపుతున్నారు) మరణశిక్ష అమలుకు తగ్గ అన్ని ఏర్పాట్లూ చేయాల్సిన బాధ్యత ఇతనిదే.

గ్యాస్‌ఛాంబర్ అని పిలవబడే గదిలో మరణ శిక్షను అమలుపరుస్తారు. ముగ్గురు ఒకేసారి మూడు స్విచ్‌లని వేస్తారు. అందులో రెండు డమ్మీ స్విచ్‌లు. ఒకటి మాత్రమే ఎలక్ట్రిక్ ఛెయిర్‌లోకి విద్యుత్‌ని పంపే స్విచ్. ఎవరు ఆ మరణశిక్షను అమలు జరుపుతున్నారో తెలియకూడదని ఈ ఏర్పాటు. ఈ ముగ్గురినీ ప్రతిసారీ ఎన్నుకొనే బాధ్యత జోఫెరెట్టీదే. మరణశిక్ష అమలుపరిచే విధానం మీద తొమ్మిది పేజీల అధికారిక మాన్యువల్ వుంది. విద్యుద్ఘాతానికి ముందు ఏరకం రసాయనిక పదార్థాలు వాడి నేరస్థుడిని స్పృహ తప్పించాలి అన్న విషయం మొదలుకొని అతని శవాన్ని ఎలా బయటకు తీయాలి అన్న విషయం దాకా ఆ మేన్యువల్‌లో వుంటుంది.







అయితే అదంతా జోకి కొట్టినపిండే. (డుపాంట్ కంపెనీ తయారుచేసే సోడియం సైనైడ్ ఒక ఔన్స్ వాడతారు) నేరస్థుడు మరణించాక హైడ్రోసయానిక్ గ్యాస్ మాస్క్‌ని, రబ్బరు గ్లవ్స్‌ని వాడి శవాన్ని పరిశీలించి, పూర్తిగా ప్రాణం పోయినట్టు ధృవీకరిస్తారు. అంతకుముందు శవం నెత్తిపై జుట్టును అటూ ఇటూ చెరిపి అందులో చిక్కుకున్న విషవాయువును బయటకు వెళ్లగొడతారు. నేరస్థుడికి కొత్త జీన్స్‌పాంట్, తెల్ల షర్టు తొడుగుతారు. వాటికి జేబులుండవు. (అందులో విషవాయువు చిక్కుకుంటుందనే ఉద్దేశంతో జేబులుంచరు) అలాగే అండర్‌వేర్, బూట్లు కూడా వేసుకోనివ్వరు.

నేరస్థుడు మరణించాడని ధృవీకరించాక ఎలక్ట్రిక్ చెయిర్ వుండే అద్దాల గదిలోని విషవాయువుని ఆ గదిలోంచి గొట్టం ద్వారా అరగంటపాటు బయటకు పంప్ చేస్తారు. మరణశిక్ష పడ్డ మనిషి మరణించడానికి సగటున 10 నిమిషాల టైము పడుతుంది. ఈ మొత్తం కార్యక్రమం పర్యవేక్షించినందుకుగాను జోకి 15 డాలర్లు అదనంగా చెల్లిస్తారు.

---

## రక్షణ కవచం

బ్రిటన్‌లోని సౌత్‌సీకి చెందిన పీటర్ స్కాట్ తన భార్యని చంపడానికి ఏడు సార్లు ప్రయత్నించాడు. కానీ సాధించలేక పోయాడు.

1980లో తన భార్య గ్లోరియా పేర రెండు లక్షల యాభైవేల పౌన్లకి ఇన్సూరెన్స్ తీసుకున్నాడు. ఆ డబ్బు దక్కించుకోవాలని మొదటగా ఆమె తినే స్ట్రాబెరీలో పాదరసాన్ని కలిపాడు. అది తిన్నా

ఆమెకేం కాకపోవడంతో రెండో ప్రయత్నంగా అతనామెని యుగొస్లేవియా దేశానికి తీసుకెళ్లాడు. ఓ కొండ శిఖరంమీంచి ఆమెను తోసేయాలని తీసుకెళ్లాడుగానీ సరిగ్గా ఆ సమయానికి కొందరు జర్మన్ యాత్రికులు రావడంతో ఆ ప్రయత్నం విఫలమైంది.

తిరిగి బ్రిటన్ వచ్చాక ఆమె తినే భోజనంలో చికెన్ పాక్స్ వైరస్‌ను కలిపాడు. దాంతో ఆమెకి చికెన్‌పాక్స్ వచ్చినా సలక్షణంగా కోలుకుంది. అయితే చాలా బలహీనపడిపోయింది. ఆ సమయంలో ఆమె ఇంట్లో పడుకుని వుండగా ఇంటికి నిప్పు పెట్టాడు. సౌత్‌సీలో తాస్‌వెల్ రోడ్‌లోని ఆమె ఇల్లు కాలిపోయిందిగానీ ఆమెకి ఏం కాకుండా ఆ మంటల్లోంచి తప్పించుకోగలిగింది. ఓసారి ఆమె రోడ్డుమీద నడిచి వెడుతుండగా వెనకనుంచి కారును స్పీడుగా పోనిద్దామని, పోలీసు ఎంక్వయిరీలో బ్రేకులు సరిగ్గా పనిచెయ్యడం లేదని చెబుదామని అనుకున్నాడు. కానీ ఆ కారు సరిగ్గా ఆమె వద్దకు వచ్చేసరికి బ్రేకు బిగిసిపోయి కీచుమంటూ ఆగిపోయింది. అలాగే మరికొన్ని ప్రయత్నాలు విఫలమయ్యాయి. ఆఖరి ప్రయత్నం ఆమె దుస్తుల్లో విషపు సాలెపురుగును పెట్టడం. మొత్తం ఈ ప్రయత్నాలన్నీ పోలీసుల దృష్టికి వెళ్లడంతో భర్తపై అనుమానంతో ఇంటరాగేషన్ చేశారు పోలీసులు. నిజం కక్కించారు. అయితే అతడు చివరకు నేరం ఒప్పుకుని ఎన్నిచేసినా నా భార్య చావలేదే అని వాపోయాట్ట. భర్తను విపరీతంగా ప్రేమించే గ్లోరియా మాత్రం ఇవన్నీ విని నిర్ఘాంతపోయినా ఆనక ఆయన్ని క్షమించేసింది. చూస్తే ఆమె ప్రేమ ఆమెకు రక్షణ కవచంలా పనిచేసినట్టు అనిపిస్తోంది.





# చతుర కతలు

తిరుమలశ్రీ

## ఇన్సల్ట్

సుందర్రావు ఇంటిమీద ఇన్‌కంటాక్స్ రెయిడ్ జరిగింది. అప్పట్నుంచీ సిగ్గుతో వీధిముఖం చూడడం లేదతను.

సుందర్రావు ఓ ఇంటర్నేషనల్ ఆర్గనైజేషన్‌లో మంచి పొజిషన్‌లో వున్నాడు. పోష్ కాలిటీలో స్వంత ఇల్లుంది. నిజాయితీ పరుడన్న పేరుంది.



ఆ కాలనీలో తరుచు ఏదో ఒక ఇంట్లో ఆనవాయితీగా ఇన్‌కంటాక్స్ రెయిడ్ జరుగుతూంటుంది. నల్లధనం బయటపడుతుంటుంది. ఆ తరువాత ఏం జరుగుతుందో ఎవరికీ తెలీదు. ఆ వ్యక్తులు మాత్రం ఏమీ జరగనట్టే తిరుగుతూంటారు!

చెడ్డ రోజులొస్తే పాత చెప్పులు కూడా కరుస్తాయట! 'ఆకాశ రామన్న' ఎవడో ఉత్తరం రాయడంతో సుందర్రావు ఇంటిమీద కూడా రెయిడ్ జరిగింది. అప్పట్నుంచీ వీధి మొఖం చూడని సుందర్రావుని తల చుకుని జాలిపడ్డారు అతని మిత్రులు. ఓదార్చడానికని వెళ్లారు.

మాసినగడ్డం, నలిగిన దుస్తులతో దీర్ఘ రోగిలా తయారయ్యాడు సుందర్రావు.

ఇన్‌కంటాక్స్ రెయిడ్లూ, సి. బి. ఐ. రెయిడ్లూ ఈ రోజుల్లో సర్వసామాన్యమనీ, అవిప్పుడు స్టేటస్ సింబల్స్ అనీ బోధించబోయారు మిత్రులు.

"ఇంత జరిగాక నేనెలా తలెత్తుకు తిరగ్గలను? " అన్నాడు సుందర్రావు దిగులుగా.



"ఈ కాలనీలో ఎందరి ఇళ్లలో రెయిడ్సు జరగలేదు? వాళ్లంతా ఇలాగే మూల కూర్చున్నారా? అన్నారు మిత్రులు.

"నిజానికి నీ ఇంట్లో నల్లధనం ఏమీ దొరకలేదని ఆ డిపార్ట్‌మెంట్ ప్రకటించిందిగదా!"

"అదే, అదేగా నా బాధ! ఈ కాలనీలో రెయిడ్స్ జరిగిన అందిరి ఇళ్లలోనూ బస్తాలకొద్దీ ఆస్తులు దొరికాయి. నా దగ్గర ఒక్క పైసా కూడా ఎక్స్‌ట్రా మనీ దొరక్కపోవడం ఎంత ఇన్‌సల్టూ!? అంతకంటే అవమానం ఇంకేముంటుంది? ఈ కాలనీ వాళ్లకు నా ముఖం ఎలా చూపించను? " వాపోయాడు సుందర్రావు.

ఖంగుతిన్నారు అతని మిత్రులు. "ఇంతకూ నువ్వు ఫీలవుతున్నది రెయిడ్ జరిగినందుక్కాదూ? " అన్నారు ఆశ్చర్యంగా.

"కాదు. వాళ్లలా నా దగ్గర ఏమీ దొరకలేదన్న కారణంగా కాలనీవాళ్లు నన్ను చిన్నచూపు చూస్తారనే నా బాధంతాను" అన్న సుందర్రావు సమాధానం వింటూనే 'ఆc...!? ' అంటూ మూకుమ్మడిగా మూర్ఛబోయారు మిత్రులంతా.

---

## వెక్కిళ్లు

ఆరోజు ఆఫీసునుంచి బాగా ఆలస్యంగా వచ్చాడు పుల్లారావు. భోంచేశాక ఆరంభమయ్యాయి ఆ మాయదారి వెక్కిళ్లు. హఠాత్తుగా, ఏమాత్రం నోటీసివ్వకుండా!

మంచినీళ్లు తాగాడు. మజ్జిగ తాగాడు. స్వీట్ తిన్నాడు. పటికబెల్లం బుగ్గను వేసుకున్నాడు. ఇంకా ఏమేమో చేశాడు. లాభంలేకపోయింది. క్రమక్రమంగా వాటి వుధృతం ఎక్కువయిందేగాని ఏమాత్రం తగ్గలేదు. గుండెల్లో గునపంతో పొడుస్తున్నట్టుంది.

భర్త అవస్థచూసి కంగారుపడిపోయింది వెంకటలక్ష్మి. ఏం చేయాలో



తోచలేదు. అంతలోనే హఠాత్తుగా గుర్తు కొచ్చింది. ఎప్పుడో ఎక్కడో చదివిన విషయం. వెక్కిళ్లతో బాధపడేవారికి షాకింగ్ న్యూస్ ఏదైనా చెబితే ఠక్కున ఆగిపోతాయట.

అంతవరకూ వెక్కిళ్లు ఎలా తగ్గుతాయా అని ఆలోచించిన వెంకటలక్ష్మి, ఇప్పుడు అతనికి షాక్ కలిగించే విషయం ఏమిటా అని యోచనలో పడింది. వేలు ఖరీదు చేసే పట్టుచీరె పెళ్ళాం అప్పుచేసి మరీ కొన్నదంటే అంతకు మించిన షాకింగ్ న్యూస్ ఇంకేముంటుంది మొగుడుకి!

అందుకే భర్తతో, "ఏమండీ! మీతో ఓ ముఖ్యమైన విషయం మాట్లాడాలి" అంది వెంకటలక్ష్మి, భర్త గుండెలమీద చేత్తో రాస్తూ. "ఈ పాడు వెక్కిళ్లు రావడంతో ఇంతసేపూ వూరుకున్నాను"

ఆమె అలా అనేసరికి పుల్లారావు గుండె ఎందుకో గతుక్కుమంది.

"వెక్కిళ్లు ఇంకా వస్తూనే వున్నాయి గదా!" అన్నాడు వెక్కుతూనే.

"ఇవాళ పట్టుచీరెలు అమ్మొస్తే పక్కింటి పిన్నిగారి దగ్గర అయిదువేలు అప్పుచేసి కొన్నాను" అందామె తాపీగా.

"ఆ!? " అన్నాడు పుల్లారావు. అంతే! వెక్కిళ్లు ఆగిపోయాయి.

తన ప్రయత్నం ఫలించినందుకు సంతోషంతో వుక్కిరిబిక్కిరయి, అది కేవలం షాక్ ట్రీట్‌మెంటేనని చెప్పబోయిది వెంకటలక్ష్మి.

అయితే పుల్లారావు పరిస్థితి వేరు. ఆరోజు సాయంత్రం తాను తన గర్ల్ ఫ్రెండుతో లుంబినీ పార్క్‌లో మజా చేస్తుండగా పొరుగింటి ఆండాళ్లు కనిపించింది. ఆమె తమను చూసిందేమోనని అతని అనుమానం. చూస్తే వెంకటలక్ష్మిని కాల్చక మానదు, తమ కొంప కూల్చక మానదు. అందుకే ముందెత్తుగా భార్యను మంచి చేసుకోవాలని ఆలోచిస్తున్నాడు. అందుకే ఆమె తనతో ఏదో ముఖ్యవిషయం మాట్లాడాలనుకుంటున్నానని చెప్పినప్పుడే భయంతో అతని వెక్కిళ్లు ఆగిపోయాయి 'విషయం' పూర్తిగా ఆలకించకముందే! ఆ విషయం ఇద్దరూ గమనించలేదు.

వెంకటలక్ష్మి చెప్పింది విని, "అరె! పట్టుచీరె మరీ అంత తక్కువ ఖరీదుది తీసుకోకపోతే, కనీసం పదివేలదైనా తీసుకోలేకపోయావా? " అన్నాడు పుల్లారావు, పెళ్లాన్ని మంచి చేసుకోవడానికి ఛాన్సు దొరికిందన్నట్టు.

ఎదురు చూడని ఆ రియాక్షన్‌కి స్టన్నయి, "నిజంగానా? " అనడిగిందామె నమ్మలేనట్లుగా.

"నిజంగానే అంటున్నాను వెంకూ! నీ మీదొట్టు!" అన్నాడు పుల్లారావు.

అంతే!

వెంకటలక్ష్మికి ఆరంభమయ్యాయి. వెక్కిళ్లు- షాక్‌తో!

---

## వన్-డే వండర్

**అ**ప్పారావు తన పేరు తానే మరిచిపోయాడంటే అతిశయోక్తికాదు! అంతా అతన్ని అప్పుల్రావనే పిలుస్తారు మరి. ఊరంతా అప్పులు చేసేవాణ్ణి అలా పిలివడం సబబేనంటుంది అతని భార్య.

'సమసమాజ నిర్మాణం' ఏదేశానికైనా ఆదర్శం. ఆ ఆదర్శం నెరవేరాలంటే మనుషులమధ్య ఆర్థిక వ్యత్యాసాలు ఎక్కువగా వుండకూడదు. సంపన్నుడు అధిక సంపన్నుడు' అన్న వర్గానే తప్ప 'గొప్పవాడు పేదవాడు అన్న' కేటగిరీస్ వుండకూడదు. అందుకు ఉన్నవాడు తన

సంపదను లేనివాడితో పంచుకోవాలి. 'హేవ్స్' 'హేవ్‌నాట్స్'ను ఆదుకోవాలి. అందుకు నిదర్శనం అభివృద్ధి చెందిన దేశాలు అభివృద్ధి చెందుతూన్న, వెనుకబడియున్న దేశాలకు గ్రాంట్సుగానూ, ఋణాల రూపంలోనూ చేసే సహాయమే. అలాగే ఉన్నవాడు లేనివాడితో అప్పు రూపంగానైనా తన సంపదను పంచుకుంటూంటాడు. అందుకు 'వడ్డీ' అన్నది మోటివేషన్‌కి పెట్టుకున్న ముద్దుపేరు. అప్పివ్వడం ఉన్నవాడి బాధ్యత. అప్పు తీసుకోవడం లేనివాడి హక్కు! ఈ సూత్రమే నా చేత ఊరంతా అప్పులు చేయిస్తోంది. అందులో తప్పులేదు. అందుకు ఎవరుగాని సిగ్గుపడవలసిన, చిన్నబుచ్చుకోవలసిన అవసరంలేదు. అంటూ పెద్ద లెక్చర్ దంచుతాడు అప్పారావు. సారీ అప్పుల్రావు.

అతని లాజిక్‌తో బుర్ర గిర్రున తిరిగిపోయి, ఇంకాసేపు వుంటే ఎక్కడ పిచ్చెక్కుతుందోనన్న భయంతో అతనికి అప్పిచ్చి వదిలించుకుంటూంటారు.



అయితే, తీసుకున్న అప్పు తీర్చినవాడు మరుజన్మలో కంచర గాడిదయి పుడతాడని వాళ్ల అమ్మమ్మ చెప్పిందంటాడు. అమ్మమ్మ మాట తనకు వేదంతో సమానమంటాడు. అందుకే అటువంటి పొరపాటు ఎప్పుడూ చేయడతను.

ఆమధ్య అప్పులవాళ్ల వొత్తిడి పెరగడంతో తనకు జ్ఞాపకశక్తి తగ్గిపోయిందనీ, ఎవరి దగ్గరా తాను అప్పు తీసుకున్న గుర్తులేదనీ అనడం ప్రారంభించాడు. జ్ఞాపకం వస్తే వడ్డీ పైసలతో సహా వారి అప్పులు తీర్చేస్తానని హామీ ఇచ్చాడు. అంతేకాదు జ్ఞాపకశక్తి పెంపొందడం కోసం ట్రీట్‌మెంటు తీసుకుంటున్నానంటూ ట్రీట్‌మెంట్ పేరు చెప్పి ఎదురు వారిదగ్గర మరి కొంత సొమ్ము అప్పు కూడా తీసుకున్నాడు.

అప్పుల్రావుకి అప్పులిచ్చిన వారంతా హతాశులై ఓ 'సంఘం' పెట్టుకున్నారు సమిష్టిగా ఆ సమస్యను సాల్వ్‌చేసుకోవా

లన్న ఆశతో, ఆశయంతో అందుకు తరుణోపాయం ఆలోచిస్తూన్న తరుణంలో ఓ పత్రికలోని ప్రకటన ఒకటి అమితంగా ఆకర్షించుకుంది వారిని. 'ఒక రోజు అద్భుత జ్ఞాపకశక్తి కోర్సు' అన్న ఆ ప్రకటన 'వడ్డీ డబ్బులు ముట్టినంత' ఆనందంలో ముంచేసింది వారిని. తమ స్వంతఖర్చుతో అప్పుల్రావును ఆ కోర్స్‌కి పంపించాలని నిశ్చయించుకున్నారు. అతని జ్ఞాపకశక్తి తిరిగివస్తే తమ బాకీలు తీర్చుతాడన్న ఆశ!

"నా జ్ఞాపకశక్తి ఇంప్రూవ్ అయితే మీకు లాభంకాని, నాకేం లాభం? నేను ఆ కోర్స్‌కి వెళ్లనుగాక వెళ్లను!" అంటూ మొండికేశాడు అప్పుల్రావు. అతన్ని ఒప్పించడానికి అందరూ అతనికి మరో రౌండు అప్పులివ్వక తప్పలేదు.

'సంఘం' ఖర్చుతో 'ఒకరోజు అద్భుత జ్ఞాపకశక్తి కోర్సు'కి ఫెటెండయ్యాడు అప్పుల్రావు. మర్నాడు అతన్ని కలుసుకున్నారు 'సంఘం' సభ్యులు. వారిని చూడగానే, "మీ ఎసోసియేషన్ సభ్యులందరికీ ఎవరికి ఎంతెంత బాకీ వున్నానో ఇప్పుడు జ్ఞప్తికి వచ్చింది నాకు. త్వరలోనే వడ్డీతోసహా మీరుణాలు తీర్చేస్తాను" అన్నాడు అప్పుల్రావు.

అతని పలుకులు వారి చెవులను అమృతపు సోనలతో తడిపాయి. అతనప్పుడే అప్పులు తీర్చేసినంతగా సంతోషానికి గురయ్యారంతా. ఆ 'కోర్సు' యొక్క అద్భుతానికి అబ్బురపోయారు.

అయితే

రెండు రోజుల తరువాత అతను ఎవరికెంత బాకీపడ్డాడో లెక్కలు రాసి అప్పుల్రావు దగ్గరకు తీసుకువెళ్లిన 'సంఘం' సభ్యులకు హైవోల్టేజ్ షాక్ తగిలింది. కారణం ప్రతి ఒకర్ని "ఎవరు మీరు? ఎందుకొచ్చారు? " అని ప్రశ్నించసాగాడతను. వాళ్లంతా ఎవరో తానెరుగననీ, అంతకు మునుపెప్పుడూ వారిని చూసిన గుర్తుకూడా లేదనీ దబాయించాడు.

నెత్తీ నోరూ మొత్తుకున్నారంతా "ఇంతకుముందే నయం! అప్పు సంగతి జ్ఞాపకం లేకపోయినా అప్పిచ్చిన వాళ్లను గుర్తుపట్టేవాడు. ఇప్పుడు మొదలుకే మోసం వచ్చింది" అంటూ.

అంతా కలిసి 'కోర్సు'నిర్వాహకుల వద్దకు పరుగెత్తి, నిలదీశారు.

"కోర్సులో పాల్గొన్న మర్నాడు అతని జ్ఞాపకశక్తి అద్భుతంగా పనిచేసిందని మీరే వొప్పుకున్నారుగా? " అన్నారు నిర్వాహకులు.

"ఔను అది ఆ ఒక్కరోజే! ఆ తర్వాత అంతకుముందున్నది కూడా పోయింది" అన్నారు సభ్యులు. "అంటే మీ కోర్సు పని చేయకపోగా, వున్న మతికూడా పోగొట్టిందనేగా? "

"సారీ! మీరు అపార్థం చేసుకున్నారు. మా ప్రకటనను మరో సారి జాగ్రత్తగా చదవండి. 'ఒకరోజు అద్భుత జ్ఞాపకశక్తి కోర్స్' 'ఒకరోజు' అన్నాంగాని, 'ఒకరోజులో' అనలేదుగదా!" అన్నారు నిర్వాహకులు తాపీగా.

"అంటే? " తెల్లబోయారు సభ్యులు.

"మా కోర్స్ మూలంగా 'ఒకరోజు' అద్భుత జ్ఞాపకశక్తి కలుగుతుందన్న మాట!" వివరించారు నిర్వాహకులు. "లేకపోతే 'ఒక్కరోజులోనే' అద్భుత జ్ఞాపకశక్తి అబ్బుతుందనుకోవడం అమాయకత్వమే కాదు, అత్యాశకూడాను! కాదంటారా? "

అందులోని మెలిక అర్థంకావడంతో, "ఆ...? " అంటూ షాక్‌తో మూకుమ్మడిగా మూర్ఛబోయారు సభ్యులందరూ.





# ఏరినముత్యాలు

✲ గొప్పగుణాల ఎదుగుదలకు నిర్భయత్వం లేదా ధైర్యం అవసరం తప్పదు.

– మహాత్మాగాంధీ

✲ గడచిన వాటి గురించి చెప్పేవారు అల్పులు. వర్తమానంలో బతికే వారు వివేకవంతులు, భవిష్యత్తు గురించి తలపోసేవారు మేధావులు.

– డీఫె

✲ డబ్బు మాట్లాడుతున్నప్పుడు మధ్యలో మాట్లాడేవారే ఉండరు.

–హెర్బర్ట్‌వి ప్రాచ్‌నౌ

✲ మంచితనమనే పెట్టుబడి ఎప్పటికీ లాభాలనే పంచుతుంది.

– జాన్

✲ మంచి ఉద్దేశాలకన్నా మంచి పనులే మంచివి.

– లాఫొంటేన్

✲ వినయం అన్నది గాలితిత్తిలాంటిది. అందులో ఏమీ లేకపోవచ్చు. కానీ కుదుపులనుండి మనకు అద్భుతమైన ఉపశమనాన్ని ఇస్తుంది.

–లెస్సింగ్

✲ మీ ఆలోచనల స్థాయిపైనే మీ జీవితపు ఆనందం ఆధారపడి ఉంటుంది.

– ఎం.ఔరేలియస్

✲ మాటలుండి హృదయంలేని ప్రార్థనకంటే మాటలు లేని హృదయమున్న ప్రార్థన ఉత్తమమైనది.

– గాంధీజీ

✲ మనల్ని గురించి మనం గొప్పగా ఆలోచించడం మాని ఇతరులను గురించి ఎక్కువగా ఆలోచించడమన్నది మంచి సంస్కారంపై ఆధారపడి ఉంటుంది.

– మార్క్ ట్వెయిన్

✲ మీ పిల్లల చేత ద్వేషింపబడకుండా మీరు తల్లిదండ్రులు కాలేరు.

– బెట్టిడేవిస్

✲ చదవడం అంత చౌకైన వినోదం కానీ అందులో కలకాలం నిలిచిపోయే సంతోషం గానీ మరొకటి లేదు.

– లేడీమేరీ ఒర్టెలే మాంటెగ్యు

✲ మంచి సలహాకు మించిన విలువైన కానుక మరొకటి లేదు.

– ఎరాస్మస్

సేకరణ: పి.వి. రమణ కుమార్

# 'ప్రేమంటే...?' పై సమీక్షలు

జూలై చతురలో ప్రచురితమైన రాజా రమేష్‌వర్మ నవల **'ప్రేమంటే...?'** పై మాకందిన ఉత్తమ సమీక్షల్ని ఈ దిగువన ప్రచురిస్తున్నాం

## అడ్డుకట్ట

*(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

ప్రేమకు, ఆకర్షణకు తేడా తెలియని లేత వయసులో ప్రేమే ప్రధానమని చిత్రీకరించే నేటి సినిమాల ప్రభావం వల్ల యువతలో ఆవేశపూరిత నిర్ణయాలు ఆలోచనలను అణగదొక్కేస్తున్నాయి. లవ్ ఫెయిలైతే ఆత్మహత్యే శరణ్యమనుకుని ప్రేమావేశంలో పడి కొట్టుకుపోతున్న ప్రేమికులకు అడ్డుకట్ట వేసి ఆలోచింపజేస్తుంది రాజా రమేష్‌వర్మగారి 'ప్రేమంటే' నవల.

చాలా డీప్‌గా పరిశీలిస్తే తప్ప అంతుబట్టని రమేష్‌లోని చిరు శాడిజాన్ని రచయిత మలచిన తీరు బాగుంది. సింధు తనని మాత్రమే ప్రేమించాలని భావించే రమేష్ తన అహంభావంతో ఆమెకి ఆప్యాయత, అనురాగం పంచలేకపోయాడు. సింధు సున్నిత మనస్కురాలు కాబట్టి ప్రేమ పేరుతో తన గ్రిప్‌లో పెట్టుకుని ఆమెని శాసించాలని చూశాడు. ఎదుటివారిని శాసించి ప్రేమను పొందాలని కోరుకునే వారికి రమేష్ పాత్ర ఒక గుణపాఠం అవుతుంది.

ప్రేమ ఎంతో గొప్పదైనా ఇద్దరు విరుద్ధ స్వభావాలు కలిగిన వ్యక్తులు కలిసి బతకటానికి ప్రేమ కొంతవరకే వారిని కలిపి ఉంచుతుంది. కాబట్టి ప్రేమించేముందు ఎదుటివారి నడవడికను పరిశీలించమన్న శ్రీనివాస్ మాటలు ప్రేమికులకి శిరోధా



ర్యాలు. శ్రీనివాస్ సవిత ఇంటికి వెళ్ళినప్పుడు కానీ, ఆమె శ్రీనివాస్ ఇంటికి వచ్చినప్పుడు కానీ వారి తల్లితండ్రులు ఎందుకు అనుమాన పడలేదు అని పాఠకులకు వచ్చిన సందేహం వారి పెళ్లికి పెద్దలు గ్రీన్ సిగ్నల్ ఇవ్వడంతో సమాధానపడుతుంది. ద్వేషంతోకాక అహాన్ని త్యజించటంవల్లనే ఎదుటివారిని జయించవచ్చని చెప్పే 'రమేష్ యశ్వంత్ కాళ్లు పట్టుకోబోయిన సన్నివేశం' నేటి తరానికో చిరు సందేశం.

**– కర్నాటి దుర్గాభవాని**
*విజయవాడ - 10*

## మార్గదర్శకం

***(రెండవ బహుమతి రూ. 75/– పొందిన సమీక్ష)***

**రాజా** రమేష్ వర్మ ప్రేమంటే నవల ఆద్యంతం అలరించింది. నవలలోని పాత్రల స్వభావం నిజ జీవితంలోని వ్యక్తుల స్వభావాలకి దగ్గరగా వుంది. పాత్రల చిత్రీకరణ, సందర్భోచిత సంభాషణలు, ఆయా సందర్భాలకి తగిన పరిస్థితులు కథలో కళ్లకి కట్టినట్లుగా చూపించారు.

పూర్వం ప్రేమంటే ఒక ఆరాధన, నమ్మకం. ఒకరి వ్యక్తిత్వానికి లేక అతని మంచితనానికో, ఆశయాలకో ఆకర్షింపబడి ప్రేమ కలిగేది. కానీ, ఇప్పుడు ప్రేమంటే అర్థం మారిపోయింది. టైంపాస్ ప్రేమలు కొన్నైతే ఆకర్షణకే ప్రేమని పేరు పెడుతూ కొంతకాలం అంటే ఆ ఆకర్షణ తగ్గేంతవరకు కలసి తిరగడం తర్వాత ఏవేవో కారణాలు చూపుతూ విడిపోయి వేరే వ్యక్తిని పెళ్లిచేసుకోవడం. ఎవరినైనా మనస్ఫూర్తిగా ప్రేమిస్తే వారిని వదులుకోవడం కష్టం. కానీ రక్తసంబంధం కన్నా ప్రేమబంధం గొప్పది కాదని ఎంతో వివరంగా చెప్పారు.

నిజమే 20 - 25 సం.లు పెంచిన తల్లిదండ్రులని కాదని నెలలోనో, సంవత్సరంలోనో పుట్టే ప్రేమ గొప్పదంటూ బయటకు వెళ్లిపోవడం ఎంతవరకు సమంజసం. ప్రేమ పెళ్లికాని ఆడ, మగ మధ్య మాత్రమే ఉంటుందా? మరి తల్లితండ్రులకి, వారి పిల్లలకి మధ్య ప్రేమ ఉండదా? అన్నాచెల్లెళ్ల మధ్య ప్రేమ ఉండదా? స్నేహితులమధ్య ప్రేమ ఉండదా? ఈ బంధాలలో దేనిలోనైనా ప్రేమ ఉంటుంది. వీటిలో ఉండే ప్రేమ నిస్వార్థమైనది. కానీ ఆడ, మగ మధ్య స్వార్థంలేని ప్రేమ ఖచ్చితంగా ఉండదు. ప్రేమకి అందం, చదువు, ఆస్తి, గౌరవం ఏవీ అవసరం ఉండవని కులానికి, మతానికీ ప్రేమ అతీతమైనదంటారు. మరి కురూపిని, పేదవారిని, అనాథలని ఎవరూ ప్రేమించరేం? అంటే అంతా అబద్ధమేగా.

ప్రేమంటే కలిసి తిరగడం కాదని, కలసి తినడం, షికార్లు కావని ప్రేమంటే ఒకరిపై మరొకరికి పూర్తి నమ్మకం ఉండాలని, ఒకరి అభిప్రాయాలకి మరొకరు గౌరవం ఇవ్వాలని, ప్రేమించే వ్యక్తితో జీవితాంతం కలిసి ఉండగలననే నమ్మకం ఉంటేనే ప్రేమించాలి అనీ అటువంటి వ్యక్తినే ఎంచుకోవాలంటూ వర్మగారు చక్కగా వివరించారు. నేటి యువతకి ఇటువంటి రచనలు మార్గదర్శకం అవుతాయి.

**– ఎమ్. రాధాజ్యోతి**
విజయవాడ

## భావసామ్యత

***(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)***

**జీవిత** భాగస్వాములు కావాలనుకునే యువతీయువకుల మధ్య చిగురించే ప్రేమ ఎలా వుండాలి? దానికి కారణం, ఆధారం, అవసరంలేదా? మనసుతో మనసుకి సారూప్యం, సామ్యత వుండడం సమంజసం కాదా? వయసుతో వచ్చే ఆకర్షణే చాలా?




ఈ ప్రశ్నలకు సమాధానమే ప్రేమంటే నవల సారాంశం. కలకాలం కలిసి జీవించాలనుకునేవారికి భావసామ్యత వుండాలనేదే ప్రేమంటే నవలలోని సందేశం.

నవలలో రమేశ్, సింధు, ప్రధాన పాత్రలే అయినా, శ్రీనివాస్ ద్వారానే ముఖ్యమైన మలుపు తిరిగింది కథ. వివేచనాశక్తి, దూర దృష్టి వున్న పాత్ర శ్రీనివాస్‌ది.

"నువ్వు ప్రేమించిన అమ్మాయి నీ మాట కంటే వేరే ఎవరి మాటకో విలువ ఇచ్చే స్థాయిలోవుందని నువ్వు అనుకున్నపుడు నీవు ఆమెను మరిచిపోవడమే మంచిది" అంటూ సబిత రమేష్‌కి సూటిగా, నిర్మొహమాటంగా, సమయోచితంగా సలహా ఇచ్చి నిరుత్తరుణ్ణి చేసింది.

సాధ్యాసాధ్యాల గురించి ఆలోచించకుండా తనకు కావాల్సింది సాధించి తీరాలనే మూర్ఖత్వం, మొండితనం వున్న రమేష్ భ్రష్టుడుగా మిగులుతాడు.

సౌజన్యం, అతి మంచితనం వున్న సింధు దూరాలోచన లేకుండా రమేష్‌ని ప్రేమించి సంక్షోభంలో చిక్కుకుంది.

శ్రీనివాస్ హెచ్చరికతో సకాలంలో మేలుకొంది. అతని పుణ్యమా అని గండం గడిచి గట్టెక్కింది. సహృదయుడైన రాఘవతో వివాహానికి అంగీకరించి తప్పు దిద్దుకుంది.

నవలలో కాలేజీ విద్యార్థినీ విద్యార్థుల సరస సంభాషణలు, చతురోక్తులు చదువరులకు ఆహ్లాదం కలిగిస్తాయి.

రమేష్ యశ్వంత్‌కి పాదాలు తాకి క్షమాపణ చెప్పటం, క్షణాలలో బద్ధశత్రుత్వం సమసిపోయి ఫ్రెండ్‌షిప్‌గా మారడం, పాఠకుల్ని ఆశ్చర్యంలో ముంచటం ఈ కథలో అనూహ్య సన్నివేశం.

అందితే జుట్టు అందకపోతే కాళ్ళు పట్టుకోవడం అంటే ఇదే. రమేష్‌లాంటి మొండి మనిషి అలా చేయడానికి ఒప్పుకున్నాడంటే అనూహ్యమే.

కథ ఎన్ని మలుపులు తిరిగినా చివరికి ఎలా జరిగితే బాగుంటుందో అలానే జరగడం చక్కని ముగింపు.

– **చావ అరుణ**
*హైద్రాబాద్-44*

## ఆకర్షణ-ఆరాధన

***(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)***

అనుకోకుండా అప్పటికప్పుడు పుట్టుకొచ్చే ప్రేమకు, పరిచయాలు పెరిగి, ఒకరినొకరు తెల్సుకుని, ఇద్దరి అభిప్రాయాలు ఏకమై, మనస్సులు మమేకమైనప్పుడు జనియించే ప్రేమకి చాలా వ్యత్యాసముంది. మొదటిది ఆకర్షణ, రెండవది ఆరాధన. ఆకర్షణ ఓటి కుండలాంటిదని రమేష్, సింధుల ప్రణయం ద్వారా చక్కగా నిరూపించారు రచయిత. సవిత, శ్రీనివాస్‌లు తమ ఆరాధనాపూర్వకమైన ప్రేమతో భవిష్యత్ పునాదిని బలంగా నిర్మించుకున్నారు. అందుకే వారి ప్రేమ జయించింది.

రమేష్ సింధును మనస్ఫూర్తిగా ప్రేమించానని భ్రమపడటం తప్ప అందులో నిజాయితీ లేదు. నిజమైన ప్రేమికుడు తను ప్రేమించిన ప్రియురాల్ని మాత్రమే కాదు ఆమె బంధువులను కూడా అభిమానించగల్గుతాడు. కాని రమేష్ 'మీ తల్లిదండ్రులను చంపయినా నిన్ను పెళ్లిచేసుకుంటాను' అనటం ఎబ్బెట్టుగాను, అతిశయంగాను వుంది. రమేష్ సింధుకోసం ఎంతకయినా తెగిస్తాడు అని అతని ఆవేశపూరితమైన ప్రవర్తన ఆధారంగా కథ నడిపించారు రచయిత. కాని సంపూర్ణంగా కృతకృత్యులు కాలేకపోయారు. ఎందుకంటే అతని ఉద్రేకాన్ని, పాత చింతకాయపచ్చడి కథలాగా యమ్.యల్.ఏను, విలనుగా అతని కొడుకును ప్రవేశపెట్టటం ద్వారా కాకుండా మరో కొత్తకోణంలో, నూతన పంథాలో చూపిస్తే బావుండేది.

ఎలాంటివాడయినా రమేష్‌ను హీరోగా వూహించుకొన్న పాఠకులకు క్లైమాక్స్‌లో అతను ఒక్కసారిగా పిరికివాడైపోయి, యశ్వంత్ కాళ్ళు పట్టుకుని క్షమాపణ కోరటం, బేలగా ప్రవర్తించటం అసహనంగా తోస్తుంది. అతను సింధుకోసం ఏమైనా చేస్తాడు అని నిరూపించటంకోసం ఈవిధంగా రాశారన్పించింది.

ఇకపోతే సవిత, శ్రీనివాస్‌లది నిజమైన ప్రేమే అయినా వారి సంభాషణల్లో, ప్రవర్తనలో ఎక్కడా అతిశయం లేకుండా రాశారు. ఇకపోతే భాను, మహేష్‌లను కమెడియన్లుగా చిత్రించి, చక్కని సరస, విరస, పుల్ల విరుపు సంభాషణలతో పాఠకులను రంజింపచేశారు.

శైలి విషయానికొస్తే నలుగురు కల్సి సంభాషిస్తున్నప్పుడు ఎవరు ఎవరితో మాట్లాడుతున్నారో ఒక్కోసారి కన్ఫ్యూజింగ్‌గా వుంది. మొత్తానికి రచయిత టైటిల్‌ను సార్థకంచేస్తూ, టీనేజ్ యువతీయువకులకు మంచి సందేశాన్ని అందించారు.

– విజయలక్ష్మి
మిర్యాలగూడ-508 207

## ప్రేమికులకు 'గీత'

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

పేరులోనే పెన్నిధి ఉన్నట్లు 'ప్రేమంటే' నవల ప్రేమంటే ఏమిటో తెలియజెప్పింది. ఈ నవల ఇతివృత్తం కాలేజి నేపథ్యం గల ఒక ప్రేమకథ. ప్రస్తుతం వస్తున్న మూస సినిమాల మాదిరిగానే కాలేజి వాతావరణం, స్టూడెంట్ల స్వేచ్ఛా జీవితం- ప్రేమలు- జోక్స్‌తో కూడిన సంభాషణలూ, గ్రూపుల రాజకీయాలూ, కక్షలూ- ఫైట్స్‌తో సాగింది. కాని ఈ నవలను ఉత్తమ నవలగా తీర్చిదిద్దిన ఒకే ఒక అంశం ప్రేమికులు పెళ్ళిచేసుకునే ముందు వారివారి అంతరంగాలనూ, ఆలోచనా విధానాలనూ, మనస్తత్వాలనూ, ఒకరినొకరు అర్థంచేసుకొని పెళ్ళికి నిర్ణయించుకోవాలనేది. నిజమే! ప్రేమవేరు పెళ్ళివేరు. ప్రేమ పెళ్ళితో పరిపక్వంచెంది ఆనందఫలాన్ని ప్రేమికులకు అందిస్తుంది. కాని ఆ పెళ్ళికి అర్హత ఒక్క ప్రేమే కాదు. తను ప్రేమించిన వాడి మనస్తత్వాన్ని క్షుణ్ణంగా అవగాహన చేసుకొని తను ఆ వ్యక్తితో సుఖంగా జీవించగలనా? అని ఆలోచించి ఆ వ్యక్తి తన మనస్తత్వానికి విరుద్ధమని భావిస్తే అతన్ని పెళ్ళిచేసుకోకుండా వుండటమే ఉత్తమం. ఈ నవలలో సింధు అదే నిర్ణయం తీసుకొంది. షార్ట్‌టెంపర్డ్ మెంటాలిటీగల రమేష్‌తో తను సుఖపడలేనని భావించింది. అతన్ని తిరస్కరించింది. ఆమెకు కర్త[illegible] బోధ చేసిన శ్రీనివాస్‌ను గీతాబోధచే[illegible] శ్రీకృష్ణునితో పోల్చవచ్చు ఈ నవల ప్రే[illegible] లకు భగవద్గీతలా కర్తవ్యాన్ని బోధ[illegible] వారిని ఆలోచింపచేస్తుంది. ముఖ్యంగా వయసు వేడిలో ప్రేమ పిచ్చిలో పడిన ప్రతి కన్యా తప్పక చదవవలసిన నవల ఇది.

– గుబ్బల సత్యనారాయణమూర్తి
జగ్గన్నపేట -533249

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2476685; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 220901; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2003-RN1/32186/78